గౌతు లచ్చన్న గార్లను, పశ్చిమగోదావరిలో శిరాజు వేంకటనృసింహఅప్పారావు, ప్రమతి ద్రోణంరాజు, లక్ష్మీబాయమ్మ, మూల్పూరి చుక్కమ్మ, తల్లా పగడ ప్రకాశరాయుడు, దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు, మాగంటి బాపినీడు, అల్లూరి సత్యనారాయణరాజు, బసవరాజు ప్రరంగశాయి, డాక్టరు మూల్పూరు రంగయ్య, డాక్టరు జోగయ్యశర , వీరమాచనేని వెంకట నారాయణ, వడ్లపట్లగంగరాజు, ముదిగంటి జగ్గన్న శాస్త్రిగారు, వి బి. నా. శ్వర రావు, పాలకోటి గురుమూర్తి, పకాశరావు మొదలగువారున్నూ, గుంటూరు జిల్లాలో ప్ర గొల్లపూడి సీతారామశాస్త్రి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గుళ్లవల్లి రామకృష్ణయ్య, నాగళ్ళ కృష్ణయ్య, కల్లూరి చంద్రమౌళి, బహో ండం నరసింహం గారలున్నూ, శ్రీ కొండా వెంకటప్పయ్యగారు, ఉన్నవ లక్ష్మీ నారాయణ గార్ల, నాయకత్వమున, ప్రచింతమనేని భావయ్య, శరణు రామస్వామి చౌదరి, తుమ్మల సీతారామమూర్తి, మంతెన వెంకటరాజు, కన్నెగంటి సూర్యనారాయణ, గుళ్ళపల్లి పున్నయ్యశాస్త్రి, ఇటికాల రామమూర్తి మొదలగు వారెందరో అరెస్టు అయిరి. దరిమిలా కృష్ణాజిల్లాలో డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు, ఘంటశాల సీతారామశర్మ, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, పేట బాపయ్య, అ. న్న శివాచార్య శనగవరపు వెంకటసుబ్బయ్య, మల్లాది రామచంద్రశాస్త్రి, శంకర వెంకటరామయ్య, ఇంటూరి వెంకటేశ్వరరావు, గద్దెలింగయ్య, భాగవతుల సుబ్బరామయ్య, పాదుర్తి సుందరమ్మ, రాయప్రోలు సీతారామశాస్త్రి, నూకల వీరరాఘవయ్య, కల్లూరి పాపయ్య, డాక్టరు శివలెంక మల్లికార్జునరావు, దుగ్గిరాల రాఘవచంద్రయ్య, పిడికిటి రామకోటయ్య, కాకాని వెంకటరత్నం, జొన్నవిత్తుల కుటుంబ సుబ్బారావు, పోతిన గణపతి, అద్దేపల్లి గురునాధ రామశయ్య, పెదర్ల వెంకటసుబ్బయ్య. మల్లెల ప్ర రామమూర్తి, ఊటుకూరు లక్ష్మీనరసింహారావు. అ. న్న అంజయ్య, కాకుమాను లక్ష్మయ్య చౌదరి, మరుపిళ్ళ చిట్టి, (చిన అప్పలస్వామి) కాటగడ్డ మధుసూధనరావు మొదలగువారు అరెస్టు అయిరి. దరిమిలా కృష్ణాజిల్లాలో ముట్నూరి కృష్ణారావు, తంగిరాల వీరరాఘవరావు, తంగిరాల సీతారామమ , దుగ్గిరాల బలరామకృష్ణయ్య, గొరెపాటి వెంకటసుబ్బయ్య, వల్లభనేని రామబ్రహ్మం, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, కొల్లిపర సూరయ్య, ఆతూరి నాగేశ్వరరావు, అట్లూరి ప్రరాములు, గుళ్ళపల్లి రామబ్రహ్మం, ము వి శవాచార్యులు, కాటూరి వెంకటేశ్వరరావు, అయినంపూడి ప్రనివాసులు, ఎ న్ని

సు బహ్మణ్యంగారు, యీసూర్యనారాయణగారు, గుళ్ళపల్లి (్రరాములు, రామిరెడ్డి, సుబ్బారెడ్డి, కానూరి రామానందం, కా నాథుని పూర్ణమల్లికార్జునరావు, కానూరి వెంకటరత్నం, కానూరి బలరామయ్య, బొబ్బా వీరభద్రుడు ఇందు ముఖ్యముగ నా యెరిగినంతవరకు పెద్దలపేర్లను మా తముపేర్కొన గలిగితిని. ఇంక ఎంత మందిపెద్దలో సత్యా గహమునపాల్గొనిరి. తెలియక వార్లపేర్లను ర్చలేదు. వీరు పైన పేర్కొనినవారి శ సేవకుమా తము సిపోరనిన, మన్నింప గోరెద. నాడు వీరావేశముతో సత్యా గహులు పరవళ్ళు దొక్కుచు పాడిన యములు

బాపూ యరెస్టు ( - -

వింటివా! బిటిషు వీరుల ధైర్యము-తంటాలుపడి
పట్టిరంట-బాపుజీని! అర్థరాత్రి—ఒంటిగంటకు ॥వింటివా॥
జై తయా త వేగ సాగించి, సాగించి,
రె! గాంధీజీ కరా
బడలి! ని ద చెందెను సేనతోడి,
అర్ధ! రా తి తోడనె తెల్లవాడి
సేన! వెలిగించె టార్చి, పైబడి
లేవ! పనియున్నదయ్యా, నాతోడి,
అనగ! బంది సితిమని, బాపుజీని, పట్టిరంటా॥ ॥వింటివా॥

ఉప్పు పాట ( ఏప్రియల్)

ఉప్పు వాము! పదండి!

పాణమర్పించియైన, స్వరాజ మిచ్చునట్టి (ఉప్పు)

* వారణాసి వెంకటచలం, దండమూడిపూర్ణయ్య, వెనుమర్తి లక్ష్మీ పతిశాస్త్రి, టి. వి. ఆళ్వారు, సునర్ల నా శ్వరశాస్త్రి, పురాణం సూరిశాస్త్రి, దో. పూడి సీతారామయ్య, కామి. ని వెంకటప్పయ, వల్లభ. ని తులశమ, కౌసల్యమ, గానుగొంట్ల ల నరసమ్మ గుళ్ళపల్లి, నాగయ్య మొదలగు నెందరో వేలకొలదిగ య స్టు కాబడి శిక్షింపబడిరి.

---

* ఈయన తిరుచునాపల్లిలో మరణించిరి.

## మా కొద్దీ తెల్లదొరతనము

పన్నెండు శాలు—పండుచున్నాగాని-
పట్టెడన్నమె -లోపమండి!
ఉప్పుముట్టుకుంటె - దోషమండి!
నోట మట్టికొట్టి పోతాడండి!
అయ్యో! కుక్కలతో పోరాడి-కూడు తింటామండి
'మా కొద్దీ తెల్లదొరతనము'
మా ప్రాణాలపై పొంచి -మానాలు హరియించె!

## దండాలండోయ్

దండాలండోయ్—మే—ముండ మండోయ్ ! బాబు!
ఉప్పు పన్ను—పప్పు పన్ను ఊరికెళి పన్ను బాబు!
కొప్పుకాస్త ముడికి—మొక్కుకుంటేపన్ను బాబు ॥దండాలండోయ్॥
(గరిమెళ్ళ)

## ఉప్పు పాట

ఉప్పోయమ్మ!—ఉప్పోయమ్మ, ఉప్పోయమ్మ
మా— ఉప్పుకొనరమా . ఉప్పోయమ్మ!
ఉప్పో ఉప్పని మే .మూరూర అమె దము!
చప్పున చప్పున మీరీ-యుప్పుకొన రారమ్మా !
ఉప్పేగదాయని—చప్పరింపకుడమ్మ!
ఉప్పుగాదిది—బంగరు-కుప్పా మన పాలిటికి (గరికపాటి మల్లావధాని)

ముప్పదికోట్ల ప్రజల-ముప్పు దీర్చే ఉప్పు
ఉప్పుగాదిది రత్నపు—తిప్పా మనపాలిటికి,
ఒప్పుగ స్వాతంత్ర్య—మొసగేటి దీ యుప్పు
ఉప్పుగాదిది. వ జపు—తెప్ప. మనపాలిటికి ॥ఉప్పో॥

## బందరు-అరెస్టులు ( 2 - -3 )

డాక్టరు పట్టాభి, చెరుకువాడ, నారాయణానంద, అయ్యవర, గంపల గూడెం జమీందారులకు-ఒక సంవత్సరం శిక్ష.

నడుములు కట్టి పదండి !
ఇంక తడవేల! జడియక, నడుములుగట్టి పదండి
గడియసైపగలేమీ-కఠిన పభుత్వము॥
పట్టాభిగారిని పట్టుకున్న వదలి, పెట్టాము, వదలిపెట్టాము
నోరు గట్టిన, వదలిపెట్టాము,
కాళ్ళుగట్టిన పదలిపెట్టాము,
కట్టి కొట్టి జైలునపెట్ట, విడము
ఇంక నిట్టి దుష్ట పభుత-నెట్టి రాజ్యము గెలువ నడుములుగట్టి పదండి!
చెరుకువాడ నరసింహముతో పోరు, సేయ సంకల్పించె, వీడు
ఇంచు-కరయడు, తన శక్తి . డు
ధర మెరుగడు తొలుదొల్త వీడు
ముప్పై మూడు కోట్ల సింగముల నెదిరి పోరు.

॥ నడుములుకట్టి పదండి ॥

'తత్త్వమసి' యనెడి-తత్త్వము . ర్చి, తన్మయుడై వచ్చినాడు !
లవణు। తత్త్వము గుర్తెరిగినాడు,
ఇచ్చట। తత్త్వము -రుచి చూపినాడు,
జైలు। తత్త్వ మెరుగ వెళ్ళినాడు
యా, ధన్య నారాయణా, నందుడానందింప ॥ నడుములు ॥
కా శ్వరుండెవరో-కాన-డిసుమంతైన, కాలకూటము సుమ్ము తనకు
మ్రింగి। భరియింప-జాలడా వెనుక
యోర్చి! తిమి కష్టముల నింత దనుక
ఇంక। భరియింపజాల -మా వెనుక,
కనక। దుర్గాపురీశునితో కదలు - చక చక ॥ నడుములు ॥

వెలమ బొబ్బిలి శౌర్య-వీర్యముల్ రవ్వంత - వినడొ తలపడొ చేరబట్టి।
వీడు। కులుక దల-చె మొ। పట్టి।
పాణముల ల్చి-చెండాడు। నట్టి
దిద్ది। తెలియదు, తన శక్తి, పట్టి।
దనుచు। తెలసి యాతని -శక్తి పట్టు
బట్టి। కలసి వెంట రండి। పట్టి
మన, వెలమ పులి - కోటగిరి — వేంకట కృష్ణుని జాడ
॥నడుములు కట్టి పదండి॥ (గురుజాడ)

## గేయ - వాఙ్మూలము

ది 3-5-1930 వైశాఖ పూర్ణిమకు, బందరు కరా గహారమున, సంద్రపు నీళ్ళు కాచి ఉప్పు వండి నందుకు 7 గురిని అరెస్టుచేసిరి. అందు ( ) తత్త్వానందస్వామి. మానికొండ సత్యనారాయణశాస్త్రి, గోనుగుంట్ల సు బ హ ణ్యం, కా నాథుని వీరమల్లయ్యగారు, తాడికొండ వీరభద్ర అయ్యవారు, డి వి. ఆళ్వారు, గురుజాడ రాఘవశర్మ, మొదలగువారు అందరి 9 మాస ములు కఠిన శిక్ష విధించిరి. అందులో రాఘవశర్మను బందరు సబ్ మేజస్ట్రేటు కోర్టులో, సబ్ మేజస్ట్రేటు అడిగిన ప్రశ్నలకు, . యములో అతని వాఙ్మూలము.

ప్రశ్న:- రాఘవశర గారూ ?-మీరున్నూ పదిమంది కలసి బందరు కర ఆ గహారమున, ఉప్పు శారట నిజమేనా ?
సమాధానము :- ఎక్కడ పదిమంది అండి ?

పల్లె పట్టణముల- పిల్లా జెల్లా కలసి, బందరు రేవున మేము।
ఉప్పు। కొల్లగ వండ రాము।
సం గపు। నీళ్ళు తెచ్చికాచినాము।

ప్రశ్న :-శాసన ధిక్కారము కాదా ?
జవాబు :-చట్ట ముల్లంఘించియే, కాచినాము,

కాని। చల్లని ఈ పభుత్వము
నైప। నొల్లక పదద్రోసి-నోరుకట్టెనయ్య॥

ఉప్పు సేయుట మానకింక (దాన)
చప్పున రాజ్యమ స్తంగతము పొందు ॥ఉప్పు॥
నూట నలభై మూడు - దాటీగర  కొని - నాటకమాడ దలంచె
డెబ్బది। నాలుగొకటి  ర్చి పెంచి
మనల నూటిగ బట్టగనెంచె
వీని ధాటీ మనము వే హించె
చట్టము నీట గల్పితిమి, లంఘించి
ఉప్పు నీట గల్పితి ముల్లంఘించి।
రెప్ప పాటు సైపము బ్రిటిషు పాలనము ముగిసె ॥నడుములు॥
ఎన్ని సెక్షనులున్న నున్న—వీని నెగుర తన్నిగూల్చుదము మనము।
దీని కన్న మర ములేదు గనుము।
గాంధి పన్నిన తోవిదియ జనుము।
దాన గూలు బ్రిటిషుపాలనము।
అపుడె తెల్లవారి బతుకు తెల్లవారునింక
గడియసైపగలే మింగ్లాండు ప్రభుత్వము॥ ॥నడుములుకట్టి పదండి॥

దీనికి బహుమానము 9 మానములు కఠినశిక్ష

ఈ సమిష్టి శాసనోల్లంఘనమున బయల్వెడలినవి మరికొన్ని.

## సైతాను బాధ ( మే నెల)

పడ- మీ సైతానుబాధ
ఇంక గడియ గడియకు ప్రాణకంతమగుచుండె
* తాటిగెలలునరికి తాగుడునిషేధించ తరలిన మాపైకి పీడు నిషేధించ
ధాడి సి నూటనలుభై మూడు
వెంట నోటికి తగిలించినాడు
న్యాయ మెట్టిదో గుర్తెరుగలేడు
దైవమేటికి సైచెనీ డు
మము హద్దు పద్దులేని అల్లరిగుంపంటాడు
॥పడలేమీ సైతానుబాధ॥

---

* ఈ యుద్యమమును తొలుత ప్రారంభించి, తోవజూపినవారు, వల్లభ ని రామబ్రహ ంగారు, జమీ గొల్వేపల్లి, కృష్ణా జిల్లా

లోకోత్తర పురుషుడైన మహాత్మా గాంధిగారు 1921 నుంచి 1947 వరకు సాగించిన అహింసాయుత భారతస్వాతంత్ర్య సమరమునకు . త. వారికి తోడై బాసటగా నిలచిన అకుంఠిత మేధాసంపన్నులు,అతిరథులు, మహారధులు, మహా భోగులు,త్యాగులు, దేశసేవాపరాయణులెందరో కలరు. కాక వారిని మించిన ప్రజ్ఞాశాలురుకూడ కలరు. కాని, వారి యచంచల దృఢనాయకత్వముక్రింద వీరు నమ్రై, తమ సర్వస్వమును దేశమున కర్పించిన మహానుభావులుకూడ వీరందరు. ఇట్టి మహాత్మా గాంధీగారి గురించి యెన్నియో గద్య పద్య గ్రంథములు పాటలు, పద్యములు, గేయములు భారతావని గల సమస్త భాషలలో, గాక ఖండాంతరముల గల రాజకీయ వేత్తలు, విజ్ఞానపురుషులు, ప్రజ్ఞాధురీణు లెన్నియో గ్రంథములు వెలువరించిరి. వెలువడుచున్నవి. ముందింకను వెలువడ గలవు. ఆ అహింసాచక్రవర్తి, కర్మయోగి, మహాత్యాగినిగురించి మహాకవులు వ్రాసిన పద్యములు, గేయములు యిందు ప్రచురించడమైనది. ముఖ్యముగ వారిని ప్రజాహృదయ మెట్లు సంభావించినది.

## అవతారమూర్తి (( చెరుకువాడ)

సకల ధరోపేత—సౌఖ్య సంధాత
ఆనంద సంధాయి అయిన భూమాత
స్వస్థ చిత్తము-క—సౌఖ్యంబు క
పాపభారంబింక భరియింప క
వైకుంఠమున గి వాపోయిబల్కె—
నారాయణుండు ఆనతియిచ్చె తాన
జగముల రక్షింప యుగ యుగంబులను
బహురూపముల తాన భవింతుననుచు
ఆ పెనోదార్చి యంతర్హితుండగుచు
వెడలినపిమ్మట వెలసినాడనగ
గాంధీమహాత్ముండు—కరుణసాంద్రుండు

నిర్మల లుండు–ధర్మస్వరూపి
భారత శంపు పారతంత్ర్యమ్ము
బాపనవతరించె బాపు గాంధి
సత్యధర ంబులే శస్త్రాస్త్రచయము
దౌర్జన్య విరహితత్వంబె కవచంబు
రాట్నమే చక్రమై రక్షించుమనల
ఇట్టి గాంధిమహాత్ముని ప్రస్తుతింతు
జయాభి వైభవ దిగ్విజై భవ.
వైష్ణవ జనతో ‚ కహియె–జోపీడ పరాయీ జాణె

## అత వైష్ణవుడు (దామో)

ఇతరుల కష్టము–లెవ్వండెరుగునొ
అత వైష్ణవుడు.
సతతము పరులకు–సాయము యిచ్చు
గతి తా యని, గరువము పడడో ॥అతడే॥
నాలుక పీలిన అసత్యము పల్కడొ
పరదానములకై పాకులాడడొ ॥అత ॥
రామనామమున– నుడై పోవునొ
రాజిల్లు వానిలో- నెల్లక్షే తములు ॥అతడె॥

## జగ దక్షకుడు (కొండపల్లి)

జగ దక్షకుడు గాంధిమహాత్ముడు జనులందరు
మీరెరుగండి!
జగతిని ధర్మము స్థాపనసేయగ–జని ంచిన హరి యితడండి!
హిందూ శము నుద్ధరించుటకు–హిందువుడై జని ంచెన్
హిందూసోదరులారా, మీరిది–డెందములోపల దలచండి
॥జగ దక్షకుడు॥

## గాంధి దేవ (కొండపల్లి)

ఎంతవాడ వెంతవాడవు! ఓ గాంధి వ!
నీ వెంతవాడ వెంతవాడవు ?
ఎంతవాడవయ్యా, నీవు వంతల నెగజిమ్మునట్టి
శాంతి ధర సూ తములను వింతగాను నిల్పినావు ॥ఎంత॥

## ఈ జన మిక దుర్లభమురా (బసవరాజు)

ఈజన మికదుర్లభమురా ఏజన్మసుకృతమో-యీనాడు బతికుంటె
ఈశ్వరుడె గాంధిగా-ఇల నవతరించాడు
అందులో మముగన్న-హిందూమాతకడుపున ॥యీజన్మ॥

ధర వతమూర్తి-దాల్చింది గాంధిగా
కళ్లార మనమతని-గాంచి ధన్యులమైతి ॥మీజన్మ॥

## స్వరాజ్య శంఖము (నెల్లూరు వెంక టామానాయుడు)

ఏడనున్నాడో! ౦ గాంధీదేవు దేడనున్నాడో!
ఏడనున్నాడో? ఆజాడ తెలియరాదు
నాడు కెయిరా పజల డుబాపిన తం డి
పాంచాల పు తికల-పరిభవంబులగాంచి
మించివేదన ననుభవించిన ఋషితుల్యు ॥దేడ॥

## బాపూ మాబాప్ (బసవరాజు)

పోర్‌బందర్ కోమటింట-పుట్టినాడోయ్
పురుషోత్తముడు జగతి-మెట్టినాడోయ్
కొత్తయేసు స్తు-అవతరించినాడోయ్
కొట్టగ పగవాళ్ల పొగరు-దించినాడోయ్
హిందూ పైగంబర్-జని ంచినాడోయ్
అల్లాహో అక్బరంటు-అరచినాడోయ్
చీమను సింహాసన-మెక్కించినాడోయ్
రాతి నాతిజేసిన-౹రాము నోయ్ ॥పోర్‌బందర్॥

## పరమూర్తి గాంధి (దామరాజు)

కత్తులులేవు శూలమును గాండివమున్ మొదలే హుళిక్కి నో
రెత్తి ప్రచండ వాక్పటిమ నియు జాటడు కోపతాపముల్
బొత్తిగనున్న అట్టి పరమూర్తి మనోబలశాలి గాంధి
యెత్తి నమస్కరించి స్మరియించుద మెప్డు స్వరాజ్యసిద్ధికిన్.

## గాంధి ఉవాచ (కాటూరి)

హరి సృజించెనరుని—అచ్చమ్ము తనపోల్కి
నరుడు తన్ను చాల—హరి సృజించె
ఇనుము పైడి య—నీశ్వరుం ర్చు
గాంధిపలుకు—ధర గంధమొలుకు.
కదలివోలె నెల్ల కడల నీశ్వరుండొక
బిందువై వసించు నందు నరుడు
కదలిబాసి బిందువడగారు నిక్కము
గాంధి పలుకు—ధర గంధ మొలుకు.

## రాజవన్ననీవే (విశ్వనాథ)

విరిసిన, బోసి నెన్నగవు వెన్నెల రీ తొలి ల నల్దెసల్
కురిసి, మహా సభాజన చకోరములందనియించి, వేదయై
బిరుసయి యెట్టివారి దురపిల్లిన, మా వరిపంట లు కా
విలి తలలెత్త నీ కలమ వెన్నెలనించె సుధా పవాహముల్.

సీ. నిలువనీడయులేని నిరుపేద దీర్ఘ/నిశ్వాసము నీకు వింజామరమ్ము
కడుపాకటిని దవడు వాని రు కన్నీళ్ళు ొంబడి నీకు వెల్ల గొడుగు,
సంఘ దూషకుల దౌర్జన్య భిన్నాత్మని/గుండె నీకును సభా మండపంబు
ఆజన సిద్ధ కారాగారవాసము డంబు మీరెడు కిరీటంబు నీకు,

తత దరిద్ర ప్రజాహృదంతరము నిరత
మొలుకు రతనాలు నీకొలు వున్న గద్దె

ఓ విచిత్ర సన్న్యాసి, నీ వాక్కు రుదవె
రాజువన్న, నిజమ్ముగా రాజువయ్య.

## హిమాలయోత్తుంగ శృంగం-మహాత్ము డు (బాపిరాజు)

హిమాలయోత్తుంగ శృంగం నీ బ్రతుకు
ఉమాపతి నృత్యరంగం
శాల వాంఛిల్లు
ఆశా హృదయమ్లు
లొదలి పోలేని
తల తలాలలో
జీమూల వంక్తికై
వ్యోమ మర్మముచూచి, ఓసామి!
తమో మదస్వచ్ఛమే (హిమాలయ)

## మా గాంధి (బసవరాజు)

కొల్లాయి గట్టి తే నేమి!-మా గాంధి
కులమేదియైన నేమి!-మా గాంధి
వెన్నపూస మనసు-కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై- బహు జన్సు ॥కొల్లాయి॥
నాల్గు పరకల పిలక—నాట్యమాడే పిలక
నాలుగువేదాల-నాణ్యమెరిగిన పిలక ॥మా గాంధి॥
బోసినోర్విప్పి -ముత్యాలతొలకరే
చిరునవ్వు నవ్వి -వరహాల వర్షమే ॥మా గాంధి॥

## శాంతిదూత (తుమ ల సీతారామమూర్తి)

ఇతడహింసా రణా చార్యు, డిత డ ద్వి
సత్యకవచుడు, భువనైక శాంతిదూత,
యుగ యుగమ్ములు కల్పముల్ ముగియుగాక
తరణియై మింట మెరయు, నీతని పతాక.

## అంతా గాంధిమయం (కొండపల్లి)

అంతా గాంధి మయం-యీ జగమంతా గాంధిమయం
అంతరంగమున, మహాత్మ గాంధియె,
వింత రూపముగ వెలసియుండగ-అంతా గాంధిమయం
ఇండియాలో-యింగ్లాండులో, ఆఫ్రికాలో, అమెరికాలో
అంతా గాంధిమయం.

## గాంధీ (దామో )

ఎంతో రుచియైనది-() గాంధి నామం, ఎంతో రుచియైనది,
పంతముగల వైరికైన-చింతనే గద, గాంధినామం
బాపు నామము-గాంధి నామము-చూపు జనులకు సన్మార్గము,
ఆపు జాతి బల దుర్మార్గము-అఖిల మత సమ్మోదము.

## మహాత్మా జీ (ఉప్పలపాటి వెంకయ్య)

ఎవరు దూషించి ( మి-మహాత్మ
ఎవరు భూషించి ( మి,
అవతార పురుషుడని,
ఆదర్శ ప్రాయుడని
దశదిశల్ మా ్మొగి,
ధన్యాత్ముడై నావు,
చూపు చూచాడంటె,
సమ్మోహనాస్త్రమే,
కరము జాపాడంటె
కనక వర్షమ్మే

## గాంధీ పథ (బసవరాజు)

గాంధి మహాత్ముడు బయలు దేరగా
కలకలనవ్వింది-జగత్తూ, కలకల నవ్వింది
గాంధి మహాత్ముడు చక చక నడవగ,
కంపించిపోయింది భూమి-కంపించి పోయింది.

గాంధిమహాత్ముడు-కన్ను విప్పంగా గడగడ వణికింధి।
అధర్మం గడగడ వణికింది.
గాంధిమహాత్ముడు నవ్వునవ్వగా, కన్నుల గట్టింది
స్వరాజ్యం కన్నుల గట్టింది,
గాంధి మహాత్ముడు గొంతు విప్పగా గణ గణ
మోగింది, ప్రణవము, గణగణ మ్రోగింది.

## (ప్ర)గాంధినామం (దామరాజు)

(ప్ర) గాంధినామం-మరువాం మరువాం
సిద్ధము జైలుకు-వెరువాం వెరువాం
మా గాంధి , మేం, నమ్మేం, నమ్మేం
మరి యితరుల మేము, నమా ం, నమా ం
శచరిత చెవుల-విందాం-విందాం
వే కధలు చెవుల-మందాం-మందాం.
లాటీ దెబ్బల మేము-బెదరాం బెదరాం
మేటి తుపాకికి, చెదరాం, చెదరాం
(ప్ర) గాంధి నామం-మరువాం మరువాం
సిద్ధము జైలుకు-వెరువాం వెరువాం
కూడి భారతమంత-గొలుతాం గొలుతాం
దే స్వరాజ్యాన్ని-తెస్తాం తెస్తాం
శభక్తులు మాకు-సారాం సారాం
దేశద్రోహులు మాకు దూరాం దూరాం.

## ఈ కాలపు ఋషి (చెళ్ళపిళ్ళ)

ఆత దవధూత మార్గము ననుకరించు
నిదియె బోధించు, నితరుల కలవియగునె!
స్తలకు దాని తత్త్వము వల మొక
గాంధి చెల్లె, నాత కాలపు ఋషి,

అతని భక్తియు, మరియు నల్లతని రక్తి
అతని భుక్తియు, మరియు, నల్లతని శక్తి
అతని ముక్తియు, వేరు లోకాతిశాయి
అతని చరితంబితరులకు నందబోదు,
ఛండాలుండేనియు, బా
పం దేనియు, గురుడటంచు బలికి న ధీమం
తు ండల శంకురునట్టి డ
ఖండుడు, గాంధియన నొరులుగా, రతని నముల్

## గాంధీ (దేశభక్త వెంకటప్పయ్య)

కొట్టగ కర్రలేదు, మరి కోయగ ఖడ్గము లేదు, శస్త్రముల్
పట్టగరాదు శాత్రవులు పట్టిన గొట్టిన, మి సినన్.
రట్టును రద్దు యకను రమ ని పిల్చిన తోడ బోవుచే
యిట్టిది యుద్ధపద్దతి, మరెట్టుల గెల్వగ సాధ్యమయ్యెనో

## మహాత్ముడు, (కందుకూరి రామభద్రరావు)

అతడు మెట్టిన మేర పుణ్యా మంబు
అతనిని వాక్కులు వేద భాష్యాంతరములు
అతని మౌనము లోక భయంకరమ్ము
అతడు పూనిన దీక్ష ఎహా ండ, రక్ష.

## మహాతా గాంధి (కరుణ )

నలుబదికోట్ల తము ల వితము ల కాయనమాట వేదాక్షరము ,
ధీరులం కర వీరుల గావించు, ఆయనపిలుపు శంఖారవమ్ము
సత ంబు శాంత్యహింసలకు స్వాగతమిచ్చె, ఆయన బతుకు, మహా పయోగ
కొల్లాయితో విచ్చి పుల్లాయి వలెనుండు, ఆయన దీక్ష లోకైక రక్ష.

అతడొక పవి తధర వాలయము
అతడొక విచి త విశ్వవిద్యాలయమ్ము,
ఆ మహాశక్తి అంతయింతంచు చూడ
జాల, మతడొక్క పెద్ద హిమాలయము ॥

## గాంధి

"పాల సముద్రమే నడచి వచ్చిన రీతి, హిమాచలాగ్రశృంగాలు"

—దాశరథి

"బోసినవ్వుల మంచిముత్యాలనొలకించుతాత, మన్ననగన్న నేత యితడు"

— గురుజాడ

"కట్టుకొన్నది, యంగవస్త్రము
పట్టుకొన్నది, రాట్నచక్రము"

—చక్రభొట్ల

"నవ్వవోయి గాంధీ! నా బాపూ ! గాంధీ!
మాయాంధ్య పరిపంధి: మా మహాత గాంధీ! నవ్వవోయి!"

—సారథి కృష్ణ

ఇక, స్వాతంత్ర్య సముపార్జనమునకై వారాశించి, నడిపించిన పణాళి కలలో ప్రజాహృదయము నుజ్జ్వలింప సినవి కొన్ని... ...

## బహిష్కరణోద్యమము

"నిరాకరణమను మిఠాయి యిదిగో ! బిరాన రుచి చూడండి!"

—కొండవల్లి

"దేశమాతా సేవ యం -జనులారా-భారత ॥ శమాతా॥"

—కొండపల్లి

"రా రా! పోదాము!-రాజ్యమేలుదాము!
రాజ్యంబు ఏలుచును-రంజిల్లు చుందాము;"

—గరిమెళ్ల

"కదిలింది కదిలింది - కాం గెసు రథమంది
యెత్తి యొకసారి- జోహారు సేయం

శ సేవకు మీరు- ధీరులై నడువండి
శస్వాతంత్ర్యమం- దింతుమని సాగండి॥
దాసోహమని గాంధి- దారి , నడువండి ॥కదిలింది...॥

—దామరాజు

"వినరా! నా ప్రియ సహోదరుడా! సోదరుడా!
భారత భావి- భాగ్య ఖరుడా! ॥వినరా॥"

—గరిమెళ్ల

"ఇకనైన మాన వేమిరా!- ఈ మాయ చదువు!
ఈ మాయ కొలువు, ఇక యీ మాయకోర్టు
అన్నయ్యా! అన్నా! ఇక, పెద్దన్నయ్యా! ఇకనైన॥"

—కొండపల్లి

"వద్దని , నంటి కదా! వాని జోలి మనకు నింక
వారిచదువు, మనకు నింక, వారి కొలువు, మనకు నింక"

"అన్నలార! రండి!-మన-అమ్మ నుడి వినండి!"

"ఆంగ్లబిరుదుమాని-అల ఆంగ్లకోర్టు మాని
ఆంగ్ల సేవేమాని-మరి-ఆంగ్ల భృతమాని, ॥అన్నలార॥"

—గరిమెళ్ల

ఇచట, నాడు విదేశవస్తు బహిష్కరణోద్యమ మెంతగావ్యాప్తి జెందిన దనుట కొక దృష్టాంతరము. అసహాయోద్యమము తీవ్రముగా సాగిన దినములలో, భారతావనిలో యెన్నికగన్న భాగ్యవంతులలో నొకరగు జమునాలాల్ బజాజ్ ఒకనాడు బందరులో డాక్టరు పట్టాభి గారింట రాత్రి రొట్టె, ఫలహారములో వైచిన పంచదార గాంచి, డాక్టరుగారిని పిలిచి, యీ విదేశీ పంచదార యించి, స్వదేశీ బెల్లం యిప్పించుడని మనవి చేసినంత మాత్రమున వెంటనే పట్టాభిగారు, "బజాజ్ సాబ్, యీ పంచదార యీ పట్టణములో చెఱకునుండి తయారు చేసిన పంచదార, స్వీకరించండి," అనుసరికి, బజాజ్, బందరు పెద్దల యొక్క దీక్ష మర్యాదను గ్రహించి యెంతయో యానందించినారు.

## ప్రబోధము

"గాంధి మహాత్ముని తత్త్వమెరిగి-కష్టపడి పని- యం
బంధము వదలెడు-స్వేచ్ఛవృత్తికై-అందరు సమకూడం !"

—మంగిపూడి

## రాట్నము-ఖద్దరు

ఈస్టు యిండియా కంపెనీ అనుసరించిన క్రూర కృత్యముల వలన, దేశ పరిశ్రమలు దెబ్బతిన్నవి. సన్నని నూలు వస్త్రములు - యు - తగాం డకు పరిశ్రమలేక జీవనము పడిపోయినది. - తకు సప్లయియగు నూలునకు విడు దల లేక ఉత్పత్తికి తగుప్రోత్సాహము, ద్ధలేక, క్రమక్రమముగా రాట్నములు మూలపడినవి దేశమున సగటు విద్యావంతులు విదేశవిద్యామోహితులైన వారు, వి శవస్త్ర వ్యామోహితులై క్రమముగా తమ వస్త్రములకు పర శములపై నాధారపడవలసిన గతిపట్టినది. మానము కాపాడుకొనుటకు కూడ లాంకషైరు గుడ్డ యావశ్యకమైనది. ఈ మూలముగా దేశములో, వి శ వస్త్రములకై కోట్ల కొలది ధనము ఖర్చు అగుచుండెను. ఈకోట్లకొలది ధన సవాహము ఆపినచో శము పురోభివృద్ధినంది కోట్లకొలది జనమునకు వనోపాధికి మార్గము - ర్పడు నని, మహాతు డు, గృహలక్ష్మియగురాట్నము ప్రాముఖ్యము చాటి, మరల రాట్నలక్షి గృహలక్షి కావలయు, నాడే నిత దారిద్ర ముతో అలమటించు పేద ప్రజానీకమునకు వనోపాధి కలిగి, శము స్వయం పోషకమై సౌఖ్య వంతమగునని యుద్బోధించెను...స్వ శ వస్త్రదీక్షతోపాటు వి శవస్త్ర బహిష్కరణ సాగినచో ప్రు స్వరాజ్య ప్రాప్తి యగునని బోధించి, తాను నిరంతర చర్కా వతోపాసియై, పజలావ్రతదీక్ష పూనుటకెంతయో శమపడెను. ఈ యుద్య మమున వెడలిన సూక్తులు కొన్ని...

## రాట్నము

"మా పాలి మహలక్షి మా యన్నపూర్ణ,
మా సరస్వ • వి।-మా రాజ్యలక్షి !"

—ఛెరుకువాడ

"పెట్ట , రాట్నము—ఓ తల్లులారా-(పెట్టరే)
పెట్టరే, మీ రింకనైన—పేదతనమున తల్లివ్యథ చే
కట్టుకొనుటకు బట్ట కను—కడు విచారము బొందుచున్నది."

—నెల్లూరు వెంకట్రామ నాయుడు

## రాట్నము

"నా తల్లి రాట్నమా- నా పాలి భాగ్యమా,
నా శమును వీడ—న్యాయమా, చెప్పుమా,
కట్టుగుడ్డల నిచ్చి—పొట్టకూడిచ్చి,
నట్టి తల్లివి నీవె—ఇట్టురావమ్మా, నా త్ల్ల రాట్నమా."

"వడుకు. వడుకు, కదుర, వడుకవే కదుర!
వడికి, మా దారి ద్య మడపవే కదుర!"

"నూలు వడి విధము తెలియండి-జనులార, మీరూ
విధము కనుగొని—లాభమొందండి॥"

—కొండపల్లి

"వడుకుమురా।-వడుకుమురా !
నీ, శోద్ధరణకు-తెరగదిరా !
కలిమి బలిమి-యీా, కదు గదరా !
~మ్మర రాజ్యంబొసగు సూత్రముర ॥వడుకుముర॥"

— గురుజాడ

"సుందరమైన రాట్నమె-ప సందు జాంబురా ।
నం హమేల, దానిలోన-స్వరాజ్యమున్నదిరా ।
ఆరుకోట్ల పంచములకు-అన్నము బెట్టును రా
మాల నూలు మాటనీవు-మరచినావటరా,"

—కొడపల్లి

"ను మీ యిలువేల్పు - చెల్లె!
నాతోడ నాడుకొన

"ను మీ గృహలక్ష్మి - తల్లి! నను మరచిపోతివటవే !"

—కాటూరి

"కట్టకుమా! సీమబట్ట
పెట్టకుమా వానిపొట్ట
కట్టి కొట్టి కడకు శ—మిట్టి గతికితెచ్చితివి ॥కట్టకుమా॥"

"కొనకుము యీ సీమగుడ్డ నీవు
కొంటివేని మనము కోల్పోనునదెట్టా! ॥కొనకుమా॥
రంగు రంగుల గుడ్డచూచి పలుభంగుల
కాపురమెనసి కాపురమెల్ల దోచి ॥కొనకుమా॥"

—కొండపల్లి

"కట్టకుమా! సీమగుడ్డ
యిటుపై కట్టననుచు నొట్టు—పెట్టరా! బిడ్డ!
మనజాతి మనమతము—మాటను మరపించి
మత భ్రష్టు సెడి—మాయా సీమగుడ్డ ॥కట్టకుమా॥"

—నెల్లూరి వెంకటామనాయుడు

"సిగ్గులేదా నీకు శరములేదా!
అన్నమైనాలేక ద ల్లాడుతుంటేను!
సీతాకోక చిలుకలాగ సీమగుడ్డ కట్టితిరుగ ॥సిగ్గులేదా॥

—బసవరాజు

"సీమగుడ్డ కట్టబోకుమురా! నాచిట్టిబిడ్డ!
సీమగుడ్డ కట్టబోకుమురా!
సీమగుడ్డ కట్టినీదు నీమమెల్ల పాడు సి
నీ నామమె కుంద చేస్తివిరా! నాచిట్టిబిడ్డ!"

—కొండపల్లి

"కొనరాదండోయ్-మీ-రమ రాదండోయ్
సీమగుడ్డ కొనరాదండోయ్"

—మల్లావధాని

"వద్దురా, మనకొద్దురా!
పర శవస్త్రము వద్దురా? మనకొద్దురా!"

సామాన్యముగ జగచ్చక్షువగు సూర్యుడు కానరానిదినము దుర్దినమందురు. వ్రతనిష్ఠలు సూర్యుడు కనుపడని దినమున ఉపవసించి మరునాడు సూర్యబింబ దర్శనానంతరము పాశన యుదురు. అట్లు, కొందఱు దీక్షాధారులు, ఖద్దరు వాడని శుభకార్యములకు వెళ్లెడివారు కారు. రాట్నములేని యింటికి, రాట్నములేని సభకు వెళ్లనను నియమముగల కొందఱు ్తినిష్ఠలు పాటించుచుండెడివారు. కనీసము తక్లీపై దారము యనిచో పయాణములలో సహితము భోజనము సెడివారు కారు. ఉక్షాధికారియైనను, అతడు ఖద్దరుధరింపనిచో సంఘమున నాడు గౌరవ ముండెడిదికాదు. తమ తితో వడికిన నూలుతో, యించినబట్ట కట్టువారు స్వావలంబనులనెడివారు. అట్టివారు మ మముగా పెరిగి ఖద్దరు పచారము దీక్షతో సాగిన రోజులవి.

## గాంధీటోపీ

శుద్ధ ఖద్దరుతో తయారు సిన స్వచ్ఛమైన తెల్లని గాంధిటోపీ నాడు పవిత్రతకొక ఆనవాలు. చుట్ట, డి, సిగరెట్టు త్రాగుటకలవాటై వీడలేని వారు సైతము తలపై గాంధిటోపీని ఆ కొలది కాల మావలనుంచి యాపని రగ, మరల ధరించెడివారు. ఆనాడు అట్టిది గాంధీటోపీయొక్క పవి తత.

ది 28—9—1921 న విశాఖపట్నం వైద్యకళాశాల విద్యార్థులను గాంధీటో ధరించినందుకు కళాశాలనుంచి పంపి- సిరి. 1920 నాగపురం కాం గెసుకు హాజరైన 16,000 పతినిధులు గాంధీటోపీలు ధరించిరి. ఇది శచరి తలో గణనీయమైన నూతనాద్భుత పరిణామము.

## మధ-పాన నిషేధము

కట్ట బ , తిన ండి సరిగ-ని పేద కా క, కర్షక పాటకజనము తర తరాలుగా మద్యపానము ంద మత్తులై యిల్లు, ఒళ్లు గుల్ల సికొని తాము

అథోగతిపాలగుట, కల్లు సారాయీల ింద కోట్లకొలది ధనము దుర్వ్యయమగుట గుర్తించి సాగించిన కాంగెసు ఉద్బోధన—

"కల్లుత్రాగి నీ యిల్లునెల్ల గుల్లసేయకు
నీ వళ్ల రోగాలకెల్ల వడ్డియకు ॥కల్లు॥"

"కల్లుసారాయి తెచ్చివాడు—యిల్లుగుల్ల ాదండి బాబు
పెళ్లాంమెళ్లో పుస్తెలుకూడ—యెళ్లిపోయాయండి బాబు
॥దండాలండోయ్॥"

—గరిమెళ్ల

"త్రాగుడుపిశాచమా ఇంక తరలిపొమ్మ
మొగలాయి పాదుషాల గులాములుగ ని స్వైరవిహారము సల్పినావు"
—గురుజాడ

## హరిజనోద మము

తర తరములుగ, అస్పృశ్యులుగ, దూరస్థులుగ చూడబడుచున్న జాతి, యెండవానయనక, యహర్నిశలు కాయకష్టము జీవించు జాతి, మాయమర ము లెరుగక, బ్రతుకుహేయమనక వనోపాయమునకై పంచ పంచల నొదిగి మసలు జాతి; దూరదృష్టి లేక, భమపడి, స్వార్థపరుల రాజకీయపు పెత్తుల నలిగి, నిత్యజీవనము నడుపుకొను జాతి యగు యీ హరిజనులు జనసంఖ్యలో యేడవవంతు అయినను వారి పొత్తు, సహకారము లేనిది భారతజాతికి మోక్షము దని విశాల హృదయులగు మహాత్మా గాంధీ మొదలగు మహానాయకు లెందరో యీ హరిజనసేవకు జీవితముల నంకితము నిరి. వారికి సంఘములో విద్యా, సహ వనము, సమాన పతిపత్తి, గౌరవము మొదలగు సదుపాయములు కూడ కల్పించి, వారి పురోభివృద్ధికి జాతి కనులుదెరచి మసలింది.

వీరి సంస్కరణకు గాంధీ యుపవాసము ని, ప్రభుత్వమునుకూడ దారికి మళ్ళించుట జరిగినది. ఆ యుద్యమమునకు సంబంధించిన గేయములు కొన్ని:—

''ఎవరెన్ని చెప్పిన-హిందూ శవాసు-లేక
సోదరులె నుండి !

అంటు దోషముమాకు లేదండి,
పాప-మంటూ చాటుదాము రండి!
యీ కుంటివాదనలు-గూటిలో పెట్టండి ॥మాకొద్దీ॥"

—గరిమెళ్ళ

"గాంధీ మహాత్మా!-గాంధీ మహాత్మా
కాచి రచ్చించు-గాంధీమహాత్మా!
సరకారువోరు-కరుకైనవారు
ఉప్పేరు ను-తప్పేసినారు
డబ్బుగలోరు-దరికిరానీరు
ఈ గోరమేమి?-మా . రమేమి?
మాల మాదిగలం-మనుష్యులంగామా?
కుక్కలకన్న-తక్కువయ్యామా?
మా మొరాలకించు-సామీ! మీరేదిక్కు"

—బసవరాజు

"మాల మాదిగవారమండి!-మమ్ము-జాలగ ప్రేమించి
పాలింపరం ॥మాల॥"
"మలిన దేహుల-మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ, ధర
మధర ధర్మం-?"

—మహాకవి గురుజాడ

"అంటరానివారెవరు! మా
వెంటరానివారు!! అంటరాని!"

—మాధవపెద్ది

"జాతులు వే పాప!- కులమున
హెచ్చు తగ్గులు-ఎంచుట పాపము।
నీ॰ న్యాయము-విద్యాబుద్ధులు
గలవారే-జాత్యధికులు-పాప! ॥జాతులు॥"

—సుబ్రహ్మణ్య భారతి

"రామ! రామ! రామాభిరామా!- రామా! (శ్రీ)రామా!
లోక నాయక! పావన నామా!- లోకైక రామా!
పంచముడని-మన సాటిమానవుల-బహిష్కరించెదరా!
పంచమ సహకారమ్ము లేనిచో- బతుకు గడుప గలరా,''

— కోటి రంగాచార్యులు

ఈ ప్రకారము 8 మాసములు స్వాతంత్ర్యపోరాటము సాగినది. అనంతరము బ్రిటనులో భారతరాజ్యాంగ వ్యవహారములు చర్చించుటకు 1930 డిశంబరులో, ప్రథమ రౌండుటేబుల్ కాన్ఫరెన్సు జరిగినది. భారత దేశము నుంచి, ప్రజా ప్రతినిధులనదగిన వారెవ్వరు సభకు పోలేదు. అందువల్ల బ్రిటిషు ప్రధాని రామ్సేమాక్డనాల్డు కాంగ్రెసుతో రాజీకి రావలసి వచ్చినది. ఈ సూచనగా 1931 జనవరి 26 - దీన. గాంధీజీని, వారితో 26 గురు కాంగ్రెసు పెద్దలను విడుదల సిరి. గాంధి లార్డు ఇర్విన్ ప్రభువుతో ది 16-3-1931 న సంప్రతింపులు జరిపిరి. అప్పటికింకను 60 వేలమంది కాంగ్రెసు వారలందరు కారాగారముల లోనే యున్నారు. వీరి సంప్రతింపులు ఫలించి అందరు మార్చి 15 వ దీని విడుదలయైరి. గుజరాతులో పన్నుల నిరాకరణోద్యమమున ఖరసాలు - య బడక బకాయిపడిన పన్నులు ఇరవై లక్షలు స ్రమముగా చెల్లింపబడినవి. ఈ ప్రకారము పన్నులు చెల్లింపవలదన్న, చెల్లింపక యుంటయు, తిరిగి యొక మాటలో పన్నులు మరల చెల్లింపబడుటయు కూడ సమర్థుడైన నాయకుడను కీర్తి గాంధి గారికి లభించడము గమనించిన రివిన్యూ సభ్యుడైన హాట్సన్ దొరకు కన్నుకుట్టింది. ప్రభుత్వమున కపమానముగా భావించి, వెంటనే, గత సంవత్సరము అతివృష్టి అనావృష్టివల్ల రద్దు యబడిన పన్నుల మొత్తము రు. 50 వేలు తిరిగి వసూలు- యుటకు తన ప్రభుత్వ బలమంతయు ఉపయోగించినాడు. దానితో కాంగ్రెసు స్థితి తారుమారైనది. ఒడంబడికపై సంతకములు సిన యిర్విన్ వెంటనే భారతదేశము విడచి వెళ్ళిపోవలసి వచ్చిందికూడా. దానిపై లండనులో 1931 డిశెంబరులో జరుగనున్న ద్వితీయ రౌండుటేబుల్ కాన్ఫరెన్సుకు పోవలసిన గాంధిజీ, యీ పన్నులు తిరుగతోడి వసూలు- యు అన్యాయమునకు బాధపడి, సమావేశమునకు పోవ నిరాకరించినాడు. ప్రభుత్వము, స ్రమముగ విచారించెదమని వాగ్దానము యగా, రౌండుటేబుల్ సభకు గాంధీజీ వెళ్ళిరి కాని ప్రయోజనము లేకపోయినది. అది అంతయు ఒక నాటక

ముగా పరిణమించినది. ఆయన లండనులో నుండగ-, యిక్కడ భారత ముశలో పండిత్ జవాహర్ లాల్ నెహ్రూ, అబ్దుల్ గఫూర్ ఖానును అరెస్టు సిరి. బెంగాలులో ఆర్డినెన్సు పరిపాలన ప్రభుత్వము పవేశపెట్టినది. గాంధీ బొంబాయి రి ఆజాద్ మైదానములో యీ అన్యాయము గురించి యుపన్యసించి, రాజ పతినిధినికలుసుకొన బ్రయతించెను.కానిఅతనిని కలుసుకొనుటకు అవకాశమీయలేదు. అంత మరల సహాయ నిరాకరణ సత్యాగ్రహము తప్ప గత్యంతరము కనుపడదు. 1932 జనవరి 4 వ దీన గాంధీ ని వల్లభభాయి పటేలును అరెస్టు సిరి. 1932 సంవత్సరాంతమునకు లక్షమంది జైలుకు వెళ్ళిరి. 1933 మే నెలలో, సమిష్టి సత్యా హము విరమించి 1940 లో వ్యక్తి సత్యాగహము సాగినది. 1932-33 సంవత్సరము ఒకలక్షా యిరువై-ల మంది స్వాతంత్ర్య సమరములో అరెస్టు అయిరి.

చిరకాల పరిపీడిత పజానీకమున కేడుగడగా, పజాపాలిత శమున కొక రాజ య వేత్తగ, నిర్వ్యాపారమున గుంకిపోవు పారిశ్రామికుల కొక యాదరువుగ, కష్ట వుల పాలిటి కామ నువుగ, పతిత మానవలోకములకు దీన జనోద్ధారుడుగ, మహాత్మాగాంధి గారు వితమును స్వీయము సికొన్నారు. అభిమానులు. వారి వారి మనః ప్రవృత్తుల కందినంతవరకు మహాతు ని గురించి భావించి, ధ్యానించి, వాగామృతము నిండగ్రోలి, దివ్యాభయము పొందినారు. వారి యడుగుజాడల నడిచింది జనసమూహము. ఆ యా సందర్భముల వారినిగురించి మహాకవులు, తాదాత్మ్యము జెంది వెలువరించిన అమృతవాణిని విందము, వారి మాట జాతికొక వెల్గుబాట, ఆ సమర దుందుభి నినాదములు కొన్ని —

"పొలి పొ ! బలి బ !
కల కలా రా గ !
కలికి బంగరు తల్లి!
కనుల పాల్గారుతూ
మా స్వరాజ్య వతా! మా తల్లి!
మా భారత లక్ష్మి:"

—మంగిపూడి పురుషోత్తమ శర

"వీరా వేశము జెందినారమిక
వీర విహారము స్తాము

పరాధీన తన్, బాపు కొనంగా
శయ రి మోగిస్తాం"

—మల్లాది

"ఎప్పుడు రు .. స్వాతంత్య్ర దాహం
ఎప్పుడు ముడయు, మా అడియరి మోహం"

—సు బహ్మణ్య భారతి

" రగంధము తెచ్చినారము
రు దెవ డొ తెల్పు ।"

—కవిరాజు త్రిపుర. ని

"స్వాతంత్య్ర సమరము-సాగింపగావేగ
సహచరులతోడి-రావోయి!
సాగిపోవలె-త్వరగ రావోయి"

—మల్లాది

"కదలిరావోయి! తమ్ముడా!
కదలవేమోయి! తమ్ముడా!
రెక్కలారని-బిక్కమొగములు
పక్షులే పరుగెత్తెరా-పదమునెత్తర-కత్తుగా (కదలి)"

—బెల్లంకొండ

"జయ రి మ్రోగింది-జనులార లేవండి!
జయము పొందెడిదాక-శాంతములేదండి,
జంకు గొంకులేక-ఛంగు ఛంగున రండి!
శసేవ సేయ-ధీరులై నిలువండి! (జయ రి)"

—మల్లాది

"లెండు హైందవులారా!-క్షేమి, దుఃఖము వాయ
రండు, రండు స్వరాజ్య-రాజ్యపాలన సేయ,"

—మద్దూరి అచ తరామయ్య

"ఎవరేశారీ మత్తు మందు,
ఎన్నాళ్ళదాకాను-యీ మొద్దు నిద్దుర ॥ఎవరే॥"

—బసవరాజు

"రా రా! పోదాము!-రాజ్యమేలుదాము!
రాజ్యంబు , లుచును-రంజిల్లుచుందాము"

—గరిమెళ్ళ

"దండాలండోయ్! మేముండలేమండోయ్! బాబు!
యీ సైతాను పభుత నింక-సాగనీమండోయ్ బాబు,"

—గరిమెళ్ళ

"వేణునాదము-మోగుతుందండోయ్!
ఓ భక్తులారా! వేణునాదము మోగుతుందండోయ్!"

—బసవరాజు

"కొయ్యడ!-కొయ్యడ!యిలాగరారా!
కోటీ యింతలు సెప్పుతానో-రయ్యా!. కోయ్యోడ.!''

—గరిమెళ్ళ

గాంధీగారు జైలునుంచి హరిజన సేవా పబోధము యుటకు ప్రభుత్వ మంగీకరింపనందున ఉపవాసము యగా, ఉపవాసము మధ్య ది 23.8.1933న విడుదల యబడి. నాటినుండి రాజ యముల విరమించి హరిజన సేవకు కాలినడకను ప్రచారము సాగించెను. 1934 ఏ పియలులో సత్యా గహము విరమింప సెను. 1934 నవంబరులో శాసనసభ యెన్నికలు జరుప నిశ్చ యించి, 1934 నుంచి 1945 వరకు శాసనసభల విజయము సాధింప బడెను. 1939 సెప్టెంబరు 3వ దీన ద్వి ·య ప్రపంచ యుద్ధమా·ంభ మాయెను. 1940 అక్టోబరు 17నుంచి వ్యక్తి సత్యా గహోద మము వాక్ స్వాతంత్ర్యము నకై ప్రారంభింపబడినది. దానిలో మొదటి సత్యాగ్రహి (ు వినోబా భావే. అందులో 30 వేలమంది పాల్గొన్నారు. గాంధీ మా తము అరెస్టుకాలేదు. 1941లో యుద్ధపత్రికూల నినాదములతో యీ వ్యక్తిసత్యాగ్రహము ప్రారంభ మైనది. ఇది ఒక సంవత్సరము జరిగిన తరువాత 1941 డిశంబరులో యీ సత్యాగ్రహుల నందరిని విడుదల సిరి. 1942 వచ్చుసరికి పరిస్థితులు విష మించినవి.

## క్విట్ యిండియా ఉద్యమము

సర్ స్టాఫర్డు ిప్సు బ్రిటిష్ ప్రభుత్వ రాయబారిగా మార్చి 23న యిండి యాకు వచ్చి ఏప్రిల్ 1వ దీ వరకు ఉండి చేసిన పయత్నములు ఫలింపక

పోవుట , రానున్న దారుణ నిర్బంధముల సూచనగా తన ఆగ్రహమును వెళ్ళ బుచ్చుచు తిరిగి వెళ్ళిపోయినాడు. బ్రిటిషు ప్రభుత్వమును మూల మట్టముగా పార దోలుటకు సమష్టి శాసనోల్లంఘనము తప్ప వేరు గత్యంతరము లేదని, ది1942 ఆగష్టు 8వ దీన అఖిలభారత కాంగ్రెసు సంఘము సమిష్టి శాసనోల్లంఘనమును యేకగ్రీవముగా రాణించి. దానికి గాంధీగారిని మహాసేనానిగా నియమించింది. క్విట్ ఇండియా, "తొలగిపోండి. మా భారత దేశమునుంచి" అను నినాదము భారత దేశమంతయు మారుమ్రోగినది. రాణము జరిగి ఒక రోజైన గడువలేదు, అందుపై బ్రిటిషు ప్రభుత్వము 1942 ఆగష్టు 9వ దీన తెల్లవారకడ, గాంధిగారిని అరెస్టు చేసి, ఆగాఖాను భవనమున నుంచినది. కార్య నిర్వాహక సభ్యులనందరిని అహమ్మద్ నగర్ కోటలోను, మిగతా వారందరిని తాత్కాలికముగా, ఎర్రవాడ జైలులోను నిర్బంధించిరి. వీరినిట్లు బంధించిన ప్రదేశము, సమాచారము 1944 ఫిబ్రవరి 22 వరకు యెవరికి తెలియనీక ప్రభుత్వము రహస్యముగా దాచినది. 1945 వరకు నిర్బంధములు సాగినవి.

"పరదేశీయులు తొలగండి!
ఈ భారత దేశం-మా దేశం,
వినండి! వినండి,! విశ్వప్రజలు వీరభారత సందేశం."

—వానమామలై వరదాచార్యులు

"వీరభారత యువకుల్లారా,
విజయోత్సాహిత మూర్తుల్లారా,
విన్నారా! మన వీరుల చరితం
కన్నారా! ఆగష్టు విప్లవం,"

—సాంబశివరావు బాజ

"అల్పకాయము బోసిన వ్వంగ వస్త్ర
మూతకోలయు, నొచు ను రూతలూచె
చూడ్కిలోన, త్రివిక్రమస్ఫూర్తి దాల్చి
మూడు జగములు, నెవ్వ ముదుక తలిసి."

— కాటూరి

"ను నీ రణోన త్త-గానం విని పులకరించి
రణోన త్త రణ డిండిమ-ధ్వానం విని జలదరించి
జలదరించి కలవళించి-రణభూమికి పరుగెత్తాను
పాషాణ పాకారము-మంచి బురుజు కంచుకోట"

—పురిపండా

జైలులో కస్తూరిబా గాంధీ-మహా వ శాయీలు శమాత గర్భంలో దీర్ఘని దపోయారు. ఈ లోపల బొంబాయి తదితర నగరములలో పజలు వేలు, లక్షలకొలది గుంపులు గుంపులుగా బయలు రిరి. పభుత్వమీసారి లాఠీలు, కత్తిపోటులతో గాక, తుపాకికాల్పులు మరఫిరంగులయొక్క వర్షముతో పజలను చెదరగొట్టినది. దాని పట్టరాని రోషాగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లి, జాతియొక్కమ డి ఆగహపరవశమై యొడలు తెలియక పతిప తిక పరవళ్లు దొక్కి నది. తమ మార్గదర్శకులగు నాయకులు వారిమధ్యలేరు. పైగా వారు కఠిన నిర్బంధములోనున్నారు. అందు పజలలో రోషాగ్ని బహు ముఖ ముల వ్యాప్తిచెందినది. పభుత్వమువారి తుపాకి గుండ్లకు సమాధానముగ, పజలు, దోపిడి పరశురామ పీతి కార్యములు జరుపుట, కచేరీలను అగ్ని కాహుతి యుట, రైళ్లరాకపోకల నాపి యుట, రైలుపట్టాలు తొలగించుట, మొద లగు తావహ కార్యముల కొడిగట్టిరి గాని, ఒక్క పాణి హింసకైన యి సి కొన్నవారు కారు. టెలిగాఫ్ గెలు త్రెంపబడినవి, ఖజానాలు దోయబడినవి, భుత్వ భవనములమీద జా య పతాకాలు యెగుర వేయబడినవి. పభుత్వము దీనికిమారు ప్రజలయిం తగులబెట్టి, ప్రజాసమూహముపై విచ్చల విడిగా తుపాకులు కాల్చినది, ఈ తావహముతో జాతిని, అణగ దొక్కుచు యుండి, యేనాటికైన, కాంగెసు కాళ్ళ రముసకు రాకతప్పదు అని అట్టివారి రాక కై షి౦చు ని, నెలలు, యేండ్లు, గడిపినది, ఎప్పటికైన క్షమాపణకు కాంగెసు రాగలదని ఆశించినది.

**ఆగష్టువిప్లవము—**

"-చిపోయినవి పో సుల టో లు। వందలు వేలు రాబందులట్లు
కాలిపోయినవి ర్కారు క- లు। ఖరదూషణాదుల కాష్టమట్లు"

—కరుణ

1944 మే నెలలో ఆగాఖాను భవనములోనున్న గాంధీగారిని ప్రమాద కరమైన అనారోగ్య కారణముగా విడుదల సినది పభుత్వము-1942నాటి శాసనోల్లంఘన రా నమునకు కాలదోషము పట్టినది, దానిని 1944న బయటికి రాగా విరమించితిమన్నాడు గాంధీ . 1945 జూన్ 15వ దీన అహమ్మదు నగర్ కోటలోని వారినందరిసి విడుదల - సిరి.

## జైలు

గాంధీ నాయకత్వమున, భారత స్వాతంత్ర్య సమరమున దుమికి, యెందరెందరో పదరాని కడగండ్ల ప్రమగ్గి ఆస్తిపాస్తుల పోగొట్టుకొని, యిల్లు, వాకిళ్ల విడచి, సంసారముల త్యజించి,కాయకష్టములకోర్చి, తుదకు జైలు గియు అచట పభుత్వముపెట్టు బాధలుభరించి కృశించినారు ఎందరో వికలాంగులై, యెందరో లాటీపోటుల చితికి జీవములతో బ్రతికిరి. ఎందరో జీవిత సర్వస్వమే గాక, పాణముల సైత మర్పించిన మహాతు లున్నారు. అట్టివారలు జైళ్లలో ప్రమగ్గిన యుదంతములు కొన్ని...

"ఇదిగో! దివాలా పభుత్వము,
ప్రేళ్ళతో! కదిలి, కూలిందిదిగో-కనుము దీసి సత్త్వం॥
ఎన్నాళ్లు సైచిన-సున్న వీడికి జాలి, తిన్నగ కూడు నీరీడు॥
పురుగు! లన్నపు ముద్దలిస్తాడు
మేకు! లన్నపు ముద్దలిస్తాడు,
ఉప్పు! దన్నపు ముద్దలిస్తాడు
వాస! నన్నను మంచిదంటాడు
దీనికి! మిన్నలేదట, మంచికూడు
జిహ్వా! లన్నీ కట్టాడు, యీ పాడు
కూడుకన్న నీరే పానకము, పాణాధార ॥మిదిగో దివాలా॥"

— గురజాడ

"కుళ్ళిపోయిన చచ్చు-కూరలు, ముల్లంగి
ఉల్లిపాయలు-గలి రు!
పంగ! పేళ్ళు, చీడ తోటకూర!

ఇనుప : కళ్ళాయిగాచి, యాధరు
వుగ : నిచ్చు వతా పులుసు–యితని శక్తి దెలుసు"

—గురజాడ

1946లో శాసన సభల యెన్నికలలో, కాంగ్రెసుకు అఖండ విజయము కూరి, రాజ్యాంగ పరిషత్తులో కాంగ్రెసు అభ్యర్థులు సభ్యులుగాకూడ యెన్నుకోబడిరి. ఈలోగా నవకాలో జరిగిన ఘోరకృత్యములు విని, మహాత్మా గాంధీ అచటికివెళ్ళి సంచారము సి, హిందూమహమ్మదీయ సఖ్యత కెంతయో పాటుబడిరి. అచట హిందువులను, మహమ్మదీయులు పెట్టిన, ఘోర కృత్యము లింతింతయని వర్ణింపనలవికాదు.

"అది పళయో దారుణ భయంకర దుస్సహ పాప చిత్త దు
ర్మద జనులేచి హైందవుల రక్తము వెల్లువ సినట్టి,తా
వదె, నవకాళి మండలము యత్నము , నాటి శాంతి నిల్పగా
కదలె మహాత్ముడంత, నవకాళికి, మారణ శి భూమికిన్."

—గురజాడ

19 7 ఆగష్టు 15వ దీన భారతదేశానికి స్వాతంత్యము సిద్ధించినది. తరువాత రాజ్యాంగ పరిషత్తులో భారత శము రిపబ్లిక్‌గా రూపొందినది.

## స్వాతంత్ర్య ఉద మము – ( -8- )

భారత శ చరితలో 1947 ఆగష్టు 15 వ దీ మిక్కిలి చరిత్రాత్మక మైన పర్వదినము. నాడు భారతాకాశమున స్వాతంత భానోదయమైనది. దాదాపు 12 శతాబ్దముల తరువాత భారతమాత పారతంత్యబంధములు వటాపంచలైనవి. మాతృభూభాగములో కొంత పరాయి శముగా–పాకిస్తానుగా విడిపోయినను, మిగతా శము స్వాతంత వీచికల నోలలా సుదినము చూడ గలిగినది. బ్రిటిష్‌ప్రభుత్వపు రాజ యపు పన్నుగడలనుంచి బైటపడి, జాతి ర్వస్వము స్వార్థము విసర్జించి, తుదకు పాణార్పణకైన వెనుదీయక, సర్వ తా గమొనర్చి, సతా హింసా నత దీక్ష సఫ కృతమొనర్చుకొని, స్వరాజ్య స్థాపన సికొను మహాభాగ్యము కూరినది. ఇది మహాత్మా గాంధీగారి నాయకత్వమున, తా గ లురు, మేధావంతుల అండదండను, జాతి సమైక్యమై,

స్వరాజ్యస్థాపనలో విజయధ్వజం ప్రతిష్ఠించింది. రక్తపాతరహిత విప్లవాత్మకోద్యమము, ప్రపంచమున నింత దనుక, కనని, వినని, యూహింపని వినూత్న సాధనగా దిగ్భ్రమగొలిపినది. దీనితో ఖండాంతరముల నెనలేని కీర్తి సంపాదించుకొనగలిగినది. ఏండ్లకొలదిగ స్వాతంత్ర్యమునకై పోరాడి, చివరకు ప్రాణములొడ్డిన వీర నాయక, నారీమణుల కృషి టికి ఫలించి వారి యాతలకు శాంతిచేకూర్చు భాగ్యము కలిగినది. భావి సంతతికి మంచి బాట ర్చు సదావకాశము లభించినది. ధర్మచక్రాంకితమైన త్రివర్ణపతాకము ఖండ ఖండాంతరముల వెలయు స్వాతంత్ర్యశక్తి లభ్యమైనది. ఏ ధర్మదీక్షవలన యీ విజయము సంపాదింపగలిగితిమో అట్టి ధర్మపథము వీడక ముందు పురోగమింప శమాత యను హించుగాక యని దేశమాతకు అంజలి పట్టితిమి:-

"చం. గణ గణ మ్రోగెరా, విజయఘంటలు, భారతమాత మందిరాం
గణమున, ద్వారబంధముల గట్టిరి చిత విచి తరత్న తో
రణతతి, వీథి వీథుల విరాజిలుచున్నవవే త్రివర్ణ
తనములు, మేలుకాంచె, పరతంత్ర పరాన్ముఖమ స్తకంఠముల్."

—కరుణ()

"ఎన్నాళకెన్నాళ్లకు—కడగండ్లు—యీ రె! మాతల్లికి!
కన్నుల పండువయ్యె-మన భారత-కన్నసంతానమునకు!"

—గురజాడ

"శా. ఏరా భారతపుత నేటికిగదోయీ, నీదు స్వాతంత్ర్య శం
ఖారావము ప్రతిధ్వనించి, దిశలుద్ఘాడించెఁ బ్రాక్పశ్చిమ
ద్వారమ్ముల్ విడివడ్డవిప్పటి కహో!"

—ఏటుకూరి వెంకటనరసయ్య

## నైవేద్యము

"తల్లి! నీ యుత్సవముగాంచ, దరలినార
లనుగు దనయులు, నైవేద్య హస్తులగుచు"

—దువ్వూరి రామిరె

"పాడియావులు-పంట పొలములు
భాగ్యములు రాజ్యములురా!
మున్నరా! యీ భరతభూమిని
తొలకరించిన పుణ్యభూమిని"

— తురగా వెంకటరామయ్య

## దేశభక్తులు

"చిరపరాధీన శృంఖలా చ్ఛేదమునకు
వితసుమాలె ధారవోసితిరి, మీరు
కురియ . డు. స్వర్గీయ కుసుమవృష్టి
శ్రీ విరాజిల్లు మీయొద్ధ శిరములందు."

—పురిపండా అప్పలస్వామి

## మహాత్ముని దివ్యస్మృతి

భారతదేశము స్వాతంత్ర్యము సంపాదించి, ఆరు మాసములైన తిరుగ లేదు, స్వరాజ్య సముపార్జనలో ¨జలుపడిన శ్రమలనుంచి కోలుకొనగ లేదు. కొత్తయిల్లు చక్కదిద్దుకొను సందిగ్ధస్థితిలో నాయకులు తడబడుచున్నారు, ప్రజలనిర్ణీత మార్గము యూహామాత్రముగ యున్నది. ఇట్టి సందిగ్ధ స్థితిలో రాజ్య పదాత, స్వతంత్ర భారత పిత, నవభారత భాగ్యవిధాత, భారతీయ జీవనదాతయగు మహాత్మా గాంధి గారు ది 30–1–1948 సాయంతనము ఢిల్లీలో ప్రార్థనసమయమున, ఒక మతోన్మాది పిస్తోలుగుండునకు గురియై నేలకొరిగిన దుర్దినమది. భారతాకాశ మొక్కపరి బ్రద్దలై యీ యశనిపాతమునకు అలవటించినది. తల్లడిల్లిన భారతీయుల గుండెలు, ఆ మహాత్మునికి పలవరించి, పలవరించి, చేష్టలుడిగి, దిక్కు-ని పసిబిడ్డల భాతివిలపించినారు. అట్లే యిట్టి మహనీయ వ్యక్తి భారతదేశమున గాక, యావత్ప్రపంచమున యింతవరకు అవతరింప దని, ప్రపంచములే గుర్తించినవి. ఆ పురుషోత్తముని పోగొట్టు కొనిన జాతికి మనుగడ దుర్భరము, ఏను స్తు ప్రేమతత్త్వము, బుద్ధభగవానుని, సత్యా హింసలు మూర్తిగొన్న మరొక భగవదవతారమే గాంధి మహాత్ముడు ఆ మహనీయుని కాలమున జ ఁ ంచి, ఆయనను దర్శించి, భాషించి, వారి

సూక్తులాలించి, వారి యాదేశము పాలించి, వారి యడుగుజాడలపయనించి, వారి యఖండప్రేమ చూరగొన్న భారతీయుల హృదయముల తనమూర్తి మనసార ప్రతిష్ఠితమైనది. అది యెన్నటికిమాసిపోదు. ఆ అరంజ్యోతి ఆరిపోదు. ఆ వెలుగు బాటలో జాతి తన భవిష్యత్తును దిద్దుకొనగలదు. ఇక ఆయన సూక్తులు వేద వాక్యాలవలె, మానవజాతికి శిరోధార్యములై ప్రబోధింపగలవు. ఇది చివరకు మనకు మిగిలిన దివ్యస్మృతి.

## గుండెలు పగులువార, యెలుగెత్తి బిట్టురచిన భారత జనయిత్రి ఘోష :—

### బాష్పాంజలి

"యుగ యుగమ్ముల భారతోర్వీతపః పుంజ
మెసరేగి జగముల కిడిన పంట"

—తుమ్మల సీతారామమూర్తి

"కనుపింప వదియేమి! కనక కాంతుల జిమ్ము సత్యావతార ప్రశాంత మూర్తి,
వినిపింప వదియేమి? వీనుల విందుగా 'రఘుపతి రాఘవ' రామ భజన"

—కరుణశ్రీ

### అశ్రు ధార

"ఓ భారత భాగ్య విధాతా! శోభాయుత కీర్తి సమేతా!
చాలించితివా! అవతారం! సైరింపుము—మా అపచారం!"

—పూ. బా.

"శా॥ ఏ ! మా సుజరాతి వైశ్యముని, మాయె, గన్పింపదా,
రాడా! మమ్ముల జూడడా! దయ దలిర్పన్"

.....వేముగంటి నరసింహాచారు లు

### పరంజ్యోతి

"సీ. భువనాలు, కవనాలు పొంగి పొర్లెడువేళ అవని నువులిండ్లకరుగువేళ

... ... ... ... ... ...

ప్రథమి నవతారమూర్తి యా బుద్ధమూర్తి
యైన, మన బాపు స్వర్గాని కతిథియయె "

—మా. పల్లి

## అశ్రుతర్పణము

''అశనిపాతంబో, భూకంపమయ్యె నాక్కొ!
అగ్ని పర్వతమే ద్దలగుట నిజమొ!!
... ... ... ... ... ...
అయయో! డు మహాత్ము ధరణిలేడా యింక ది క్కెది,"

—మల్లావధాని

## ఘోరదుర్దినము

"చం॥ అది తలపోయరాని హృదయపు విదారి, విషాద వాచ్య కా
స్పదమయి, పంచఖండములు, బావురుమన్న పిశాచివేశ-ము
ప్పది కోట్ల భారత తపస్సముదాయము, భస రాశియై
చిదికిన ఘోరదుర్దన మిసీ! వచియింపగ, జిహ్వలాడు !"

—జాషువా

## తిరిగిరానియాత్ర

"మ. చనెనా, భారత గౌరవైక కృత దీక్షా కంకణ స్వామి,"

—ఇంద్రకంటి

''నీ - తులెట్లాడెరా! మన గాంధినిన్ జంప, మనసొచ్చెరా!"

—గురజాడ

## గాంధీమహాత్మ

"ఉ. ఘోర దురాగతంబులకు క్షోణితలంబు కలంగ బోధనా
సారము-త శాంతిని ప్రసారము సిన కర్మ భూమిలో
భారతజాతి ఘాతకుడు భారతజాతి పితన్ వధింపఁగా
ధారుణి కుంగ-దు రవితారకచందులు దుల్లరేలకో!"

—గడియారం రామకృష్ణశర

## సాయుజ ం

"ఉ. క్రుంగె హిమాద్రి శృంగములు, కొండలు గుండెలు కూలిపోయె,
దిక్కుంగనలేని పక్షులుగ గొంతుక జించుక డ్చి యేడ్చి, -"

—బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

## ఎవరి పాద చిహ్నములివి

"ఎవరి పాద చిహ్నము లివి?
ఎవరి పాద చిహ్నము లివి?
అతని పతి అడుగు గురుతు,
ఆలయమై తల యెత్తును,
అతని తి గొడుగు క్రింద
అఖిల జగము శయనించును ॥ఎవరి॥"

—దాశరథి

## ఏడవకు?– ఏడవకు?

"తొలికోడి కూసింది,
తెల తెల వారింది,
ఏడవకు! ఏడవకు! నా చిట్టి పాపా!
ఇప్పు వస్తాడు, నీ గాంధి బా బా!"

—కొప్పరపు సుబ్బారావు

## మరల రము –ఒకసారి

"మరల రమ్ము! ఒక సారి,
కరుణ జూపు బాపూ!
నూరేడులు మన నీయని
క్రూరాత్ముల మన్నింపుము."

## శాంతి

"శాంతిగొను గాక, నీ యాత్మ శాంత మూర్తి!
నిత్యమగు గాక! నీ జ్యోతి సత్యమూర్తి!"

—గురజాడ

లోకోత్తర చరిత్రులైన మహాత్మాగాంధీ గారారంభించిన అసహా యోద్యమమునాటి (1921) నుండి స్వరాజ్య సంపాదన వరకు (1947) వారి యాదేశానుసారము కోట్లకొలది జనము, మాతృ శారాధనాతత్పరులై, సర్వ త్యాగము నీ, స్వాతంత్ర్య సమరమున ఆహుతులైరి. గాంధీగారి శంఖా రావము విని, కవులు, రచయితలు, పండితులనేకులు వీరావేశముతో, తమ

తమ పద్య యగానములతో దేశము న్స్ఫూర్తులూగించినారు. భారతదేశమందలి వివిధ రాష్ట్రకవులు, తమ తమ భాషలలో రచనలువెలువరించి, పజాళి ను _ జ పరచిరి. ఆంధ్రావనిలో లెక్కలేని మహాకవులు, తమ తమ యములు, గానం సినారు. అసహాయోద్యమమునకు బూర్వము స్వరాజ్య సముపార్జనకై, నడచిన 'వం మాతరం' మొదలగు యుద్యమములనాటి నుండి కూడ మహా కవులుగానం చేసినారు. వీరి దివ్యకంఠోద్గీతికలు ఆంధ్రులకు పరిచయమే. ఇప్పుడవి కొన్ని, అసహాయోద్యమము నాటి నుంచి లభ్యమైన కవుల గీతములు వి షముగను, సంకలనము- సి యిందు ప్రకటించడమైనది. ఇందు స్వీయము కొంత చెప్పక తప్పదు, మన్నింప గోరెద. 1918 ప్రాంతమున నాకు బందరు ఆంధ్ర జా ీయ కళాశాలకు హోమ్‌రూలు యుద్యమ పచార సందర్భమున అరం లు వాడియాగారలతో వి చ్చేసి మహోపన్యాసము గావించిన డాక్టరు అనిబిసెంటు బోధము విను భాగ్యమబ్బినది. పంజాబు దురంతములనంతరము, కలకత్తాలోజరుగబోవు అవసర కాంగ్రెసుమహాసభలో అసహాయోద్యమ ర నము పవేశపెట్టుటకు షౌకతా గారిని వెంటనిడుకొని, శపర్యటన యుచు గాంధీగారు విజయవాడకరుదెంచిరి. ఆనాడు వారి యుపన్యాసములు వేలకొలది జనముల హృదయముల కదలించినవి. ఆయుపన్యాసములను, తెనుగు ననువదించినఆంధ్ర రత్న దుగ్గిరాలవారి గం ర వాగ్విలాసము కూడ నన్నాకర్షించినది. కలకత్తా కాంగ్రెసు ీర్మానించిన వివిధ బహిష్కారము క్రింద, ను పని యు పాఠశాలోద్యోగమునకు 1920లో రా నామాయిచ్చి, ఖద్దరు ధరించి అంగరక విడచి, నాయకామణియగు డాక్టరు పట్టాభిగారిని సందర్శించి, కాంగ్రెసు యుద్యమమున బవేశించితిని. మరల 1921 మార్చి 31వ దీ ఏప్రియల్ 1వ దీలలో విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కార నిర్వాహక సభ్యులగు మహానాయకులను దర్శించుట వారి శప్రబోధకమగు మహోపన్యాసము విన్నంత యొడలు పులకరించినది. కాంగ్రెసు సేవాదీక్షకు నాందియైనది ఆ దివ్య సుముహూర్తము. ఆ సభకు విచ్చేసిన వెన్నియో శభక్తి బృందములు, జా య గీ ములు గానము యుచు, సభకొక నూత్నశోభ చైతన్యము చేకూర్చినవి. ఆనాడు చ్చేసిన రాజమహేంద్రవరము' సరీసమాజము' వారుపాడిన "దండాలు దండాలు భారతమాత"—మంగిపూడి వారి "మహాత్మగాంధి దర్శనమే పావనము"-మొదలగు ర విహార గీతములు, నన్నింకను ఉ జపరచినవి. ఆ వీరా

-శ దృశ్యములు నా  వితమున కొక ముఖ్య  పర్వదినమైనది. నాటి అలభ్య
దృశ్యముగాంచు భాగ్యమేగాక, అజ్ఞాత జాతీయకవిగా ఆంధ్రదేశమున "మా
కొద్దీ తెల్లదొరతనము"-గేయమును సృష్టించి, జాతి సుప్రభాతలూగించిన గేయ
కవిసార్వభౌమ కీ. శే. గరిమెళ్ళ సత్యనారాయణగారితో కలసి, ముఖ్యమగు
తావుల వారి గేయములు స్వయముగా గానము  యుచు, ప్రచారమున పాల్గొం
టిని. అట్లే ఇతర కవుల గేయములు కూడ గానము యుచు, ప్రచారము యు
నదవకాశము లభించినది. కాలం గడచిపోయినది. శ్రీగరిమెళ్ళ మొదలగు కవు
లెందరో కాలగర్భమున కలసిపోయిరి. వారికి, వారి గీతములకు ప్ర త్యేక గౌర
వాభిమానములు లభింపలేదు. వీని ఫణితులు, పోకడలు, చరి తాత్మ క  వివర
ములు పరిచయముగల ు, వీనిని  పచురించుటకు ఉబలాటపడుటయేగాని,
కారణాంతరముల కార్యాచరణకు రాజాలనైతిని. కాంగెసు  పచారమున అప్ప
టిప్పటికి వెడలిన, స్వీయ గేయములు, అందునను జైలులోనున్నప్పుడు, పొరలి
నవి మరికొన్ని, యివన్నియు వెలువరుచు భాగ్యముండునా యని తలపోసెడి
వాడను. అన్నిటినీ కాలము సమహూర్చవలె గదా ఇంతవరకెవరు యిట్టిజాతీయ
గీతముల సమగ సంకలనమునకు బూనుకొనలేదు. ఇటీవల, ు సంకలనము
ప్రారంభించి, దాదాపు పూర్తిసేయు సమయమున, గాంధీ సాహిత్య  పచు
రణాలయము వారు గాంధీ మహాత్ముని గురించి రెండు పద్య సంపు
టములు వెలువరించిరి. ఇవి ప్రత్యేకముగ గాంధిగారిని గురించినవి. కాని ను
సంకల్పించి సేకరించినవాటి రీతి వేరు. నాకును వయస్సు మళ్లినది. ఈ
యు ప్రచురణ కాలసింపదగదని త్వరలో దీనిని ఆంధ్రావని కందించిన, వారి
పూర్వచరిత్రనందించుటయేగాక, జాతి యొక్క పరి సింహావలోకనము సికొని
పురోగమింపగలదని నా ఆశయము. ముఖ్యముగ గేయకవులగు కీ. శే. గరి
మెళ్ల, తమిళరాష్ట్రీ జా యు కవి . శే. సుబ్రహ్మణ్య భారతి మా తము సి
పోవని పతిభాశాలి, అట్టి కవి చరమదశలో కటిక దారిద్ర్యమనుభవించి, యే
ఆదరణలేక యజ్ఞాతముగ కాలగర్భమున నమగుట ఆంధ్రావని దురదృష్టము.
కాని మహాకవి ప్రాణోజ్జీవన గీతము నాకును ఆంధ్రాకాశమున మారుమ్రోగుచు,
అతనిని కీర్తికాయునిగా నిలబెట్టినవి. ముఖ్యముగ నా యీ పూనికకు అట్టివారి
గేయములతో వారి సంక్షిప్త  విత చరిత్రకూడ వెలువరించిన ఆంధ్రావని
యాతని కించుక ఋణము దీర్చునట్లు అగునని నా యీ పయత్నము.

ఇందు సేకరించిన యకవులవేగాక, ఇంక నెందరో కవులు గానం సియుందురు. అంతియేగాక యిందు సేకరించినవి కూడ, వారి రచనలందలి కొలది భాగములు మా తమే.

ఈ సేకరణలో ఆంధ్ర శ పు స్తక భాండాగారములందలి పుస్తకముల గాలించి, వివిధ కవులను సందర్శించి, మారుమూలల అచ్చటచ్చటగల జా యాభి మాన వ్యక్తుల దగ్గఱగల గేయములు, పద్యభాగములు, సేకరించు భాగ్యము కలిగినది.

ఈ చురణలో తమ తమ రచనల ప్రచురణ కనుమతి నొసంగిన వారలందరికి నా ధన్యవాదములు. కడమ కవుల రచనల సేకరింపజాలని నా యశక్తతను యాంధ్రావని మన్నించుగాక.

ఎందరో కవులు, పెద్దలు, పత్రికాధిపతులు, పుస్తకభాండాగారాధిపతులు, నా యీ సంకలనకు తోడ్పడిరి. అందు ముఖ్యముగ వేటపాలెం సారస్వత ని తన గౌరవ కార్యదర్శి శ్రీ అడ్సుమిల్లి శ్రీనివాసరావుగారు, రాజమండ్రి గౌతమీ పుస్తక భాండాగారపు గౌరవ కార్యదర్శి శ్రీ మహీధర జగన్మోహనరావుగారు, కొన్ని పద్యభాగములు సేకరించి యిచ్చిన మిత్రులు శ్రీగూడూరి నమశ్శివాయ గారు, 'చందమామ' మేనేజరు శ్రీ బి. యస్. రామారావుగారు, వివిధ గీతములు గల తన పాటల పుస్తకమును అందించిన, . శే. గుమ్మిడిదల సుబ్బారావు గారి భార్య రా శ్వరీబాయమ్మగారున్నూ, ముఖ్యముగ తెలంగాణా కవుల య భాగములు సేకరించుటకు తోడ్పడిన శ్రీ కోదాటి నారాయణరావుగారు, శ్రీ వుల వల్లి రామానురావుగారు, శ్రీ శివపంతుల లక్ష్మీనృసింహశాస్త్రిగారు, శ్రీ దాశ రథిగారు మొదలగు పెద్దలున్నూ, యిందలి వ్రాతలకు తోడ్పడిన ఆప్తమిత్రులు, వీరు వారనక అభిమానముతో నా యీ యుద్యమమునకు తోడ్పడిన వారికంద రకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. లోగడ 1947లో 'స్వాతంత్ర్య పథము' అ . య పద్య సంపుటి వెలువరించితిని. కాని . డియ్యది మహాకవుల సమష్టి గేయ పద సంపుటి.

పద , య, సమీకరణలో, విచక్షణలో, ప్రచురణలో, అశాభంగము అనేకములుండవచ్చును. ఇయ్యవి బహుముఖముల సేకరింపవలసినవై, గురుతర బాధ త కష్టములతో కూడిన బృహత్కార్యమని పాఠక మహాశయులెరింగి నన్ను మన్నింతురుగాక.

ఇయ్యది గాంధీజయంతి వత్సరమున ప్రచురింప బ్రయత్నించితిని. సాగలేదు. ఇంతలో నా యదృష్టము పండినట్లు కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, హైదరాబాదులో జరుగు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సమావేశమునకు గొనిపోయి, తదధ్యక్షులు, నాకు చిరకాల మిత్రులగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి యీ సంకలనము గురించి పరిచయము చేసిరి. అంత వారు సంతసించి, యిద్దానిని, మాకిచ్చిన ప్రచురించెదమని ఆనంద ముప్పొంగ బలికిరి, వల్లెయంటిని. కార్యదర్శి శ్రీ వులపల్లి రామానుజరావుగారుయీ గ్రంథముపూర్తి యగునంత వరకెంతయో హెచ్చరించిరి. ఇది అచ్చు గ్రంథముల నుండియేగాక వ్రాత పుస్తకములనుంచి సేకరించుట, సరిగా వ్రాసికొనుట, తప్పులు దిద్దుకొనుట లుప్త భాగములు, దస్తూరి తెలియని భాగములు పూరించుకొనుట మొదలగు ఘట్టముల దాటి, ప్రచురింపగల్గితిని. ఈసంకల్పమును భారతస్వాతంత్ర్య రజతోత్సవ సంవత్సరమున, అకాడామీ వారు మన్నించి, ప్రచురించుటకు తీర్మానించి తెలిపిరి. అందులకెంతయు నేను వారికి సర్వదా కృతజ్ఞుడను.

నా యీ ప్రచురణకు తోడ్పడిన, శ్రీ విశ్వనాథవారికి, శ్రీ గోపాలరెడ్డి గారికి, ముఖ్యముగ శ్రీ వులపల్లి వారికి, యింక దీనికి సాయము, ప్రోత్సాహమొసంగిన వార లందఱకు నా మనఃపూర్వక ధన్యవాదములు.

నా యీ జాతీయ గీతముల సంకలనకు తొలిపలుకు వ్రాసిన సుహృద్వరేణ్యులు శ్రీ గోపాలరెడ్డిగారికి, శ్రమయనక విమల పీఠిక వ్రాసియిచ్చిన కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ గేయ పద్య సంకలనము పూజ్య బాపూజీకి, ఒకఅమూల్య కంఠమాలయై అజ్ఞాత వీరులకొక కృతజ్ఞతా పూర్వక పుష్పాంజలియై, భరతమాత పాదారవిందముల కొక మహాభిషేకమై పాఠకమహాశయులకొక దివ్యస్మృతియై, విరాజిల్లు గాక యని యాశించుచున్నాను.

హైదరాబాదు,
తేది 3-2-1973

ఇట్లు
మాతృపాద రేణువు
గురుజాడ రాఘవశర్మ

# సమర్పణ

('మాకొద్దీ తెల్లదొరతనము' పాటవలె)

పల్లవి : జాతీయగీత, సంగీతం వినండి, వి
ఖ్యాత కవీంద్ర, హృద్గీతా రసామృతం. ॥జాతీయగీత॥

చరణము: స్వాతంత్ర్య సమరాన–జాతిమేల్కొలిపి, ఉద్రూతి
లూగించినదండి,

వీర వ్రాతము నడిపించె నండి,
వైరి వ్రాతము నెట్టె సుమండి,
రాజ్యం చేతికందించిన దండి,
స్వీయ జాతికి ప్రాణము సుండి,
వీర, జాతీయస్ఫూర్తి, వి–ఖ్యాత విజయ కీర్తి,
వీతి హోత్రునిఖ్యాతి, వెలయించె, నిజశక్తి
॥జాతీయగీత సంగీతం వినండి॥

గీ॥ డెబ్బదియు నాలుగేండ్లు నిండెను గదయ్య
తరలుచుండును, సత్కవితా స్రవంతి
తెలియజాల నెందులకొ, జాతీయ వీర
గీతముల పొందుపరచు, గిల్గింతనాకు.

గీ॥ ఉడుకుచున్నది, రక్తమిప్పుడును మరల
భరతదాస్య విముక్తికై పాటుపడిన
శతభక్తుల హృదయము త్తేజపరుప
నెంచి, గీతామృతము చిందించినట్టి
కవుల వాగ్విభూతి, దలచి, కాంచిలోన॥

గీ॥ విమల విఖ్యాత కవుల గేయములనుండి
యేర్చికూర్చిన యట్టి జాతీయగీత
ముల సమర్పింతు సద్భక్తిపూర్వకముగ
పొందుగా మాతృపాదారవిందములకు॥ (గురుజాడ)



# "జాతీయగేయ కవిసార్వభౌమ" - శ్రీ గరిమెళ్లసత్యానారాయణగారి జీవితము

అగాధమైన మహార్ణవమున అట్టడుగున పడియుంటవి అమూల్యమైన ముత్యాలు. కఠిన శిలాగర్భమున కానరాకుండ, యొదిగి యుంటవి ఘనమైన వజ్రాలు. ధూళి ధూసరముగ కప్పబడి, నిదించుచుంటవి, మట్టినైన మచ్చలేని మాణిక్యాలు. అటులనే మహాకవులు కూడ, మారుమూలల యూరు పేరు -నీ, యుపాధులలో యజ్ఞాత గర్భములనుంచి, పైకుబికి, పమణులుగ, ప్రకాశించి, స్వప్రకాశులై నిలచి, దిక్ చందిక ల విరజిము చు భావాంబరమున ధ్రువతారలుగా భాసిల్లుదురు. అట్టి సుకృత జీవులలో మన గరిమెళ్ళ సత్యనారాయణగారొకరు.

ఆంధ్ర దేశమున, ఉత్తరమున గల, కళింగాంధ్రమున శ్రీకాకుళమండలము, నరసన్నపేట తాలూకా, గోనెపాడు గ్రామం శివారు, ప్రియాగహారం వీరు జనించిన పుణ్యభూమి. గరిమెళ్ళ సూరయ్య అనే బాహ్మణోత్తము యన పితామహులు. ఆయన కుమారుడు రామకృష్ణమ్మ అ. వేంకట నరసింహం, యీ కవి పితృపాదులు. ఈ శూర కవిని కన్నతల్లి పుణ్యవతి సూరమ . ఈయనకు ముగ్గురు చెల్లెండ్రు, నలుగురు తము లు. వీరి ప్రాథమిక విద్య స్వస్థానమగు అగ్రహారమున గడిచిపోయినది. వీరి ఉన్నత విద్య, విజయనగరం, మచిలీ పట్టణములలో సాగినది. పసిద్ధ భూస్వాములు బారిష్టరు శ్రీ క. న్నపల్లి లక్ష్మీ నృసింహం గారి ధన సహాయముతో పట్టభద్రులు కాగలిగినారు. తొలుత గంజాంజిల్లా కలక్టరాఫీసులో వీరి గుమాస్తాగిరి. ఆ ఉద్యోగం తొలిఘట్టముల లో , వీరికి జాతీయభావము లంకురించుట, ఉద్యోగమునకు స్వస్తి చెప్పడము కూడ జరిగినది. తరువాత విజయనగరము ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా పని సిరి. అది మూణ్ణాళ్ల ముచ్చటైనది. తరువాత రాజమండ్రి టయినింగు కళాశాలలో యల్. టి. ట్రయినింగు క్లాసులో చేరినారు. అది శ్రీపాద కామేశ్వరరావుగారి సహాయ సంపత్తులతో నడిచినది. ఇంతలో జాతీయ పవాహం, హిమాలయోత్తుంగ శృంగముల నంటునట్లు భారతావనిని వ్యాపించినది. శ నాయకమణి లోకమాన్య బాలగంగాధర తిలకు మహాశయుడస్తమించినాడు.

తోద. గాంధీమహాత్ముడు భారతావని కేడుగడయై యవతరించిన పుణ్యదినములవి. శబంధు లాలా లాజపతిరాయ్ అధ్యక్షత ంద కలకత్తాలో ప్ర త్యేకావసర కాంగెను సమావేశము జరిగినది. దానిలో బ్రిటీషు ప్రభుత్వమును పతిఘటించుటకు బహిష్కరణోద్యమము (అసహాయోద్యమము) సాగింప తీర్మానించినారు. ఆ ర్మానానుసారము కోర్టులు, శాసన సభల బహిష్కరణ, విద్యార్థులు విద్యాలయములు బహిష్కరింపవలెనని ర్మానించిరి. దీనికి నాయకుడు గాంధీ . వారి శంఖారావము,మన సత్యనారాయణగారి చెవిని పడినది వెంట, టయినింగు కళాశాలావరణదాటి ప్రభుత్వమునుగూర్చి సూటిగా 'మా కొద్దీ తెల్లదొరతనము,' అంటూ ప్రబోధ గీతం పాడనారంభించెను. స్వదేశోద్యమము భారతావని నల్గడల వ్యాపించినది, ఈ అహింసాయుత శాంతి సమరమున, రాజమండి వాతావరణము కూడ ఆయనకు కొంత దోహదము సినది. మించి వారి పచారమునకు ఆయువు పట్టైనది. 'దండాలండోయి, మేముండలేమండోయ్ (బాబు), నూలు పోగు మీద రాజ్యం ఊగుతున్నదండి బాబు, సీమనూలు తెంచి నుసితికి పోవునండి బాబు!' ఆ పాటలు వారి నోటినుంచి వచ్చినవో లేవో, ఆంధ్రావని నిండ ప్రాకి, ఉరూత లూగించినవి. ఇంక న క గేయములు ప్రచారము చేసినారు. ఈ పాటలు పాడిన వారికి ప్రభుత్వము ఖైదువిధించిన, యిక యీ పాట సృజించి, పాట పాడిన కవిని ప్రభుత్వము విడచి వదలుపెట్టునా. వానికి ప్రతిఫలం ఒక సంవత్సరము శిక్ష.శ్రీకృష్ణ జన స్థానమున దొరలిన గేయములు వాని, కంఠస్థము సికొని, బయటకు రాగా , పచారమునకు బూనుకొనినారు. మరల వారికి రెండున్నర సం.లు శిక్ష విధించినది పభుత్వం. స్థైర్యము, ధైర్యము కలిగిన సహధర చారిణి, భార నకలావస్థలుపడుచూ, దురదృష్టవశాత్తు వీరు జైలులో నుం గ , శమాత యొడిలో దీర్ఘని దపోయినది. సత్యనారాయణగారు స్ఫుర దూపికాదు. కురూపియు కాదు. ఒకమాదిరి చామనచాయ. 5 అ. 4 అం.ల పొడగరి. ఆయనది పలుచని శరీరము. చూచుటకు కొంతమోటు మానిసిగా పొడగట్టువాడు. పెద్దనుదురు, చ్చినకళ్లు,గం రమైన చూపు కో రువంటి ముక్కు కా రం ముతుక ఖద్దరు పంచె యీయన వేషం. మితభాషి. కంచుకంఠస్వ ము. బరంపురం కారాఖి నోట- అనునాసిక ధ్వని మిళితమైన వాక్కు. నిష్క షమైన నవ్వు మొగము. అవసరమైనప్పుడు పసంగములలో ఆవేశము

వెల్లివిరిసెడిది. 'మా కొద్దీ తెల్లదొరతనం,' అ. పాట గరిమెళ్లను మరుపురానీయని మంచి కోట. మనసున చెరిగిపోని బాట. తెనుగునాట ా య కవిత్వమునకు యొరవడి పెట్టిన ప్రముఖ కవిగణమున, మన గరిమెళ్ల వారొక మణిపూస. వారిదొక నూత్నపంథా. ఆయన గేయముల బాణిచి, యెంతమంది కవులో, యొరవడిదిద్ది గేయకవులు కాకలిగినారు. ఆయన ఒక జానపద గేయ ప్రబోధ నాయకమణి. భావమునకు తగిన ఫణితి-ఫణతికి తగిన శబ్దము; ర్చిన తెలుగు నుడి కారములతో, గేయ ప్రవాహమును స్రవింప సినారు. ఆ జా య వీరరస వాహినిలో ముగ్ధులై యుత్తేజితులు గాని ఆం ధులేకాదు ఆం . తరులుకూడ యుండ రనిన అతిశయోక్తికాదు. ప్రజలే కాదు. గాంధీగారే యొకప్పుడు తన యులై 'ఖలేకవి' అన్నారు. ఈయన గళమెత్తి 'రా రా! పోదాము రాజ్యమేలుదాము' 'కొయ్యడ, కొయ్యడ ఇలాగురారా. కోటీయింతలు సెబుతానో రయ్యోకొయ్యాడ' అని పాటలు పాడుసరికి యొడలు మరచి, యుప్పొంగి, జనప్రవాహము నిలచి పోయెడిది. ఒకప్పుడు భరతనాట్యము సెడిది. జనం రాకపోకలు కూడ ఆగి పోయెడివి. అట్టి సమ్మోహనాస్త్ర గేయముల బాణి, పలుకు రు ప్ర్ర యకము వేరు. ఆయన ఒక గేయ సరస్వ చరణ చారణ చక్రవర్తి. ఆ దినములలో అతడు పాడినదిపాట. అతడు నడచినది, నడిపించినది ఒక ఆట. లయాన్వితమైన ఉ్రరూతలూగించెడి శ్రావ్యచరణ నాదప్రసాద వినోదమునకు మూలకందమై సకల జన సమ్మోద పులకిత చైతన్యానందము వారిధారా ప్రవాహము.

చిన్న తనమున వివాహమై, అనతి కాలమున భార్య గతించుట , మరల వివాహమాడెను. మొదటి భార్యయందు ఇద్దరు, తరువాత వివాహ మాడిన భార్యయందిద్దరు కుమార్తెలు కలిగినారు. ప్రచారాగ్రగణ్యులుగ ప్రతిభ వహించిన గరిమెళ్ళ రాజమం డి యం భరింపజాలని కష్ట నిష్ఠురములకు గురియయ్యెను. చెడి చెన్నపట్నం రినట్లు, తప్పని సరిగా 1923 ప్రాంత మున పవి తగోదావరి రము వదని చెన్నపురికూవంనదీ రమునకు వితమును దరలించినారు. ఒక విశిష్టత, ఆయనలో కలదు. పభుత్వము సత్యనారాయణ గారిని బంధించి, మేజస్ట్రేటు పిలిచి, మీపై రము మోపబడినది, ఇందుకు మీ సమా ధానమేమిటి అని ప్రశ్నించుచే తడవుగ, వెంట 'వినండి! ఇదుగో! నా సమాధానం వ్రాసికొనండినా వాఙ్మూలము అని, 'కూలిపోతున్నాది, మూర్ఖబ్రిటీషు ప్రభుత్వము మూలమట్టంతోటి కూలిపోతున్నాది,' అని గంగా ప్రవాహము వంటి, వీరవిహార

గీతము వెలువడినది గరిమెళ్ళ వాల్మీకిముఖాబ్జము నుండి. నాడు ఈయనను యు వాఙ్మయ చక్రవర్తి అన్నారు పెద్దలు. ద్రావిడ దేశమున కూడ వీర భారత విప్లవ గీతములు వెదజల్లి రిపతాక స్థాపించుకొనిన .శే. సుబ్రహ్మణ్య భారతి కూడ, ఆర్థికముగ యీయన కోటిలోని వా , లేమిబాధలో. వీరు మహా తా గులు విరాగులు. తిండిలేక, యిలమటపడి, అజ్ఞాతముగ కాలగర్భమున నమైనారు. సుబ్రహ్మణ్యభారతికి మాత్రము ద్రావిడ శము మరవరాని, జ్ఞాపక చిహ్నముగ కీర్తిస్థూపమొకటి ఆయన పేర ప్రతిష్ఠించినది. మన భారతికి పట్టెడన్నము పెట్టి జోక్యం పట్టించుకొన్న పెద్దలెవరుఅంతగాలేరు. ఇది మన శ దురదృష్టము. 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన - మా కర్మఫల హేతుర్భూర్మా సంగోస్త్వ కర్మణి' అను గీతావాక్యాను సరణి చింతకు తావీక దారిద్ర్యమును సంతోషముగ యనుభవించి వితమును దేశమునకు ధారబోసిన ధీరుడు వీరుడు మన గరిమెళ్ళ.

వీరి వితరంగమునగల కొన్ని ఘట్టములు: ఆయన కొంతకాలము గృహలక్ష్మి పత్రికలో, పత్రికాధిపతియగు సరిగారికి కుడిభుజము. కాల వశాత్తు యిద్దరికి పడక యీతడు బయటికి రాకతప్పలేదు. తరువాత త్రిలింగ ప త్రికలో కొన్నాళ్ళు, తరువాత శారదాగ్రంథమాల స్థాపించి ద్రవిడము ర్చు కొని, ప్రముఖ ద్రావిడ గ్రంథమగు 'కురల్' అర్థత్రయ సర్వస్వము వచన కావ్యముగ అనువదించిరి. నాలడియార్ అను నీతి గ్రంథమును, ద్రావిడ భర్తృహరి, అనుపేరిట తెనిగించి, పచురించిరి. 'హార్టు ఆఫ్ ది షన్సు' అను గ్రంథమును పద కావ్యముగ బుర్రకథగ వ్రాసినారు. ఖండకావ్యములు కొన్ని పచురించిరి. అ క హరిజన పాటలు, స్వరాజ్యపాటలు వ్రాసినారు. ఫిలాన్సు జర్న స్టుగ, కొంతకాలం ఆంధ్రప్రభ సంపాదక వర్గంలో కొన్నినాళ్ళు పని సిరి. ఎంత చేసినను హమునకు పుష్టిలేదు. చివరకు దృష్టితగ్గి హస్వదృష్టితో, మేవి, యీ మాయా పంచము నవలోకింప యోజనములేదనునట్లు, యీ అద హీనునకు, పూర్తిగ దృష్టినష్టమైనది. అప్పుడప్పుడు అవసరమునకు వావిళ వేంక శాస్త్రిగారు, అమృతాంజనము వారు, కొలదిగ ధన మొ ంగి ఆదరి వారు. చెన్నపురి వీధులలో యాచించి నడుముపై, తల వంచుకొని, త పోవుచుండెడివారు. యీ నిరాడంబర భావకవి చక్రవర్తి, మీదు. మంది అన్నము పెట్టినను మరొకజ నైన అన్నము దొరుకు

. మోయన్నట్లు 'కల్పకవిలాసం'అ. భోజన హోటలు నిర్వహించినారు. అందున గూడ అన్నపూర్ణ అనుగ్రహించలేదు. అప్పుడప్పుడు మిత్రులు పలకరించుటలో కుశల పశ్నలలో అనెడివారు— "కొందరు త్యాగము యపవలె, కొందరు దారి ద్యముతో నశింపవలె, పూర్తిగా నాశనమైనగాని, . శమునకు స్వరాజ్యము రాదు." ఒకప్పుడు మాధవపెద్ది అన్నాడు...ఋణాల బాధ వదలేక, నిత దారి ̃. వనపు నెత్తురుసైతము పీల్చునట్టి పాపిష్ఠి ఋణాలబాధ." అటుల వీరు దారిద్ర్యము అనుభవించిరి. గాంధిగారొకనాడు, జా య గీతముల రచ యితల నమావేశము యేర్పరచి, నబర్మ ఆ ̃మమున వివిధ రాష్ట్రములతో బాటు వీరినికూడ బిల్వగా, హాజరైరి. గాంధిగారి ఆజ్ఞానుసరణి యెవరిపాట వారు పాడి వినిపించినారు, గరిమెళ్ళ స్వీయ పీరావేశ , యమొకటిపాడి, "దీనికి బహుమతి ఒక సంవత్సరం శ్రీకృష్ణజన స్థానము లభ్యమైనది" అన్నారు. అనగా గాంధిగారు నమ్మలేదు. తెలుగువారిమాట అంత లికగ నమె డి వారు కారు గాంధిగారు. వారు ". ను నమ్మను, ఇట్టిపనికివేరే నీవేదియో నియుండవలె"నని చమత్కరించినారు. సాక్ష్యము ధృవమైన తరువాత నమ్మక తప్పలేదు. అంతియేకాదు. గాంధిగారు, తారస్థాయినందుకొన్న ఆ పాట విని ఆశ్చర్యచకితులై, మిగతా కవిగణమునకు సలహానిచ్చినారు. ఈ బాణిలో, మీర దరుకూడ గేయము లు వ్రాయుడని, అది మన గరిమెళ్ళకు గాంధి గారి చ్చిన యోగ తాపత్రము (Certificate) ఈ పాటను పకాశం పంతులుగారు ఆంగ్లమున అనువదించి తమ స్వరాజ్య దినప తికలో పకటించినారు కూడ.

ఈయన జీవితము యే యుద్యోగమునకు పనికివచ్చినదికాదు. జీవిత శకటము మొదట, పట్టాలు తప్పినది. దారిలోనికి రావడమనునది యెంత అదృష్టవంతునకోగదా?

అరవై యేండ్లు నిండినవి, చూపు కనపడదు. పిల్లలందరు పెళ్ళికాని వారు. ఒక కుమార్తెమాత్రం ఆయన పోషణభారము వహించినది. వావిళ్ళ వారు ప్రతినెలా యిచ్చెడి పదిరూపాయలతో జీవనోపాధికిసరిపోదుకదా. చివరకు ఉపనయనమునాటి పెన్నిధివిద్య భిక్షాటనం ఆధారమైనది. అది చరమ దశలో వీరి కాధారము.

దారి|ద్య వతకు కూడ, కవులే యా ´యమా అనునట్లు ( ) దుగ్గిరాల, రామకృష్ణకవి, మొదలగు మహానుభావులెందరో దారి|ద్యమును స్వాభావికముగ సంతోషముగ అనుభవించిరి. మన గరిమెళ్ళకూడ కటిక దారి ´ద్యమనుభ వించి 60వ యేట 18-12-52 దీన భారత సావి తి వీరాంక పీఠిపై దీర్ఘ శాంతి సుకొనినారు. ఇట్టి జా •య కవిసార్వభౌముని మన శము అందరి తోపాటు వీరినికూడ మరచిపోయినది. ఇట్టి అజ్ఞాత జా యగేయ కవి సార్వ భౌమునకు నా హృదయపూర్వకపు జోహారులు.

ఓం శాంతి—శ్శాంతిః శాంతిః

రాఘవశర —గురుజాడ.



# విషయ సూచిక

| నెం. | | పుట |
|---|---|---|
| 1 | భారత జనని | 1 |
| 2 | జా ీయ జండా | 71 |
| 3 | తిలక్ నిర్యాణము | 97 |
| 4 | పాంచాల పరాభవము | 105 |
| 5 | మహాత్మాగాంధీ | 119 |
| 6 | అనహాయోద్యమము | 251 |
| 7 | రాట్నము-ఖద్దరు | 268 |
| 8 | మద్యపాన నిషేధము | 385 |
| 9 | హరిజనోద్యమము | 391 |
| 10 | స్వాతంత్ర్య సమరము | 407 |
| 11 | జైలు కడగండ్లు | 685 |
| 12 | స్వాతంత్ర్యము | 455 |
| 13 | మహాత్ముని దివ్యస్మృతి | 475 |
| 14 | మంగళహారతి | 585 |



మాతృ పూజా ధ్యాన తత్పర
మతి బవిత్ర స్నాతుడవునై
విశ్వమందిర పుణ్య భూమి
వెడలి రావోయి !

—"రాయప్రోలు"

# వందే మాతరం

(బంకించంద్ర చటర్జీ)

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం-మాతరం॥ వందే మాతరమ్॥
శుభ్రజ్యోత్స్నా-పులకిత యామినీం
ఫుల్లకుసుమిత-ద్రుమదళశోభినీం
సుహాసినీం-సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం॥ వందే మాతరం॥

త్రింశత్కోటి కంఠ కలకల నినాద కరాళే
ద్వి త్రింశత్కోటి భుజైర్ధృత ఖరకరవా-
కే బోలే మా తుమి అబలే
బాహుబలధారిణీం-నమామి తారిణీం
రిపుదళ వారిణీం-మాతరం॥ వందే మాతరం॥

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ తుమి ప్రాణ శరీరే
బాహుతే తుమి మా శక్తి-హృదయే తుమి మా భక్తి
తుమారీ ప్రతిమా గడి-మందిరే మందిరే॥ వందే మాతరం॥

తుమీ దుర్గా దశప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ-నమామి త్వాం
కమలాం-అమలాం-అతులాం మాతరం॥ వందే మాతరం॥

శ్యామలాం-సరళాం-సుస్మితాం
భూషితాం-ధరణీం-భరణీం-మాతరం॥ వందే మాతరం॥

వందే మాతరమ్.

# జాతీయ గీతం

(గురుదేవ్: ౹ రవీంద్రనాథ్ ఠాకూర్)

జన గణ మన అధినాయక జయహే!
భారత—భాగ్యవిధాతా,
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగా.

వింధ్య, హిమాచల, యమునా, గంగా
ఉచ్ఛల జలధి తరంగా,
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాంగే
గాహే తవ జయ గాథా.

జన గణ మంగళ దాయక జయహే!
భారత—భాగ విధాతా,
జయహే! జయహే! జయహే!
జయ! జయ! జయ! జయహే!!



# దేశభక్తి

(మహాకవి గురజాడ)

దేశమును ప్రేమించు మన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టి మాటలు కట్టి పెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయి !

పాడి పంటలు పొంగిపొర్లే
దారిలో నువ్ పాటు పడవోయి
తిండి కలిగితె కండ కలదోయి
కండ కలవాడేను మనిషోయి !

ఈసురోమని మనుషు లుంటే
దేశ మేగతి బాగుపడునోయి
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయి !

అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి
దేశి సరుకుల నమ్మవలె నోయి
డబ్బు తేలేనట్టి నరులకు
ర్తి సంపద లబ్బవోయి !

వెనక చూసిన కార్యమేమోయి
మంచి గతమున కొంచెమే నోయి
మందగించక ముందు అడుగేయి
వెనక పడితే వెనకే నోయి !

పూను స్పర్థను విద్య లందే
వైరములు వాణిజ్య మందే
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చ వోయి !

దేశాభిమానము నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకో కోయి
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూప వోయి !

ఓర్వ లేమి పిశాచి దేశం
మూలుగులుపీల్చె సె నోయి
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చ వోయి !

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి
ఒకరి మేల్ తన మేలనెం
నేర్పరికి మేల్ కొల్ల లోయి !

సొంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడు పడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి !

చెట్ట పట్టాల్ పట్టుకుని
దేశస్థు లంతా నడవవలె నోయి
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలె నోయి !

మతం వేరై తేను యేమోయి
మనసు వొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగి
లోకమున రాణించు నోయి !

దేశ మనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్త వలె నోయి
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలె నోయి !

ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలకవలె నోయి
పలుకులను విని దేశమం ద
మానములు మొలకెత్త వలె నోయి !



# మాతృస్తవము

("గరిమెళ్ళ")

వందనమిదె గైకొనుమీ - భారత జననీ!
భారత జన మా పాలిటి రాణీ. ॥ వందన ॥

నందనుల బ్రోవుమీ - ఆనందదాయినీ
ఆనందదాయినీ ముని బృంద వందినీ! ॥ వందన ॥

ముప్పది కోట్ల జనమునకు - మూల మాతవు
మూల మాతవు మా పాలి నేతవు, ॥ వందన ॥

మాదు భాగ్యములకునెల్ల - మహిత కర్తవు
మహిత కర్తవు—మా యఘవిహర్తవు! ॥ వందన ॥

ఉపనిషత్తులుద్భవించె యుదరమందున
ఉదరమందున, అవి నిదుర చెందునా! ॥ వందన ॥

సకల పురాణేతిహాస - సారభరితవు
సారభరితవు-ఓంకార మహితవు! ॥ వందన ॥

సకల సంపదలకు నీవు సంగ్రహంబవు
సంగ్రహంబవూ! గర్వ సంహారంబవు! ॥ వందన ॥

సాత్విక నిరోధమునకు-జన శాఖవు
జన శాఖవు, పటు జన సమేతవు! ॥ వందన ॥

యుద్ధశకము మాన్పునట్టి బుద్ధిశాలివి
బుద్ధిశాలివీ - అనిరుద్ధ ప్రజ్ఞవీ! ॥ వందన ॥

స్వరాజ్య దీక్ష గొనిన-సత్యమూర్తి,వి
సత మూర్తివీ - అసహాయ వర్తివీ! ॥ వందన ॥

*

# రాష్ట్రగీతము

("రాయప్రోలు")

వందే త్వాం భూదేవీం ఆర్యమాతరం
జయతు జయతు పదయుగళం తే నిరంతరమ్ ॥

శుభ్రశరచ్చంద్రయుక్త చారు యామినీం
వికసిత నవకుసుమ మృదుల దామ శోభినీం
మందస్మిత యుక్త వదన మధుర భాషిణీం
సుజలాం సుఫలాం సరళాం శివవరదాం
చిర సుఖదాం ముకుళరదాం ఆర్యమాతరం. ॥ వందే ॥

దశకత్రయకోటి జనకంఠనాదినీం
అమిత భుజాం ధృతసదసీం తనయతారిణీం
హిమనగజాం స్వాభిమాన బుద్ధిదాయినీం
కమలాం అమలాం అతులాం రిపుహారిణీం
బలకరిణీం ధృతనళినీం రాష్ట్రమాతరం. ॥ వందే ॥

ధర స్త్వం మర్మత్వం త్వం యశో బలం
శక్తిస్త్వం భక్తిస్త్వం కర్మచాఖిలమ్
ప్రతిసదనం ప్రతిమా తే త్వం మహాబలం
ధరణీం భరణీం జననీం కవిప్రతిభాం
నతసులభాం జగదంబాం హిందుమాతరం ॥ వందే ॥



# మేలుకొలుపు

('మంగిపూ ')

మేలుకొనుమీ భరత పుత్రుడ
మేలుకొనుమీ సుజన మిత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనవయ్యా ! వత్సా ! ॥ మేలుకో ॥

వేకువను జా౦యతాయను
వేగుచుక్క పొడిచె నదిగో
కూడి "వందేమాతరం" బని
కుక్కుటములు రచెన్. ॥ మేలుకో ॥

అల్లనదె విజ్ఞాన మనియెడు
నట్టి యరుణోదయము నాయెను
చెల్లె నంతః కలహమనియెడు
చీకటది యెల్లన్. ॥ మేలుకో ॥

అంతటను నవశక్తి యనియెడు
కాంతి పుంజము తేజరిల్లెను
మంతనంబున నూతనోద్యమ
మారుతము వీచెన్. ॥ మేలుకో ॥

అందఱును నీకంటె ముందఱ
నడుగు వేయుచు మెలగుచుండగ
పందవలె నిటు నిద్రపోవగ
పాడియగునయ్యా ! ॥ మేలుకో ॥

పగటిపూటను నిద్రపోయెదు
వారియి టను లక్ష్మి నిలువదు
తగదు ఋషి సంతతికి బుట్టిన
ధన్యులకునిట్లు. ॥ మేలుకో ॥

ఆర్యపుత్రుడవై జగంబున
నవతరించియు నీ విధంబున
ధైర్యమెడలి జడత్వమొందుట
ధర మగునయ్యా. ॥ మేలుకో ॥

భార యుడె సద్గురుండని
పాడుచున్నది వినుము భారతి
ధీర వరుడవు నీ స్వశక్తిని
దెలిసికొనుమయ్యా. ॥ మేలుకో ॥



# స్వారాజ్యగీతామృతము

## భారతమాత గీతము

(శ్రీ బాలకవి : వడ్డాది సీతారామాంజనేయులు,
శ్రీ పూడిపెద్ది కా విశ్వనాథశాస్త్రి)

( "సిరిసిరి మువ్వ" వలె )

దండాలు దండాలు-భారతమాత
అవి అందుకుని దీవించు-భారతమాత
గాంధీ మహాత్ము ండు - భారతమాత
నీ ముద్దు కొడుకుండంగ — ,,
మాకేమియును భయములేదు-,,
మాకేమియును కొదువలేదు- ,,
తెల్లోళ్ళుంటుండంగానె — ,,
మాకు చిప్ప చేతికొచ్చింది - ,,
మూడు వందలేండ్ల క్రింద— ,,
అలకుంపినోడు దిగినాడె — ,,
దిగి యూరకున్నాడా - ,,
మా దేశమంతా దోసుకెల్లె - ,,
కుంపిని రాజ మంతరింప - ,,
అలసీమ రాణి గద్దెకెక్క - ,,

శ్రీముఖమును నొకటిచ్చె భారతమాతా!,,
గంపెడాశతో చూస్తుంటె – ,,
అది గాలి బుంగయై పోయె –,,
నిరంకుశాధికార మొచ్చె– – ,,
మమ్మేమెపుకొని తినుచుండె – ,,
నీ పాదాలొక్కటె తప్ప – ,,
మాకిప్పుడింక దిక్కేది – ,,
నీవు రత్నాల తల్లివే – ,,
నీవు పైరు పంటల నిక్షేపంవే– ,,
మా పాలి కామధేనూ – ,,
నీవు మా పాలి కల్పవృక్షం – ,,
పాడిపంటల మహాలక్ష్మి – ,,
మా మొఱలాల కింపు మమ్మ–,,
కఱ్ఱలైన కొట్టకుండ – ,,
మా కత్తికూడ లాగినాడె ,,
భూమి దున్ని బ్రతుకపోతే ,,
ఎంతో! పెద్ద పన్ను వేసినాడె ,,
అది సందర మంత తవ్వినట్లు ,,
ఉప్పుమీద పన్నంటా ,,
తన్న బిడ్డలె శత్రులైరి ,,
నీవు మన్నించి దిద్దుకొమ్మ– భారతమాతా!

*

# మేలు కొలుపు

(శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి)

మేలుకొనుడు ! మేలుకొనుడు ! మేల్మిబంగరు-ఉషస్సిది!
ఓ నిద్రామత్తుల్లార ! ఓ భద్రాప్రమత్తులార !
ఈ ప్రాభాతిక వేళను-మీ ప్రాంగణములు తెరువుడు
మేలుకొనుడు ! మేలుకొనుడు ! మేలి బంగరు ఉషస్సిది॥

౦ ౦ ౦ ౦

ఆకు కూడ మేల్కొన్నది, అశ్రద్ధకు అవని కదలె
ఉదయమలయ మరుదంకుర
వలయంబులు పారుచుండె.
మేలుకొనుడు ! ఒత్తిగిలుడు ! లేచి కండ్లు నలచి గనుడు॥

౦ ౦ ౦ ౦

పక్షిగూడ మేల్కొన్నది, వనదేవత ప్రాణమువలె
ప్రణయ ్వ మధురగాన
ఝురులు కదలి రెక్కవిప్పె
ఉరికె నుత్సాహ మొప్పె !
లెండు ! లెండు ! దేవ దేవు- ల పికముబాడె వినుడు !

౦ ౦ ౦ ౦

గుడిగంటయు మేల్కొన్నది-అడకువ పూజారివోలె
దివ్యశంఖనాద ప్రతి
ధ్వనులు సుప్తి కాంక్ష జెరిచె
జాగ్రద్దధి మథన మొరసె
లెండు ? నడుము గట్టిముంధు-పొందు ప్రార్థనలు బాడుడు !

ం ం ం ం

పిల్ల పూవు మేల్కొన్నది-ప్రేమబాటసారి వోలె
అభయ మనః ప్రమదరహో
దళ శ రములు విరిసెను
లలితలాస్యములు కురిసెను
లేవలె ఖేదంబు పడక-పోవలె గమ్యంబు జూడ।

ం ం ం ం

పథముగూడ మేల్కొన్నది-నిరపాయపు కాల్వవలెను
సహచర జనగణ విభాత
వనములు తలలూపుచుండె
గమనంబులు సాగుచుండె
లేవలె లేవలె మీరే-వెనుకబడితి రెంతొ జూడ!

ం ం ం ం

నిశిగూడను మేల్కొన్నది - నిన్ను లేపు దాని వలెను
ఉద్బుద్ధ ప్రకృతి మనో
భూకంపంబదె దరిసెను
ప్రత్యూషంబదె మురిసెను
లెండిక స్వాతంత్ర్యమిదో-లెండు శ్వాస విడువుడటనె
మేలుకొనుడు ! మేలుకొనుడు- మిసిమిబంగరుల ఉషస్సిది!

# వందే లోకైక నుత మాతరం

( నారాయణ రాగం, రూపకతాళం )

పల్లవి-వందే లోకైక నుత మాతరం-

అనుపల్లవి-పూర్ణ సుందరతర వినిర్మల-భువన భూషిత వాహినీ
స్వర్ణ రజిత వినూత్న మణిగణ—సంభృతాంచిత ఘనఖనీ!

చరణములు

రంగదఖిల భాషిణీ ! సుహాసినీ ! సజ్జన చూడామణీ
భంగరహిత శుభప్రదాయిని-భవ్యనభోధారిణీ
క్రూర విమత మదాపహారిణి-ఘోర దుఃఖ విదారిణీ
తుంగకంధరధారిణీ ! సదావని-రంగత్ఫుల్లా ధారిణీ
తుంగభంగ భవద్యశోస్ఫుట-తోయధిత్రయధారిణీ
సర్వకుసుమ ఫలద్రుమశోభిని-సర్వజంత్వపతారిణీ
భాసురగుణ వందినీ - జనరంజని- భరత జననీమణీ
వ్యాస గౌతమ యాజ్ఞవల్క్య మహా మునీశ్వర మాతృకా
రామ మ కి ·టి ధర్మజ-ప్రముఖ ధీర సమాజనీ॥ వందే ॥

## వందేమాతరం

శ్లో॥ వందేమాతర మిందు సుందర స ం ఇందిందిరా ధారిణీం
హిందూనందన మానసాంబుజ స్వరాజ్యోత్సాహ సంవర్ధినీం
మందానంద కృతావదాత ముఖహృత మాసీమ అహీన ప్రభాం
కందర్పారి నమానపుత్ర ప్రసవీం ఆర్యాం సదా భారతం ॥

## మాతృభిక్ష - భవతీ భిక్షాం దేహి

భవ_ భిక్షాం దేహి మాతా । భవ్య భిక్షాం దేహి భ్రాతా
సస్యసుశ్యామల వాసినీం । శుభ్ర తుషార కిరీటినీం
ఫుల్ల కుసుమిత శోభినీం । భువనమనోమోహినీం ॥ భవ ॥

త్రింశత్కోటి ప్రజావ ం । పరాక్రమ ప్రభావ ం
లోకనుత కళావ ం। పూతచారిత్ర యశోవ ం॥ ॥భవ ॥

సర్వవిద్యాప్రదాయినీం। బ్రహ్మవిజ్ఞాన సంధాయినీం
నిత్య కల్యాణ ప్రసాదినీం । ని లగుణ నివేదినీం ॥ భవ ॥

ం ం ం ం ం

వందన మఖండ భారత వర్ష జననీ । జన వందనమ్
సుందరామల మందపవనానందదాయినీ । జననీ । వందనమ్

అశేష కుసుమదళ సువాసినీ । ఆర్యభూషణీ । జననీ వందనమ్
అఖిలదేశసుఖనికేతన-హర్షవర్ధినీ-ఆరోగ్యస్నాన పాయినీ। ॥వందనమ్॥

# మాతృ గీతా

("రాయప్రోలు")

నమో మంగళశ్రీ మహా మాతృ భూమే
నమో భారత సవిత్రీలలామే ॥

నమస్తే హిమాహార్య ధమ్మిల్లతారా
నమస్తే త్రివేణీ భర శ్రీరధారా ॥

అలం దీప తే తావ నా పతాకా
త్రివర్ణాయితాకూత చక్ర ప్ర కా ॥

జ్వలంతి తవ క్షాత్ర శస్త్రాస్త్ర మాలా
వృణీతే స్వయం శాంతి మక్రూర లీలా ॥

ధ్రువంతే ప్రజా రామ రాజ్యం స్వతంత్రం
పరం తేహ్యహింసా ముఖస్వీయ మంత్రం ॥

ప్రశామ స్తు చాన్నాంబర క్షామభేదాః
వినశ్యన్తు రాష్ట్ర ప్రజా మిత్ర భేదాః ॥

అశోకం భవేదార్తి జుష్టం ప్రపంచం
చిరం వర్ధతాం భార॰యం చరిత్రం ॥

# ప్రబోధము

(చిలకమర్తి)

తే.గీ. భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ,
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.

సీ. పన్నుగట్టుటయందు ప్రభువులౌ హూణుల
కేనాటికైనను దృష్టి లేదు
ఉద్యోగములు చేయు నునత్తులకు గార్య
నిర్వాహమందున నియతి లేదు
బహు పరీక్షల దేరి ప్రజ్ఞాఢ్యులగు మీకు
రవ్వంతయేని ధైర్యంబు లేదు
మితిలేని తమ చెడ్డగతినెల్లఁ దగ విన్న
వింపఁగ రయితుకు విద్య లేదు.

తే.గీ. తెలుఁగు తెలియంగ దొరలకుఁ దెలివి లేదు
దీనదశఁ బాపగల యట్టి దిక్కు లేదు
కటకటా! యెట్టులున్నదో కాపుల దశ
సుగుణ ధనులార జనులార చూడరయ్య.

సీ. నేలి దున్నుదమన్న జాల తరము పన్ను
నీరు గావలెనన్న నీటి పన్ను
వాణిజ్య మొనరింప వచ్చుబడికి పన్ను
సరుకు లము దమన్న సంత పన్ను
క ్గ లమ్ముదమన్నఁ గలప కింకొక పన్ను
పట్టణంబుల మున్సిపాలు పన్ను
పారిపోవు దమన్న బండి హాసీల్ పన్ను
కొంపము కొన్నచో స్టాంపు పన్ను.

తే.గీ. ఉన్నమట్టుకు తినకుండ నుప్పు పన్ను
ననెడు పన్నులె దిగదీసె జనుల నెల్ల
కటకటా! యెట్టులున్నదో కాపుల దశ
సుగుణ ధనులార జనులార చూడరయ్య.



# మాతృవిలాపము

(చెన్నాప్రగడ భానుమూర్తి)

చ. మతములు జొచ్చినిల్లు జనమాన్య చరిత్రులు పుట్టినిల్లు న
ప్రతిమ దయా శమాది గుణరత్న సమృద్ధికి రోహణాద్రి శా
శ్వత నిరపాయ మోక్షఫల భాసుర వేదలతాలవాలమై
యతుల విభూతిఁ బొల్తు విల నంబరో నీ సరి ధన్యలుందురే!

ఉ. మాతరో! నీ సుతుల్మనుపు మాన్యచరిత్రులమేయశేముషీ
ఖ్యాతులునై యనారత మఖర్వగతిం ధన ధాన్య సంపదల్
ప్రీతికి మెండుగా గలిగి పేదరికంబున పేదలై కలా
చాతురి శౌర్య సంపదల శాస్త్ర పరిశ్రమ మించి రెంతయున్.

మ. అకటా! దేశ దరిద్రతం దలపగా నత్యంతము న్స్వాంతముల్
వికలం బయ్యెడు సర్వరత్న ఖనియై విస్తీర్ణ రసాఢ్యయై
సకలోర్వీమణి నూపురంబయిన యీ సర్వం సహాభాగ మం
దొక నూటన్బదికైన లేదు దిన నయ్యో తల్లి ముప్పొద్దులన్.

శా, గంగా సింధు మహా నదుల్ యమునయుం గావేరియు న్నర దా
తుంగభద్రలు బ్రహ్మపుత్రయు లసద్గోదావరీ కృష్ణలున్
బంగాళాంధ్ర కళింగ కోసలములం బాంచాలముం గొంకణం
బుం, గర్ణాట మరాట దేశములనున్ ముక్కాఱు ధాన్యంబు లో
లిం గాపించి యొసంగినం గుడువఁ దల్లి లేదు ముప్పొద్దులన్.

శా. రంగద్రత్నమయూఖ దీధితి సమారాజద్దరీ భ్రాజితో
త్తుంగక్ష్మాధర పంక్తులుం బరిలసత్ఫుల్లాబ్జ కాసారముల్
తుంగక్ష్మారుహ శోభి కాననము లెందున్ లోచనానందమో
లిం గావించుచు నుండు కూడొకటె తల్లే లేదు ముప్పొద్దులన్.

సీ. పొద్దున లేవంగ బొయిరాజ వలెనన్న
నగ్నిహోత్రము స్వీడె నంపవలసె
నా బాల గోపాల మఖిలంబునకు
మాన్చెస్టరు పుట్టము ల్నేయవలసె
మునుమాపు వ్యాయామమునకు కందు
కములు లండను బంపుచుండవలసె
వ్రాతకు లేఖినీ పత్రము ల్వలయుచో
నాస్ట్రియా జర్మనీ లంపవలసె.

గీ. చిన్న బిడ్డలు త్రావంగ క్షీరములును
భాగ్యవంతుల పాలకు పంచదార
యూరిపేదల గంజికి యుప్పుగల్లు
నన్య దేశంబు లంపగ నయ్యెనకట!

ఉ. మానె కలా ప్రవీణత, సమస్తము నస్తము నొందె శిల్పము
ల్పోనె నశేష భూరమణ వాంఛిత భారతవర్ష సంపదల్
డాసె నవగ్రహంబు, ధనలక్ష్మి దొరంగి దరిద్రులై ప్రజల్
గాసిలి చిక్కి రెంతయును క్షామనిపీడితులై యజస్రమున్.

కం. నేతల కోతల చిత్తరు
వ్రాతల నిర్మాణములను వాసి గనిన యా
తాతల తండ్రుల వృత్తులు
చేతి పనుల్ దక్కి దిగిరి నేదముననప్ బజల్.

ఉ. జాతి మతాది భేదముల సంస్కరణంబు మెయిం బరస్పర
ప్రీతియు భ్రాతృ భావమును వీడి యొకప్పుడు నేక దేశ సం
జాతుల మన్న మాటను బ్రజల్గణియింపక దేశవృద్ధికిం
ఘాతుకులైరయో! జనుల కష్టము లెన్నఁడు రునో కదా ?.

శా. ఏవాడం గన నెల్లవారలును నెంతే వృద్ధి గాంక్షించి యా
తా వాసంబులు వీడిపోయి యఖిల వ్యాపారము ల్నత్కళా
ప్రావీణ్యంబులు సంగ్రహింపఁ దమ పూర్వఖ్యాతియే యెంచి మి
థ్యా వైరాగ్యముఁ బూని యుందురిట నత్యంతంబు సంతుష్టులై.

ఉ. క్షామము దీరునే ప్రజ కకాలపు మృత్యువు వోలెఁ దోఁచి వే
మామక దేశవాసులను మారి మసెంగెడు మారి యాఱునే
నేమమున న్సుఖింతురె యశేష జనంబులు స్వస్థచిత్తులై
బాములు దీరి దగు కృపారస వృష్టిని దేరి దైవమా.

ఉ. భారతవర్ష మందు మనవారలు పూర్వము బుద్ధిమంతులై
చార దుకూలధారులయి షడ్రసము ల్భుజియించు చున్నెడ
న్వారలు గట్టి కూర లశనంబుగ నుండిరి యన్యదేశపు
న్వార లటం డు; వారిపుడు భాగ్యము నందులఁదూగుచుండగాన్.

ఉ. బేరు ప్రతిష్ఠ యున అచి పేదలమై వెడఁ గూడుఁ గూరయుం
రయు లేక చిక్కువడి చింతల పాలయి చెట్లు పుట్టలుం
జేరి వసించు మౌనిక్రియ ర్ణ శరీరము లర్థభుక్తిచే
నీరసమై కృశింపఁ గడు నీచత నుంటఁ దలంప రేమియున్.

మ. మతివైశద్యము పాప తియును ధర్మస్ఫూర్తియు న్వే చెడెన్
మతవైషమ్యము లెచ్చె భక్తికడు సన్నంబయ్యె దుస్తర్కముల్

వితతంబయ్యె దయాశమాది గుణముల్మృగ్యంబు లయ్యెంగటా!
సతతధ్వాంతము గ్రమ్మె దేశజన ధీ సమ్మోహనంబై కడున్.

మ. ఉదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వి న్నిరాఘాట సం
పదనేకాతపవారణంబుగ మిథో మాత్సర్యము ల్మాపి దు
ర దశత్రు వ్రజమున్ హరించి కరుణం బాలింపుచో నైకమ
త దమున్ ప్రదము నైన యాధునిక విద్యా కల్పవృక్షంబిటన్

మ. సదయత్వంబున నాటి సేతు రచనా నైపుణ్యమే పారఁగా
నదులన్ సాగర గాములన్ పథమునన్ బంధించి వంధ్యోర్వి స
స్యద గావింపఁగఁ గుల్య లేర్పరచి, రథ్యా శ్రేణి నిర్మించి సౌ
ఖ్యదమై పొల్చు స్వరాజ్య మీ యవని స్థైర్యస్ఫూర్తి వర్ధిల్లుతన్.

మ. వందేమాతర మంచుఁ జిత్ర లిపులన్ భాస్వత్పతాకల్ వెలుం
గం దేశాంతర సంగసర్వజల భాగ ప్రస్థితిం ధూమ నౌ
కాందోళంబులఁ దూగి వచ్చి నిజదేశాలోకనావాప్తి నా
నం దాంభోనిధి నోలలాడుదురు సన్మాన్య స్థితిన్నిసుతుల్.

గీ. పాఁడి దలఁచిన మనపాలి పాలవెల్లి
పైరు దలఁచిన మనపాలి పంట చేను
వసు సమృద్ధికి మనపాలి భాగ్యరాశి
భరతఖండము మన తపః ఫలము గాదె?.

గీ. నిరత సర్వర్తు సుమఫల భరిత మ ల
దేశ మృగపక్షి రాజితోద్దేశ మమల
వారిపూరిత నదనదీ భ్రాజిత మిది
యఖిల ధాత్రికి నారామ మనఁగఁ దనరు.

గీ. ప్రజలు ప్రజ్ఞాన సముద్రులు భవ్యమతులు
విమల సౌజన్య యుతులు పవిత్ర చరితు
లఖిల శిల్పకళా రహస్యార్థ విదులు
నసదృశౌదార్య సాహస ప్రాంచితులును.

గీ. కూటికేమియు మనలకుఁ గొదువ లేదు
కోటు లెన్నియు బోయెడు గుడ్డలకయి
ఆ ప్రవాహము నాపంగ నానకట్ట
యన స్వదేశోద్యమము నేఁటి కమరె మనకు.

గా మనకు గల్గెగా బహిష్కార మరయ .

గీ. తండ్రి దైవంబు మనలకుఁ దల్లి ధాత్రి,
తండ్రి యొసఁగిన దివ్యసాధనము దీనిఁ
గొని గడంగుడు బాపంగ జననిదైన్య
మిట్లొనర్చిన మన కగు నిష్టసిద్ధి.

గీ. సన్న నూలున సరిగను జాతి పనులఁ
దోఁచు సంతోషమెల్లను దుచ్ఛమనుచు
దేశమాత యొసంగెడు లేశమయిన
మేరువంచుఁ దలంచుట మేలు మనకు.

గీ. ముతుక బట్టలుఁ గట్టుట మోటు దన మ
టంచు వెంగలులై మన మెంచఁ జనదు
హృదయ మందున నౌదార్య మెసఁగకున్నఁ
గల్ల మెఱుఁగుల నాగరికంబు రాదు.

గీ. తండ్రి దైవంబు మనలకుఁ దల్లి ధాత్రి
యన్నదమ్ముల మగు మన కైకమత్య
మును నిరంతర సౌభ్రాత్రమును బొసంగు
నివి యొసంగిన మన కగు నిహము పరము.

గీ. మనము బుట్టిన మన్నును మనము గలియు
మన్ను నియ్యది, గావున మనకు బైట
వేష భాషల భేద మెవ్విధి నొదవిన
హృదయ సీమల సౌ భ్రాత్ర మెనయ వలయు.

గీ. కాన దేశ మానంబు కల్మి కైస్త
వులు ముసలానులును హిందువులును బార
సీలు నొక్క కుటుంబమై చేరి దేశ
మాత నుద్ధరయింతురు గాతఁ తి.

గీ. శక్తు లభ్యాస-సహితమై జనుల యందు
ఘన వికాసము గాంచి ప్రకాశ మందు
శక్తు లభ్యాస రహితమై సన్నగిల్లు
చాల కాల మటులె పోవ సమసి పోవు.

కం. "రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మగాన రాజును బ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్."

భారత జనని

కం. అనునార్యో_ని మఱవక
ననవరతముఁ బ్రజలు ప్రభువులనురక్తి మెయిన్
విను తైకమత్య భావము
పనుపద వర్ధిల్లుచుండ్రు ప్రాజ్ఞులు పొగడన్.

కం. వందేమాతర మను నీ
వందారు జనాళి కెప్డు వాత్సల్యము తో
డందేశమాత యమితా
నందం బొనఁగూర్చు గాత ! నానార్థదయై.



# జాతీయగీతము

("దూవ్వూరి")

జోహార్! జోహార్! భారతమాతా!

జోహార్! జోహార్! జోహార్!

శారద శుభ్రవియత్తల పథమున సంచరించు నీ రథము
నీ మృదు వీణాగాన ప్రబుద్ధము-నిత్యము మా మనము
జోహార్! జోహార్!

ప్రత్యూషలక్ష్మీ మకుట మణి ప్రభ-బాసె దమోగణము
నీ పదపంకజ నూపురఝుంకృతి-నిద్రావిరహితము.
జోహార్! జోహార్!

విప్లవ ఝుంఝూ విచలిత వన-వీచినికాయమున
స్థిర విజయోడుపకర్ణ ధారణము-సేయుము శౌర్యమున
జోహార్! జోహార్!

ముకుళిత హస్తులు నీ ప్రియపుత్రులు-మోదదృష్టిగనుము
నీ కరుణామృత నిర్ఝరపూరము-నింపుమమ్మ సతము
జోహార్! జోహార్!

నీ పదపీఠిని ప్రాణసుమంబులు-నిల్పి భజించెదము
గర్హితదాస్యభరంబును మాన్పి-సుఖంబులు మాకిడుము
జోహార్! జోహార్!

*

# జన్మభూమి

("రాయప్రోలు")

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండుగౌరవము.

ఏపూర్వ పుణ్యమో, ఏ యోగబలమో
జనియించినాడ వీ స్వర్గఖండమున
ఏమంచి పూవులన్ ప్రేమించినావో
నినుమోచె యీ తల్లి కనక గర్భమున.

లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరులింకెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక.

అందాకగల ఈ అనంత భూతలిని
మనభూమివంటి చల్లని తల్లి లేదు
పాడరా నీతెల్గు బాలగీతములు
పాడరా నీ వీర భావ భారతము.

తమ తపస్సులు ఋషుల్ ధారవోయంగ
శౌర్యహారము రాజచం ద్రులర్పింప
భావ సూత్రము కవిప్రభువులల్లంగ
రాగ దుగ్ధము భక్తరత్నముల్ పిదుక

దిక్కుల కెగదన్ను తేజము వెలుగ
రాళ్ళ తేనియలూరు రాగాలుసాగ
జగముల నూగించు మగతనంబెగయ
సౌందర్యమెగబోయు సాహిత్యమలర

వెలిగిన దీ దివ్యవిశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్యదేశంబు పుత్ర
పొలముల రత్నాలు మొలిచెరా యిచట
వార్ధిలో ముత్యాలు పండెరా యిచట.

పృథివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు
అవమానమేలరా? అనుమానమేల?
భార యుడనంచు భక్తితోపాడ.

తమ్ముడా!

ప్రలు పొంగిన వగడ్డయి
పాలుపాఱిన భాగ సీమయి
వ్రాలినది యీ భరతఖండము
భక్తిపాడర; తము డా!

వేదశాఖలు పెరిగె నిచ్చట
ఆదికావ్యంబందె నిచ్చట
బాదరాయణ పరమ ఋషులకు
పాదు సుమి ది చెల్లెలా !

విపిన బంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట
విపుల తత్త్వము విస్తరించిన
విమల తలమిదె తమ్ముడా !

సూత్ర యుగముల శుద్ధవాసన
క్షాత్రయుగముల శౌర్యచండిమ
చిత్రదాస్యముచే చరిత్రల
చెఱిగిపోయెనె చెల్లెలా !

మేలి కిన్నెర మేళవించీ
రాలు కరగగ రాగ మెత్తీ
పాలయని బాల భారత
పదము పాడర తమ్ముడా !

నవరసమ్ములు నాట్యమాడగ
చివుర పలుకులు చెవుల విందుగ
కవిత లల్లిన కాంత హృదయుల
గారవింపవె చెల్లెలా !

దేశ గర్వము దీప్తిచెందగ
దేశ చరితము తేజరిల్లగ

దేశ మరసిన ధీరపురుషుల
తెలిసి పాడర తమ్ముడా !

పాండవేయుల పదును కత్తులు
మండి మెఱసిన మహిత రణకథ
కండగల చిక్కని తెలుంగుల
కలసి పాడవె చెల్లెలా !

లోకమంతకు కాక పెట్టిన
కాకతీయుల కదన పాండితి
చీకిపోవని చేవ పదముల
చేర్చిపాడర తమ్ముడా !

తుంగభద్రా భంగములతో
పొంగి నింగిని పొడిచి త్రుళ్ళ
భంగపడని తెలుంగు నాథుల
పాట పాడవె చెల్లెలా !



# మాతృస్తవము

(కాటూరి వేంకటేశ్వరరావు)

కొప్పున తారకల్ తురిమి, గోమగు మోమున జందవంకతో
నొప్పెడి రావిరేక యిడి, యుర్విధరంబులు చేసి, పాలయే
ఱుప్పతిలంగ జేసి, పృథులోరు తలమ్మున జేర్చి బిడ్డలన్
దెప్పల దేల్చి కనొఁగుచు దేవి భవత్పద మాశ్రయించెదన్.

పుడమికి పర్వతమ్ములును, భూమిధరమ్ములకెల్ల గాన, ల
య్యడవుల కెల్ల మేఘముల, నంబుధరంబులకెల్ల నబ్ధి, న
క్కడలికి సూర్యు, నిమ్మెయిని గాపులు పెట్టుచు వీని నన్నిటన్
గడుపున బెట్టి బ్రోచు నిను గన్గొను టెన్నటికో దయామయీ!

పలిత పాండుర శపాళితో నొకమాఱు
ముత్తైదువంబలె బత్తి గూర్చి,
నవ వసంతారంభ పవమాన సౌరభ
ము నదేలు చొకపరి ముద్దులొలికి,
కారాకు రాల్చి తురషాము మెయిగప్పి
జాలిగొల్పుచు నొక్కమాఱు వించి,
ఉరుము మద్దెళ్ళతో మెఱుపు నృత ము నల్పి,
యొకపరి నెమ్మది కుబ్బు గొలిపి,

దిన దినము క్రొత్తవేషమ్ము దిన దినమ్ము
క్రొత్తభావము దాల్చి క్రొంగ్రొత్త సూపు
అక్షయ విలాసినీ యీ ప్రతిక్షణాంగ
హారముల దాచెదేల నిజాంతరము.

నిజయశశ్చంద్రికల్ నిఖిల దిక్కుల యందు
ప్రజ్జ్వల చేసిన ప్రాజ్ఞురాలు,
వీరాధి వీరుల విజయ ప్రతాపుల
ప్రియమారగన్న ప్రావీణ్యురాలు,
తన ప్రతాపము తెల్పి తనయుల మేల్కొల్పి,
ఘనత గాంచగనున్న యనఘురాలు,
మత వివక్షత మాన్పి వెతలు దీర్పగనున్న
పుణ్యాతు రాలింక పూజ్యురాలు,

విమల విఖ్యాతి వడసిన వీరమాత
అట్టి భారత మాతను యనవరతము
తలచి, ఋణమును దీర్పగా తరలి రండు
జనని దుఃఖమ్ము మాన్పని జన్మమేల!



# భారత జనని

(గురుజాడ రాఘవశర్మ)

పల్లవి : జయ జయ భారత జననీ, పావనీ, జయ జయ ॥
అనుపల్లవి : జయ జయ సకలానంద దాయినీ, జయ జయ ॥

హిమాలయోన్నత - సమాదర్శిని
తమో దళన, విద్యా స్వరూపిణి. జయ జయ ॥

సంతత సస్యశ్యామల రూపిణి
సంచిత సకలైశ్వర్యదాయిని. జయ జయ ॥

పావన గంగా జీవన శో ని
పతితోద్ధారిణి, పాప విదారిణి. జయ జయ ॥

మధుర కుసుమఫల మంద సుహాసిని,
మంజుల శుక పిక - మధుర సుభాషిణి. జయ జయ ॥

ధీర వీర వర - నారీ రూపిణి
వైర వర్గ సంహారిణి - తారిణి. జయ జయ ॥

సార్థక, ధర -చ పతాకిని
సకల సౌఖ రా - జ్యప్రదాయిని. జయ జయ ॥

వీరకుమార కుమారీ ధామ్ని
విశ త్రిశో - త శుభనామ్ని. జయ జయ ॥

విశ్వలోకహిత విజయ కిరీటిని
శాశ్వత మంగళ - శాంతిదాయిని. జయ జయ ॥

# భరత మాత

("జాషువా")

ప్రమథ నాథుని నీరు ద్రావింప జాలిన
వజ్రాల కొడుకుల బడసినావు,
నరకాధిపతి గుండె గరగింప జాలిన
వెలది మిన్నల కుగ్గు బెట్టినావు,
బ్రహ్మ యంతటివాని వణకింప జాలిన
మునుల మూపున నిడి మోసినావు,
అంటినంతన పాపమణగింప జాలిన
తీర్థకోటుల మున్గి తేలినావు,

యుర్వి పుట్టకముందె నీ వుంటివేమొ
సకలశాస్త్ర పురాణముల్ చదివినావు
గొనబు సిరిగల భాగ్యశాలినివి నీవు
భారతాంబామణీ నమస్కారమమ్మ !

జలకంబులాడించు చెలికత్తెగద నీకు
గనకాంబుజాఢ్య గంగా భవాని
తలమీది గుండుమల్లెల దండ గద నీకు
నత్యున్నతోరు హిమాలయంబు,

## భారత జనని

పూత బంగారు సొమ్ముల పెట్టెగద .కు
సిరివెలంది చరించు సింహళంబు,
ముద్దుగారెడు నిగ్గుటద్దంబుగద నీకు
నిండారు హిందుమహాంబురాశి,

ఇట్టి నినుజూచి బిచ్చంబు బెట్టుమనుచు
అన్ని దిక్కులు యాచించు చున్నవమ
ఐకమత ంబుగల్గి నిన్ననుభవించు
కొఱత పూరింపవే మాకు భరతమాత !

# అగ్నిధార

("దాశర")

ఓ జనతా నతాంజలి పుటోజ్జ్వల కోష్ణనవోష్ణ రక్తధా
రా జలసిక్త పాద కమలద్వయ శో మనోజ్ఞ దేహ రే
ఖా జయ భార ! యుగ యుగమ్ముల పున్నెపుపంటవీవు నీ
పూజకు తెచ్చినాడ నిదెపొంగిన గుండియనిండు పద్దెముల్.

జండా, ఒక్కటె మూడు వన్నెలది, దేశంబొక్కటే భారతా
ఖండాసేతు హిమాచలోర్వర; కవీట్కాండము లోనన్ రవీం
ద్రుండొక్కండె, కవీంద్రు, డూర్జిత జగద్యుద్ధాలలో శాంతి కో
దండోద్య ద్విజయుండు గాంధి ఒకడే, తల్లి మహా భార ।



# మాతృభూమి

(కాటూరు వేంకటేశ్వరరావు)

పుడమి చేడియకు గొప్పనగ మల్లెపూదండ
పొలుపుగల మా జన్మభూమి భారతధాత్రి
ఎంత చక్కని తల్లివే! రాణివే। ఎల్లభూములకు నీవు

ముక్కారు పంటచేలు మితిలేని
రొక్కములు మూల్గు నిధులు
చక్కనగు పూదోటలు - మాతల్లి। సౌభాగ్యవతివి, నీవు
దిక్కులన్నీ వెదకినా-నీవంటి దేశమేదీ! పుడమిపై
ఎంత చక్కని తల్లివే, రాణివే! యెల్లభూములకు.

ఇంత చక్కని చంద్రుడూ। చుక్కలూ,
ఇంత వెచ్చని సూర్యుడూ,
కారు క్రమిన మిన్నులూ - తొలకు క్రొ
క్కారు మెఱుపుందీవలూ।
పులుగు పాటల జోలలూ, కలకలని
పులుగులా మేల్కొలుపులూ॥ ఎంత చక్కని......

ఒరగబండిన చేలకు - గిలిగింత
గరవు తెమ్మెర బాలుడు
పులక కెరటాలతో పొందు - భరతక్షి ॥ ఎంత... ...

పూలు విరిసిన వలూ - వల్లు
పొదివికొన్న నికుంజముల్
కుంజ కుంజమున భృంగీ కులములెత్తెడి పరువులూ
పరువు పరువున పాటలూ - సోనలై
పారు పూవుం దేనెలూ
తేనెలానిన యళుల సొక్కులందే లేవు॥ ఎంతచక్కని ...

తల్లి బిడ్డల ప్రేమమూ, అక్కచెల్లెళ్ళ కమ్మని వలపులూ
చల్లనైన సరాగమూ అన్నద
ముల్ల కింకెచట గలదూ!
అందిమ్ము చరణ యుగము, తల్లిరో!
అద్దుకొందును కన్నులా
నీకు బుట్టిన పున్నెమూ, ఫలియించు
నీలోన లయమందినా
ఎంత చక్కని తల్లివే! రాణివే, ఎల్లభూములకు నీవు ॥



# ఉయ్యాలా జంపాలా

"కవికొండల వేంకటరావు"

ఉయ్యాలా! జంపాలా! భారత నవ వన బాలా!
పూరిత సత్యాగ్రహ శీలా! పరిభవ దుఃఖిత పాంచాలా!
నీ పురుడు-ఏ నెలలో-వెన్నెలల-క్రొన్నెలలో
నీ పుట్టు-వెచ్చోట-మిన్నోట-మున్నోట. ఉయ్యాలా...

తొలినాటి-వేదాలు-పులివోని-చనుబాలు
మఱునాటి-కావ్యాలు-కమ్మ గుజ్జన గూళ్ళు. ఉ......

రామాయణ కథలు-ఊకొన్న వాక్సుధలు
భారత గీతా రుతము-చందాయి యమృతము? ఉ......

బుద్ధుడు నీ సంబుద్ధి-యవను లోకో నీ శుద్ధి
మొగల్ మరాటుల్ చేబంతుల్-రసపుత్రుల్ చేమంతుల్. ఉ......

పాశ్చాత్యమ్ మోహాంధమ్-ప్రాచీనమ్ ప్రియ బంధమ్
ఆధ్యాత్మ కలాణమ్-స్వాతంత్ర్యమ్ శతమానమ్. ఉ......

నీ మెట్టు నీలాలు-నీ చుట్టు నీ రాలు
జడ దొట్టు తలంబ్రాలు-ఒడిగట్టు మగరాలు. ఉ......

ముజ్జగపు దీవెనలు-ముప్పది కోటుల జనులు
జయ జయ వాదోన్నతులు-జేజేల హారతులు. ఉ.....

# జాతీయ గీతిక

(కవికొండల వేంకటరావు)

హిమగిరి శిఖరము-వింధ వనీంద్రము
కన్యాకుమా పద డిం రము

స్ఫురితము-భరితము-చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే-స్వాతంత్ర్యముచే

స్వాగత మనవోయ్, కవి, పని వినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్!
జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని,
కావేరి, నర ద యమునా సింధులు

అహర్నిశాదులు-ఒకటే గానము
కలలో-అలలో-అదే ప్రయాణము
స్వాతంత్ర్యముకై-స్వాతంత్ర్యముకై

స్వాగత మనవోయ్, కవి, పని వినవోయ్
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్.
గుజరాత్, వంగ, అంగ, మరాటా,
త్రిలింగ, తమిళ, కళింగమును జను

ల జరులు-అమరులు-అనామయులుగా
స్వాతంత్ర్యము హేయ్ ! స్వాతంత్ర్యము హేయ్ !

స్వాగత మనవోయ్, కని, పని వినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్ !
నౌరోజీ తిలకులు, లజప ద్దాసులు
దాని పథంబున, నలిగిన నొగిలిన

వెచ్చని నెత్తుటి దివిటీ వెలుగునె
స్వాతంత్ర్యంబదె !-స్వాతంత్ర్యంబదె !

స్వాగత మనవోయ్, కని, పని వినవోయ్
మనవోయ్, అనవోయ్. జయ్, జయ్, జయ్,
ఇంగ్లం డమెరిక, స్వీడన్, స్విట్జు,
జపాను, జర ని, చు, పరాసు,

అంబ విశ్వకళ క వాదన మిడు
స్వాతం త్ర్యమురా, స్వాతంత్ర్యమురా

స్వాగత మనవోయ్, కని, పని వినివోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్ !

# జయ జయ భారత జన గణ మాతా

జయ జయ భారత జన గణ మతా !
సాధుజన స్తుత చరితా ॥జయ జయ॥
పావన హిందు బౌద్ధ తురుష్క-
ప్రముఖ మతాలయ పూతా ॥జయ జయ॥
జగతిని శాంతి స్థాపకు డనియెడు
ఖ్యాతి వహించిన ఘనునీ ।
గాంధి మహాత్ముని-కరుణా సాంద్రుని
కన్న ధన్య జననీ ॥జయ జయ॥
గంగా యమునా గౌతమి కృష్ణ
కావే జల పూతా ।
వింధ్య ముఖర పృథివీధర భరితా
ప్రకృతి విచిత్ర సమేతా ॥జయ జయ॥
సకల ఖనిజ సస్యముల బొదలు నీ
సాటి యెవరు లోకమునా
వేద శాస్త్రములు నాది కాలమున
వెలయించిన యమా ॥జయ జయ॥
ముదమున ముప్పది మూడు కోటుల
ముద్దు బిడ్డలకు జననీ ।
సౌ భ్రాతృత్వము స్వాతంత్ర ంబును
సమకూర్పుమ సత్వరమ॥

జయ జయ భారత జన గణ మాతా।
సాధు జనస్తుత చరితా॥

# మా తల్లి

(గౌతమకోకిల, మహాకవి, వేదుల సత్యనారాయణశాస్త్రి)

ఆ యుషో దేవతా నయనాబ్జ మధువు
లొలుకు నీ శైశిర ప్రభాతోదయమున
గుర్తుపట్టితి సంతాన కోటి తోడి
తల్లివీవె పో! నా విశ్వధాత్రి వనుచు!

నీ కడ కాళులందె హిమ నిర్మల పావన శాంతి నిర్ఝరుల్
నీ కడ కన్నులందె జననీ స్తనదుగ్ధ విముగ్ధ మాధురుల్
నాకు లపప శైశవమునన్ నను వీడిన కన్నతల్లి పు
ణ్యాకృతి బోల్చుకొంటి భవదాకృతిలో నిపుడో కళావ !

నీ యమృత స్వరూప మెద నిల్చిన యంత గతానుభూతులున్
పోయిన పోకలుం దెమలి పోవని కాంక్షలు చింకి పాతలై
పాయగ, తల్లి వీవని భవచ్చరణము ల మోకరించి య
మా ! యని పిల్చుకొంటి బహిరంతర శాంతి సుధల్ స్రవింపగన్.

ఈ సచరాచర ప్రకృతి కెల్ల రసైక వికాస వ మీ
వే! సతతక్షుధం బరితపించెడు పేదలపాలి యన్నపూ
ర్ణా సతి వీవె! దుర్బలుల రక్షణకై యభయ ప్రదానమూం
జేసెడి శక్తి వీవె జననీ! భవదన్యము లేద, యేదియున్.

నీ దయగల్గినన్ జరుగనేరని దేదియు లేదు తల్లి! పృ
థ్వీదయితుండు శివగు, శివు రాజ్య ధురం ధరుండగుం
గాదన కింక నీ వభయ కంకణమూనుము నన్ను బోలు ని
ర్వేదుల పేదలం, జిర నిపీడితులం గృపమై భరింపగన్.

సోదర శోణితము ( జవి చూచెడి క్రూరులు కారి క ప్రజా
స్వేద ఫలము-తో నినుప పెట్టెల నింపెడి నిర్దయుల్ మతో
న్మాద నిరంకుశుల్ దుర మానులు నిం న లోకమందు అ
సా దృశ దుర్బల ప్రజల మన్పగ తల్లి! త్వదన్యమున్నదే!

ఆరని మంటగా బ్రతుకు నందు రగుల్కొనుచున్న దొక్క-టే
కోరిక, నీ కృపావనికి కోకిలనై కొనియాడు కొందు మం
దార సుమారుణ ద్యుతి వితానము గొల్పెడి మనోహరా
కారముతో మధూదయ వికాసము నింపుము తల్లి! నా యెదన్.

ఏ యనుభూతి లేక రసమెండి వివర్ణత దోగి, వాసనల్
పోయిన నా హృదంబుజములో నొలికింపు మొకింత సర్వ సం
ధాయకమైన నీ యడుగు దమ్ముల పుప్పొడితోడి నె త
ల్లి! యదె చాలు! నాకిక ఫలించును ప్రోవిడుకొన్న నా కలల్!



# ప్రియ భారతావని

(గౌతమీ కోకిల 'వేదుల')

ప్రియ భారతావనీ! విశ్వైకపావనీ!
జయశాలినీ! మము దయచూడుమా! జనని!
తెగలు తెగలై చీలి వగచు నీ సంతతిని
తెగని స్నేహమున బంధించి ఏకముజేసి ॥ప్రియ॥

కలుషితాచారముల కుల జాతి మత ద్వేష
ముల బాపి నీ సేవ సలుపు భాగ్యంబిచ్చి ॥ప్రియ॥

చెలిమితో జా ·య బలముతో వైభవో
జ్జ్వల జీవనము తో విలసిల్ల దీవించి ॥ ప్రియ॥

విలసద్యశము దిక్కులనిండ ఆసియా
తలమానికమ్ముగా నిలుప నీ కేతనము ॥ప్రియ॥



# నమో హిందు మాతా

నమో! హిందుమాతా! మాతా। సుజాతా!
నమో! జగన్మాతా॥ నమో॥
అమోఘ దివ్య మహిమా సమేతా।
అఖండవర భరతఖండ మాతా ॥నమో॥

విపుల హిమాద్రులే వేణీభరముగ
గంగా యమునలె కంఠహారముగ
ఘన గోదావరి కటి సూత్రమ్ముగ
కనులకు పండువ- ఘటించు మాతా ॥నమో॥

గోలకొండ నీ రత్నకోశమట
కోహినూరు నీ జడలో పూవట
తాజమహాలు నీ దివ భవనమట
అహహా। నీ భాగ్యము- మాతా॥ నమో హిందుమాతా



# జాతీయ గీతం

( దేవులపల్లి కృష్ణశాస్త్రి)

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రి, దివ్యధాత్రి,
జయ జయ జయ శత సహస్ర
నర నారీ హృదయనేత్రి
జయ జయ సస్యామల సు
శ్యామ చలచ్చేలాంచల
జయ వసంత కుసుమలతా
చరిత లలిత చూర్ణకుంతల
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా।
జయ జయ జయ ప్రియభారత ॥
జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ
జయ గాయక వైతాళిక
గళ విశాల పద విహరణ
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా॥
జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రి, దివ్య ధాత్రి॥

(కృష్ణా పత్రిక)

# జయ గీతి

( వానమామలై వరదాచార్యులు )

జయ భారతావనీ! జయలోక పావనీ,
శాంతి సుఖదాయినీ! జననీ! నమస్తే!
సకల సంపత్ఖనీ! సస్యనందనవనీ!
ఆసేతు తనగ హాటకావని జనని!
చత్వారింశత్కోటి-జయ ఘంటికాధ్వనీ,
సా తి కోటి భుజ బల మహావాహినీ! ॥ జయ ॥

హిందూ ముసల్మాను ఈసాయి శిఖ్ జైన్
బౌద్ధ చార్వాక సుత బహుమత కుటుంబినీ!
సంస్కృతాంధ్ర ద్రవిడ వంగ హిందీ ఓ ఢ
ఘూర్జర మరాఠ కర్ణాట కలభాషిణీ! ॥ జయ ॥

గంగా మహానదీ గౌతమీ కృష్ణాది
రంగత్తరంగిణీ! రమ్యామృత స్తనీ
శాంత హింసా సత్య శస్త్రాస్త్ర ధారిణీ!
వీర నారీమణీ! విశ్వహిత కారిణీ! ॥ జయ ॥

భారత జనని

వేద వేదాంత విజ్ఞాన ప్రదాయినీ !
బౌద్ధ సిద్ధాంత నిర్వాణ ప్రచారిణీ !
కాళిదాస వా స కావ్యమందాకినీ !
సంగీత సాహిత సత్కళా మోహినీ ॥ జయ ॥

నీకు ముువ్వంకులును నిలచి రత్నాకరుడు
వెలనురుగు తరగలను వింజామరలు వీచ
నీ హిమాలయ మకుట నిరా ణమున దోచు
- వమణులై సూర్య శశి తారకలు పూచు ॥ జయ ॥

నీ మహోన్నతి హిమానీ గోత్ర శిఖరము
నీ పవిత్రత గాంగ నిర్ఝర ప్రవాహము
నీ చేతి సొమె లోరా శిల్ప ఖండము
నీదు వాక్యము ( గీతోపదేశమ్ము ॥ జయభారతావనీ ॥



# దేశమా భారత మాతృ దేశమా

దేశమా ! భారత మాతృ దేశమా !
నా కన్నతల్లి ! దేశమా ! బంగరు -
హిందూదేశమా ॥దేశమా॥

ప్రహ్లాద నారదాది భక్తుల గన్నతల్లి
వీరహనుమాన్ మ-శూరుల గన్నతల్లి ॥దేశమా॥
ఏలాగు చిక్కినావు-ఎందుకు డస్సినావు
చాలా నలుగూలు చెంది - సతమతమైతివి॥
ముప్పది మూడుకోట్ల -ముఖ్య సంతతి నీకు
ముప్ప తిప్పలుపెట్టి - మూల్గుచుంటివి బాధ॥
కన్నుల నీరు నీవు - ఎన్నాళ్ళు కార్చెదవు
కన్నకొడుకున్నాడు - గాంధిని చూడవేమి ॥
ఏడాదిలోన సమ-కూడు స్వరాజ్యము
ఏడువకమ్మ స్వేచ్ఛ-చూడు తప్పక వచ్చు ॥
ప్రబలాహింస దీక్ష-పట్టి సాగితిమమ
ధర యుద్ధమందు-తప్పదు జయమింక॥
రాట్నలక్ష్మి -యింటి రాజ్య లక్ష్మి మాకు
వ్రతము బూనితిమి స్వరాజ్య లక్ష్మి కొఱకు ॥
హిందూ ముసల్మాను లేకమైయున్నాము
సందేహమేల, ని-శ్చయము స్వరాజ్యము ॥ ॥దేశమా॥

# భారతాంబికా

(గరికపాటి మల్లావధాని)

ఉ॥ హాటక రత్న రాశులకు నాకరమై, పరదేశ వాటిను
ఱ్ఱూటల నూఱజేసి విగతోపమవై యలరారు విన్ను నీ
నాటను గూటి గుడ్డల కనాథ విధంబునఁ గుంద సి, యా
రాటము నొందజేసెఁ బరరాజ్య విధానము భారతాంబికా !

చం॥ పలు విధముల్ మృగంబులను బక్షులు భూమిజముల్లతావళుల్
గొలకులు వాహినుల్ వనధులున్ గిరులున్ దదుపాత్తాటవీ
స్థలులను క్షేత్ర ర్థములు సస్య సమన్విత భూమి భాగముల్
గలకలలాడు నీకు నిటు గారియ గూరెనె ! భారతాంబికా !

చం॥ తరుగని భోగ భాగ్యములు, ధర మునన్ బరతత్వ బోధ మం
దురుతర సత్కళా ప్రతిభనూర్జిత సాహస ధైర్యవిక్రమ
స్ఫురణను నైతికంబునఁ ప్రభుత్వమునన్ జగదేక రాజ్ఞివై
పరగెడు నీవు నే డొరుల బానిసవైతివి ! భారతాంబికా !

ఉ॥ పుట్టిన నీదు బిడ్డలమె, పొట్టకు బట్టకు లేక పెక్కు లి
క్కట్టుల నొందుచుండ, నధికారుల మంచు విదేశ సంభవుల్
నెట్టనఁ టలెట్టుకొని నీ సిరినెల్లను దోచుచుండ మే
మెట్టుల నింకజూచి సహియింపగలారమె ! భారతాంబికా!

ఉ॥ సాధుజనాగ్రగణ్యుడతి శాంతుడనంజను నిమ హాతు స
ద్బోధల దప్పలేము సతముం బొనరించెడు, మాతృదేవతా
రాధనమే దురంత మపరాధము నందు రిదేమి ! యెన్న దే
వ్యాధుల దుర్వ్యధల్ విరుగడై సుఖియింతుమొ ! భారతాంబికా!

# మాతృ గీతమ్

(వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి)

జయ జయహే మహాంధ్ర జననీ! మధునాదవనీ!
జయ జయ హరిదంత వినత - మస్తకాగతరుణ ఘృణీ!...
గిరి వేణీ కృష్ణా-గౌతమి సుమణీ
భద్రా మేఖల రత్నా - పారిజాత సుమజ్యోత్స్నా! ... జయ
ఆంధ్ర విష్ణు నియమత - అర్చిత రాజనరేంద్రప!
కాకతీయ భుజసీమా-కృష్ణరాయ కృతి భూమా ... జయ
గోలకొండ కోశధనా-ఏకశిలా నగర ఘనా!
రాణ హేంద్ర రమ్యవిభా-రాజిత హంపీ శోభా! జయ
నన్నపార్య సుందర శివ వదనా - స్నపిత గోస్తనీ
పోతన సదనా!
మొల్ల కవితోత్ఫుల్ల హృదంతా-ముద్దుపళని ప్రణయలతాంతా
జయ॥
కోటి త్రయ జన సేవిత చరణా-కోమల జా కుసుమాభరణా!
లలిత కౌముదీ సుర శక్తి-లావణ సుధా మాతృమూర్తి!
...జయ

# భారత జననీ

(మంగిపూడి వెంకటశర్మ)

(పూరికళ్యాణిరాగం-రూపకము)

నిన్ను నెన్న మాతరమా । నిరుపమాన భరతమాత
మిన్ననై యఖిల భూముల । కన్నతల్లి । కల్పవల్లి
॥నిన్ను నెన్న మా తరమా॥

కనక రత్న ఖనిజములును-గలిగిన పర్వతములు
వనములు పుణ్యనదులు-పా-వనులగు తనయులు గల
॥నిన్ను నెన్న॥

ఒకరి చ్చమెత్త నీకు-నొక్కింతయు బనిలేదు
సకలము నీలోన కలదు-సాయము నీ కొరులదేల ॥నిన్ను నెన్న॥

చిన్నబోవు వదనము ల-న్నులై నినుజూచు చున్నవి
అన్నార్తి గన్నావని-వన్నెతక్కి పర రాజ్యములు
॥నిన్ను నెన్న॥

దాస వృత్తి నీకేల-తాగులు మహాతు లగుచు
వాసికెక్కిన సుతులు గలరు-గాసిల కేమి కొదువ
॥నిన్ను నెన్న॥

# జయ జయ భారత

( మంగిపూడి వెంకటశర్మ )

జయ జయ భారత జన గణ మాతా
సాధుజన స్తుత చరితా
పావన హిందు బౌద్ధ తురుష్క ప్రముఖ మతాలయ పూతా
॥జయ జయ॥

జగతిని శాంతి స్థాపకుడనియెడు-ఖ్యాతి వహించిన ఘను నీ
గాంధి మహాత్ముని-కరుణా సాంద్రుని-కన్న ధన్యయే జన
॥జయ జయ॥

గంగా యమునా గౌతమి కృష్ణా కావేరీ జలపూతా
వింధ్య ముఖర పృథివీ ధర భరితా—ప్రకృతి విచిత్ర సమేతా
॥జయ జయ॥

సకల ఖనిజ సస్యములు బొదలు నీ సాటి యెవరు లోకమున
వేదశాస్త్రములు నాది కాలమున-వెలయించిన మా యమా
॥జయ జయ॥

ముదమున ముప్పది కోటుల-ముద్దు బిడ్డలకు జననీ
సౌభ్రాతృత్వము స్వాతంత్ర్యంబును సమకూర్పుమా సత్వరమే
॥జయ జయ॥

——

# హెచ్చరిక

హిందు మాతా! నిన్ను వేడని-మంద బుద్ధిని మాన్పుమా!
అందమైన స్వదేశ వస్తువు-లందు, మా మది, నిల్పుమా!
వగవ వలదు! కంటనీరు-వంచబోకు మమ్మరో!
భారతమాతా! ధన్యురాలవు-ప్రతిభా గాంచెద వమరో!
వీర మాతా! సుతుల కలరు-వారి నందర బ్రోవుమా!
జగతి నిన్నుబోలు వీరమాత లెవ్వరు! తెల్పుమా!
నీతి బలము నిష్ఠ నియమము-లేనివారమైతిమి
ఐహికంబె శాశ్వతంబను-భ్రమను జిక్కి వాంటిమి॥
జాతి మ ము, కులము, వృత్తి పూర్తిగా నిరసించితిమి
తెల్ల దొరలవలె మేము భోగులమై పోతిమి॥
నీదా కళలను శాస్త్రములను పూర్తిగా విడనాడితిమి
ప్రకృతి శాస్త్రముల్ పరమార్థము-లని యెంచు చుంటిమి॥
ధనము కొరకై ధాన్యము పరదేశముల కంపుచుంటిమి
పూట తిండి లేక, ఆరు-కోట్లు మాడుచుండిరి॥
ఇంపు, సొంపు, గుడ్డలు, మా-కొంప గుల్లలు చేయుచున్నవి
దేశ దారిద్ర్యము బాప-స్వదేశ వ్రతమె బూనుకొంటిమి॥
ఉద్యోగముల జిక్కువడి-దాసు మున నీ దాచలంటిమి
కాయ కష్టము, కర్మ విద్యల-యుదరమును బోషింప జాలరు॥
త్రాగుబోతు తనము హెచ్చి తన్నులాడుకొను చుంటిమి
సర్వ పాపములను బాపి-స్వతంత్రులను చేయుమమ॥

# భరతమాత

('బలిజేపల్లి')

మేఘమండల మంటి మిహితాద్రి కబరీ భ
రంబు ముఖంబునై డంబుమీర
గిరి శిరంబున నుండి, యిరుదెసల్ జను సింధు
వును గంగయున్ బాహువులుగ దనర
సౌరాష్ట్ర వంగ దేశంబులు కటిహేమ
చేలాంచలంబులై చెలువు మీర
చోళ మండల మలయాళ తీరములు
అంఘ్రి ద్వంద్వమో యనుచు దనర

చారు హిందూ మహార్ణ్ణ క్షీర జలధి
తనరు సింహళ స్వర్ణ పదంబునందు
నిలిచి యున్నట్టి మహాలక్ష్మివలె దనర్చు
భరతమాతకు, నిత్యంబు వందనము.

# వందేమాతరం (7)

(మట్నూరి వెంకట సుబ్బారాయుడు)
(మంగపూ వేంకటశర్మ)

దేశా మానంబు, దీపింప జేయు మం
త్రంబు వందే మాతరంబు సుండు
సాహసౌదార్యమున్ సమకూరజేయు, మం
త్రంబు వందే మాతరంబు సుండు.

స్వాతంత్ర భాగ్యంబుఁ జేతి కందిచ్చు తం
త్రంబు వందే మాతరంబు సుండు
ఐకమత్యాధిక శల జేయు జం
త్రంబు వందే మాతరంబు సుండు.

హిందూ జనులార ! వాచాఫణీంద్రులార
నీతి పరులార! స్వాతంత్ర్య నిరతులార !
మన మనోరథములు దీర్చి మనుచు నట్టి
బహ మరయ వందే మాతరంబు సుండు॥

# భరతమాత

(మట్నూరి వెంకట సుబ్బారాయుడు)
(మంగపూ వేంకటశర్మ)

ఆ దయార్ద్ర చేత! చిర _ర్తి విఖ్యాత।
చారుగుణ సమేత। వీరమాత।
భవమహోబ్ది పూత। భద్ర భాగ్య స్ఫీత
భక్త పారిజాత! భరతమాత॥

బంగారు గనులు గలవో
రంగారెడు నదులు గలవు! రత్నంబులు చా
లం గలవు విలాతుల ని
బ్బంగినినో భరతమాత! భాగ సమేతా!

దేశ భక్తి గలాడె! సుధీశ్వరుండు
దేశభక్తి గలాడె పో! దివ్యమూర్తి
దేశభక్తి గలుగువాడె। దేవనిభుడు
వలయు దేశంబుపై భక్తి భరతమాత.

కృప "బరోపకారార్థ శ ర" మనుచు
దేహమె వ్వాడొసంగు స్వదేశమునకు
నట్టి, ధన తముని, నరుఁడనగ నేల।
సురల కన్నను, పూజు ండు భరతమాత॥

ప్రతి ఫల మా ంపక సం
తతమును లోకోపకార తత్పర చిత్తా
న్వితుఁడై ియలొనరించెడు
నతడె. సుకృతి భరతమాత ! హర్ష సమేతా !

దేశ హితము గోరి దేహంబు గేహంబు
దినము వనంబు ధారవోయు
మాన్యులను ఘనవదాన్యుల ధను-ల
గరిమ నెంతునమ ! భరతమాత॥

స్వసహాయమె సుశ్రేయము
స్వసహాయమె దైన్యహారము, సంపత్కారమున్
స్వసహాయమె, మానవులకు
వ్యసన హారము, భరతమాత । భావా తా॥



# దేశదురవస్థ

(మంగిపూ , ముట్నూరి)

రత్నఖనులకేది రమణీయ సదనంబు
వ నదులకేది తావలంబు
మేటి శైలంబుల కాటపట్టెయ్యది
గేహమెయ్యది, పంచలోహములకు
ని ల శాస్త్రములు, జన్మించిన నెలవేది
చక్రవర్తులకేది జన భూమి
సత్య సంధులకు వాసస్థాన మెయ్యది
ధర దేవతకు నాధారమేది

దానమునకునేది నిలయంబు, ధైర్యశాలు
లైన శూరా గగణ్యుల స్థానమేది !
అట్టి మన హిందుదేశమే, అక్కటకట
మిగుల దారిద్ర్యదశనొంది పొగులుచుండె.

సకల దేశముల కాశ్చర ము గలిగించు
కా ర శాలువల్ గంగ గలిసె
ఉర్వి యంతటను, నోహో? యనిపించు, ఢ
క్కా మేటి సెల్లాలనామ మణగె,
ని ల సీమలను, వన్నెకునెక్కె, మతి గన్న

శిల్పశాస్త్రం బతి స్వల్పమయ్యె
సకల రాష్ట్ర సుధీంద్ర సమా నితం బైన
ప్రకృతి శాస్త్రము స రింపంగ లేదు ॥

చేతి పనులెల్ల మిగుల నశించి పోయె
సిరియు విద్యయునుం గూడ, జెదరి పోయె
నాగరికతాభిమానముల్ నాశమయ్యె
హిందుదేశంబు గరిమంబు హీనమాయె॥

'సత్యంపద' యటంచు, సంతతంబును దప్పు
సాక్ష్యముల్ చెప్పు వాచాలుఁ డొకఁడు
'ధర్మంచర' యటంచుఁ దా నధర్మ పథాను
సారియై చరియించు క్రూరుఁ డొకడు
భువి 'నహింసా పరమోధర్మ' మని యాగ
పశుహింస నేయు ధీవరుఁ డొకండు
వసుమతి 'నాస్తి తత్త్వం గురోః పర' మని
తూలిపల్కెడి గురుద్రోహి యొకఁడు.

ధరఁ "బరోపకారార్థ మిదం శరీర"
మనుచు నపకృతుల్ నేయు దురాత్ముఁ డొకడు
వీరలందఱు దేశాన బెద్దలైరి
కట కటా! యిట్టెడుల నెట్లు గంటివమ

ధీరుల గార్యశూరులును, దివ్యశరీరుల, విక్రమ క్రమో
దారుల శ్రీవిహారులను, ధైర్య సమీరుల, విక్రమ మో
దారుల, భూరిసారులను ధన్యవిచారుల, సర్వ సత్కళా
పారుల, రూపశూరులను, వార్ధిగ రులు సాహస స వి

స్త్రారుల, దుష్టమానవ విదారుల వి(శుత వీరులన్, సదా
చారుల, సంహృతారులను సద్గుణధారులఁ, జారు ర్త లం
కారుల, నిర్వికారులను గాంచిన గర్భమునం దసారులను,
గూరుల రులన్ జననిరో! యెటుకాంచితివమ మమ్మలన్॥

ధన సంతతులకు సుందర మందిరంబునా
గోహినూరు వ జమే గొప్ప సాక్షి
శౌర సంపన్నుల జన భూమి యనంగ
నల, శివాజియె నిక్కమైన సాక్షి
శిల్ప సద్విద కనల్ప ధామంబునా
మేలైన, దలఁ తాజ్మహాలె సాక్షి!
వస్తునిరా తృ ప్రశ స్తసీమ యనంగ
భువన ప్రసిద్ధశాలువలె సాక్షి
కలిత దేశాభిమానంబు నిలయ మనఁగ
బకటమైన స్వదేశ వర్తకమె సాక్షి
లోక విజ్ఞానమునకును బ్రోక యనఁగ
బకృతి ముఖశాస్త్ర నిచయంబె ప్రబల సాక్షి.
కలిమి గాంచినావు కడుపెడు బిడ్డల
గాంచినావు గరిమ గాంచినావు
వీరమాతవగుచు, విఖ్యాతిఁగన్నారు
తక్కువేమి! నీకుఁ దల్లి! చెపుమ!

వం॥ కలములుఁ గాగితంబులును, గత్తులుఁ గ త్తెరులున్ సిరాలు, మేల్
వలువలు, నగ్గిపెట్టెలును, లా ంపులు, నూనెలు, సూదు లద్దముల్
పలకలు, బలపముల్, సరిగబంతులు, గొడ్గులు, నింకనేది కా
వలసిన నన దేశముల వారినె, వేడఁగనయ్యె! నయ యో!

# నా భారతము

("పైడి పాటి")

కృష్ణతాదాత్మ్య సంకీర్తనములె, విన్పు
నవగళమ్మున యమునా స్రవంతి
శివ జటాజూటమ్ముఁ జిందిచిందులు ద్రొక్కు
కవి పాపహరము గంగా స్రవంతి
వలగొన్న మున్నీటి పన్నిటి జలకేళి
నవకమ్ము మీఱు కన్యాకుమారి!
తెలిమంచుతో నచ్చు తెలివిభాసించు
నత్యున్నతము హిమాలయము

నీతి నియమంపుఁ బండు వెన్నెలలఁ గాచి
సత్ప్రభుండగు శ్రీరామచంద్రమూర్తి
గృహ గృహమ్మునఁ దానె శబ్దించు నెచట
శాంతి హితమ్ముగ, నట్టి భారతము నాది.

# జనయిత్రి

(మల్లాది రామచంద్రశాస్త్రి)

జయ జయ జయ భా
రత జనయిత్రీ !
జయ జయ దివ్య
జ్ఞాన ప్రదాత్రీ !
జయ జయ నిరుపమ
మహిమోపేతా !
జయ జయ జయ చిర
యశస్సమేతా ! ॥

అర్థ కామముల
నను శాసనమున
ధర బద్ధమొన
రించిన సుకృతి
పురుషార్థ నిరూ
పణ విబుధ జగ
త్ప్రా జ త గాంచిన
యశశ్చరిత్రీ ! ॥

## భారత జనని

అతులిత దివ్యా వేశ సంజనిత
విశ్వ శాంతి కాం క్షిత వచస్వినీ !
చతు రా శ్రమ వన విధాన ని
ర్ధేశిత పథ దర్శిని తప స్వినీ !

ఇహాపర సమచిం తనమున వ్య క్తి వి
కాస మరయు జ్ఞా న స్రోత స్విని ।
సమహిత చి త్త ము న లోకము ల
శ్రేయము గోరు మహా మన స్వినీ ! ।।



# జాతీయ జండా (పతాకము)

ప్రతి జాతియొక్క సంస్కృతికి అనుగుణ్యముగా, ప్రత్యేక జండా ఉంటుంది. ఆ జండాకెంతో పుట్టు పూర్వోత్తరములుంటవి.

లో లక్నో జా ీయ మహా సభా సమావేశములో 'హోమురూల్' ఉద్యమ పతాకము (డాక్టరు. అనిబిసెంటు ఉద్యమము) ప్రప్రథమముగా యెగురవేసినారు.

లో పంజాబు జలంధర్ వాసి, వయో వృద్ధుడు. లాలాహంస రాజు, మన జా ీయ పతాకముపై, రాట్న చిహ్నముండవలెనని చేసిన సూచనను పురస్కరించుకొని, గాంధీ బందరు ఆంధ్ర జా ీయ కళా శాల అధ్యాపకులు ( ) పింగళి వెంకయ్య పంతులుగారిని, నిరాడంబర త్రివర్ణ పతాకమును, సృష్టించుడని కోరగా, రాట్న చిహ్నముతోకూ న త్రివర్ణ పతాకమును, వెంకయ్యగారు 2 లో చిత్రించి యిచ్చిరి. అవి సత్యాగ్రహోద్యమ ప్రారంభదినములు. అందలి మూడు రంగులు, భారత జా ీయ సమైక్యమునకు, ఐకమత్యమునకు సంకేతములు, 'హిందువులయెడ, యెఱ్ఱనై, ఇస్లామునందు పచ్చనై, తదితరులందున ధవళమై వెలుగొందేది మన జండా'- దేశము యొక్క ఆర్థిక దాస విమోచనకు చిహ్నము రాట్నము.

2 మే 2 వ తేదీని, నాగపూరులో జండా సత్యాగ్రహము ప్రారంభమైనది. ఆ సందర్భమున, సేట్ జమునాలాల్ బజాజ్ గారి

రు. /- లు జరిమానా వేసి, దానిని బ్రిటిషు ప్రభుత్వము వసూలు చేయుటకై ఆయన మోటారుకారు వేలమునకు పెట్టగా, యెవరు పాట పాడలేదు. దానిని పురస్కరించుకొని ప్రతి రాష్ట్రంనుంచి, జండా సత్యాగ్రహులు వేలకొలది ఉద్యమము సాగించారు. చివర దశలో వల్లభభాయి పటేలు నాయకత్వం క్రింద అది అఖిల భారత జా ీయోద్యమముగా పరిణమించి, జయప్రదమైనది. దానితో జాతీయ జండాకు ప్రత్యేక గౌరవ ప్రతిపత్తులు, ప్రాముఖ్యత ల ించినవి.

లో సిక్కులు, జండా రంగులలో, తమ ప్రత్యేక రంగుకు స్థానంలేదని అలజడి లేవదీయగా, 1 జూన్‌లో, ఒక ఉప సంఘము ఏర్పడి యీ జండా రంగుల ప్రాముఖ్యమును, వేఱుగా నిరూపించుచూ ఒక నివేదిక అందజేసింది. దానిని అఖిల భారత జా ీయ మహాసభ అం ీకరించింది. దాని వివరము లివి;

అదివరకున్న రంగులు, మత సంబంధమైన సంకేతాలు కలిగి ఉన్నాయి. వాటికి బదులు, కుంకుమ పువ్వు రంగు శౌరా న్ని, తా గ లాన్ని, ప్రతిబింబింపచేయుచున్నదని, ఆకుపచ్చ రంగు అకుంఠిత భక్తి విశ్వాసాలనూ, శూరత్వాన్ని, (ఔదార్య భావాన్ని) చాటుచున్నదనీ, తెలుపు రంగు, శాంతి, సత ం, అహింసలకు ప్రత్యక్షనిదర్శనమనీ, మధ నున్న రాట్నము ప్రజా కముయొక్క స్వాతంత్ర్యాశయానికి చిహ్నముగాను, జెండా కొలత రెట్లు పొడవు, రెండు రెట్లు వెడల్పుండవలెనని నిర్ణయించిరి.

*రాజ్యాంగ పరిషత్తు ఆమోదించిన స్వాతంత్ర భారత జా య పతాకము:—*

పతాకములో పూర్వమునుంచి యున్నట్టి రంగులనట్లేయుంచి, మధ్యనున్న చర్ఖా స్థానమున (సాంచీ జయ స్థంభములోని) అశోకుని

ధర చ ్రం నిర్ధారణ చేయబడింది. తదాది నేటివర కిదియే, మన భారత జా య పతాకముగా నున్నది.

## ప్రత్యేకత

· ఆగస్టు వ దీని, భారత నారీమణి (్రమతి మేడమ్ కామా, జర లో, స్పట్ ఛార్జి నగరంలో జరిగిన అంతర్జాతీయ సోష లిస్టు కాన్ఫరెన్సులో, మన 'వందేమాతరం' జా య జండాను ప్ర ప్రథ మముగా ప్రదరి ంచిన యువతి.



# ఝండా గాయన్

(శ్యాంలాల్ గుప్త పార్షద్)

విజయీ విశ్వ తిరంగా ప్యారా
ఝండా ఊంచా రహే హమారా।। ।।ఝండా।।

సదా శక్తి బర్సానేవాలా
ప్రేమసుధా సర్సానేవాలా
వీరోంకో హర్షానే వాలా
మాతృ భూమికా తన మన సారా।। ।।ఝండా।।

స్వతంతతాకే- షణ రణమేం
లఖ్ కర్ బఢే జోశ్ క్షణ క్షణమేం
కాంపే శత్రు దేఖ్ కర్ మనమేం
మిటజావే భయ సంకట సారా ।।ఝండా।।

ఇస్ ఝండేకే నీచే నిర్భయ
లేం స్వరాజ్య యహ అవిచల నిశ్చయ
బోలో, భారతమాతా జయ్
స్వతంతతా హీ ధ్యేయ హమారా।। ।।ఝండా।।

ఇస్ శాన న జానే పావే
చాహే జాన భలే హీ జావే
విశ్వ విజయ కరకే దిఖలావే
తబ్ హోవే పణ పూర్ణ మారా।। ।।ఝండా।।



# జాతీయ జండా

(- సాంగ్‌రాగం బ్యాండ్‌స్వరం ఏకతాళం)

('గురజాడ' 1922)

ఇదియే జా ·య జండా।
జాతి। కిదియే ప్రాణము మాన ॥మిదియే॥

ఇదియే స్వరాజ్య ధ్వజము-నదుము ఫరంగీల హాజము।
కదనమునకు దీనిబట్టి-కదలు శాంతి ప్రతిన బట్టి ॥ఇదియే॥

దేశ దాస్యము బాపు-దీన దరిద్రత బాపు
దేశ ద్రోహులమాపు-దీన, ప్రతాపము చూపు ॥ఇదియే॥

మతము లన్నిటికి, స-మ్మతము దీని _ ద
హితముకూడ శాంతి-యుతముగ పోరాడ ॥ఇదియే॥

హిందువులం దెఱ్ఱనై-ఇస్లాము మతమందు
పొందుగ పచ్చనై, యా-నందమును గూర్చ ॥నిదియే॥

ధవళమై, యితర-మతమ్ములకై వెలుగు
అవిరళ భాగ్య భో-గ్యములనీయ గలుగు ॥నిదియే॥

కోట్ల ధనము జనము-కొట్టి పొట్టను బెట్టు
కాటకములనెట్టు-రాట్నము గలట్టి ॥దిదియే॥

భారత జా -య-వీర ర క్త మోడ్చి
చేరి నిరి ంచు-స్వ-రాజ్య సౌధము దాల్చు ।।నిదియే।।

భారతదేశము, స్వపరి-పాలన గలదని నము
నిరుపమానమైన ర్తి-నిండి వెలుగు నిజము ।।మిదియే।।

# జండా

(దామోజీ)

ఖండాంతరముల ఖ్యాతి గాంచి-జయము గూర్చెడి జండా।- ప్ర
చండమైన పరాయి పాలన-పార ద్రోలే ప్రజల యండా॥

హిందువులయెడ యెర్రనై-ఇస్లాము నందును పచ్చనై
జెందితర మతముల ధర మందున ధవళమై వెలిగేటి జండా ॥ఖండా॥

మెండుగా స్వేచ్ఛ నొసంగ-దండియైన రాట్న చక్రము
నిండుగా ధరియించినట్టి-నిరుపమాన జండా॥ ॥ఖండా॥

ఇంచుకైన హింసలేక-ఇలను పశుబల మింత లేక
సంచలింపక ధర రణమున-స్వరాజ్య మొసగు జండా ॥ఖండా॥

పొందుగా నాగాపురమున- కందరి నాహ్వానమంపి
వందలాదిగ చెఱకంపి- బందె భయము బాపిన జండా॥
ఖండాంతరముల ఖ్యాతిగాంచి॥



# స్వాతంత్ర్య పతాక

(సుంకర సత్యనారాయణ)

ఎగురవే వినువీధి-ఎగురవే జండా
శాంతి దూతగ నేడు-జాతీయ జండా
యుగ యుగంబుల జగతి నెగురవే జండా
సౌఖ్య ప్రదాతగా స్వాతంత్ర్య జండా॥

భారతీయుల మహా పోరాట ఫలితమా
వీరయోధుల రక్త ధారలకు చిహ్నమా
శాంతి మాత అశోక ధర్మచక్రము దాల్చి
శాంతి నిల స్థాపించ నరుదెంచితివి వు॥

పెను తుపానుల వెన్ని పెనవేసుకొన్న
దనుజులందరుగూడి, నినుదింపకున్న
కడ భారతీయుండు పడిపోవు దనుక
గగనాన ధ్రువ తార కరణి నిల్చెదవు ॥ఎగురవే॥



# జాతీయ పతాకోద్ధరణము

(శిష్టా వెంకటసుబ్బయ్య)

కం. జాతీయ పతాకోత్సవ
జాత కుతూహల సముద్ర సలిల తరంగ
వ్రాతోన్నత డోలావళి
నాతత గతి నూఁగు కంటె నధికముగలదే?

గీ. ఖండ ఖండాంతరంబులఁ గ్రాలుచుండు
మేలి టెక్కెంబు లందెల్ల మేటి యగుచు
భరతమాతకు మణి మయాభరణ మగుచు
దనరుగాత! జాతీయ పతాక యెపుడు.

సీ. అఖిల మతమ్ముల కైకమత్యముఁ గూర్చి
యింపు నింపుచు నుండు పతాక
అన్ని వర్ణంబుల కమరు గమ స్థాన
మేకమే యని చూపు నీ పతాక
భారత స్వాతంత్ర భాగ్యమంతయు దీన
నెస లారునని చూపు నీ పతాక
గాంధి దేవునిచేతఁ గ్రాలు సుదర్శన
మిద్దియే యని చూపు నీ పతాక

గీ. శత్రు రాజుల గుండియల్ ఝల్లుమనగ
దేశ దేశంబులందునఁ దేజరిల్లి
కాల గంగాధర ప్రభా భాసి యగుచు
నెగురు నా చంద్రతారమై యీ పతాక।

# జాతీయ జండా

మోహనరాగం ఆదితాళం 1930

("గురజాడ")

జండా! జయ జయ భారత-పూర్ణ స్వరాజ్య జండా॥
దండిగ ముప్పది-రెండుకోట్ల జను-
లండజేరి కొలు-వుండగ వెల్గెడి జండా॥

ముక్కోకల నారితేరినారు
చిక్కనీయ రరి కరముల వీరు
లెక్క-సేయ రరివర్గము విసరు
యుక్కు గుండ్లుకెద-నిత్తు రెదుర్తురు జండా॥

నిరంకుశత, ధిక్కరించి, వంచి
పరాధీనతా పాశము ద్రెంచి
బిరాన స్వేచ్ఛా-పథి చరించి
స్వరాజ్య మందిర-మలంకరించు జండా॥

ఆర్య సమ్మతము లైన సాహ సౌ
దార గుణము ల-హరిత వర్ణమై
స్థైర , శాంతి, స-త్యముల ధవళమై
ధైర్య త్యాగము-లకు కేసరియౌ జండా॥

పెను దారిద్ర్యము-బాపగ న
జనశరణ్య-వజ్రాయుధమైన
అనాదియై, కా-మధేనువై న
ఘన వర్ణిని, రాట్న లక్షి గల్గిన జండా॥

త్రివర్ణ యుతయై-త్రిభువన హితయై
దివిజస్తుతయై-తేజోయుతయై
భువిఁబవిత్రయై-ముక్తిదాత్రియై
కవిజన నుతయై కననగు జా ౦య జండా॥

సత్యాహింసా-సాధనములగొని
సత్యాగ్రహ కవ-చము, మెయిబూని
సత్యప్రేమ సుసరణుల శాంతిని
నిత్యము తిరముగ నిల్ప, నిల్తు, రని జండా॥

కాయము బుద్బుద-ప్రాయము, హేయము
ధ్యేయము మాకు సం, పూర్ణ స్వరాజ్యము
పాయని యశము-జగాన నింపెదము,
నీ యాజ్ఞల శిరసా వహించెదము జండా॥

జండా। జయ జయ భారత-పూర్ణ స్వరాజ్య జండా



# జాతీయ జండా

"గురజాడ"

జండా యెత్తర- జాతికి ముక్తిర
నిండగు శక్తిర-నిల్పర త్తిర... జండా యెత్తర॥

దండిగ వైరులు-గుండులు ప్రేల్చిన
చెండుచు, నెత్తురు-కండలు రాల్చిన... జండా॥

ప్రాణమొండె, య -మాన మొండె, మన
ప్రాణములైనన్-బలి యొసంగి, మన...

జండా యెత్తర! జాతికి ము త్తిర॥

—:o:—

# జాతీయ పతాకం

(గౌతమీకోకిల 'వేదుల')

పవిత్ర భారత సవిత్రి కోహో
స్వతంత్రోత్సవం సాగింది
లాల్ ల్లాపై అశోక చక్రపు
త్రివర్ణ కేతన మెగిరింది పవిత్ర॥

మతం తలవక గతం తడవక
ద్వేషం రోషం సకలం మరచి
స్వతంత్ర భారత జయ పతాకను
సోదరులారా! మొక్కండి పవిత్ర॥

నెత్తురు లోడ్చిన సత్తువ లూడ్చిన
పిశాచదాస్యం నశించిందని
ప్రపంచమంతా ప్రతిధ్వనింపగ
స్వతంత్ర శంఖాలూదండి పవిత్ర॥

పోరుల గ్రమందిన కారల కుందిన
స్వతంత్రయోధుల స్మరించుకొంటూ
ముదశ్రు తర్పణ హృదంబుజార్పణ
సోదరులారా! చేయండి పవిత్ర॥

అమోఘ శక్తుల సమీకరించుక
సమస్త భారత సమైక మెంచుక
హిమాద్రి మొదలు కుమారి వరకు
భారత విజయం పాడండి॥ పవిత్ర॥

( 7 ఆగష్టు రాత్రి 2 గంటలకు పేరూరులో చదివినది)

# భారత పతాకము

జయ జయ భారత జాతి పతాకమ
నిత్య విక్రై నెగడు పతాకమ జయ జయ॥

రంగ భేద మేర్పడుట తెలిసికొని-రంగులు కలిపెడి రాట్న పతాకమ
న్న లక్ష ముల ఖిన్న పడకుడని-ఏక లక్ష్యమేర్పరచు పతాకమ
కాయకష్టము-కష్ట సహిష్ణుత-తగునని తెల్పు-యీ ధర్మపతాకమ
సర్వ ప్రాణులను_సమముగ జూచెడి-శాంతి సమరమున సాగు పతాకమ
సత్యమహింసా స్వాతంత్ర ంబుల సారరూపమగు శాంతి పతాకమ
భార యులకు-ప్రాణాధారమౌ-ఖాదీ పతాకమ కాంగ్రెసు పతాకమ
జయ జయ॥



# జాతీయపతాకము

"బసవరాజు"

పతాకోత్సవము సేయండీ
స్వతంత్ర భారత-జాతి చిహ్నమౌ॥ పతాకోత్సవము సేయం ॥

కొత్త వన్నెలూ-కొత్త చిన్నెలూ
కొత్తజీవమూ-కొమరొప్పంగా
నూతన భారత-జాతికి భువిలో
ఖ్యాతి విజయము-కలగాలంటూ॥ పతాకోత్సవము॥

వీరకేసరుల యెఱ్ఱని రంగూ-దేశ సేవకుల తెల్లని రంగు
భక్తుల పాలిటి పచ్చని రంగూ- దలపాలిటి రాట్నము మెరసే॥
పతాకోత్సవము॥

అన్ని మతాలకు-అన్ని తెగలకు-ఆశ్రయ మీజండా ఒకటేనోయ్
ప్రాణము పోతే పోనీ జండా-మానము మాత్రము మంట గలపక॥

పతాకోత్సవము సేయండీ॥



# జాతీయపతాకము

("గురజాడ")

మ. అదె ఢిల్లీ పుర కోటలో నడుమ, సౌధాగ్రంబునన్ స్వేచ్ఛయై
కదలెన్ దివ్య సుదర్శనంబనగ, చక్రం బొందు బాసిల్లన
య్యదె, జాతీయ పతాక యెల్లరున్, జోహారుల్ సమర్పింపగా
సుదినం బియ్యది, చేరరండు, తరియించున్ జన్మ నాటితో,

—:o:—

# జండా

("గురజాడ")

చే యెగురవేయరా–జాతీయ జండా
హాయిగా స్వాతంత్ర్య–వాయువు లోన।

దీనికై గద మహా–ధీరులు వీరులు
ప్రాణ ధనము లు–బలి ఇచ్చినారు యెగుర।।

స్వాతంత్ర్య జాతి కిది–చక్కని వెలుగు
జాతిపేరు జగాన–స్థాపింప గలుగు చేయెగుర।।

దీనికై గద దేశ–దేశముల బోరి
మానము నిల్పి, సరి–మానవులైరి చేయెగుర॥

దండి యశోకుని–ధర చక్రాన
నిండుగా వెల్గేటి–నీ జాతి జండా చేయెగుర వేయరా॥

## నమస్తే! హైందవ పతాకమా!

నమస్తే! హైందవ పతాకమా! సుశ్లోకమా ।నమస్తే।
సమస్త లోక శాంతి సతత సధర సంస్థాపకమా ॥ నమస్తే॥
ఆనంద దాయినీ-ఆకాశ విహారిణీ ॥ నమస్తే॥
దీన జనోద్ధారిణీ। పరపాలన నిరూ లినీ ॥ నమస్తే॥
భారత మహా ప్రతాప-త్రైవర్ణ స్వరూపిణీ॥ నమస్తే। హైందవ
పతాకమా॥

## దేశీయపతాకంబిదె! పురవాసులార!

దేశీయ పతాకంబిదె పురవాసులారా! గాంధీ పతాకంబిదె॥
పురవాసులారా!
హిందూ మహమ్మదీయ సిక్ క్రైస్తు జైన బౌద్ధ మతముల చిహ్నం
బిదె పురవాసులారా!
దాను నెహ్రూ రాయి ఆ సోదరులచే పూజలొందెనుగా యీ ధ్వజము
॥పూజలొందెనుగా॥
జగమున నిప్పుడున్న జనులలో శ్రేష్ఠుడైన-గాంధీ మహాత్మునిచే
స్థాపితంబు॥ దేశీయ॥
పనులెల్ల గట్టిపెట్టి చనుదెండు దేశభక్తి-మనమున నుంచివేగా-
పురవాసులారా ॥దేశీయ॥

జా ీయ జండా

## జండా! నవభారతవీర కుమారవందిత॥

జండా! నవభారత వీర కుమార వందిత। జండా॥

ఖండిత వైరి నికర ప్రియకర-అఖండ ఖండనా శశాంక మండనా

జండా॥

పావన స్వేచ్ఛా ప్రవిమలపద సం-చారిణీ, తారిణీ, ఆర్త విదారిణీ

జండా॥

తరుణ భారత అరుణరాగోజ్జ్వల-ఐక భరణా శాంత వితరణా జండా॥

జయ జయ భారత భాగ్య పతాకా జయహే దివ్య నవోదయ రేఖా

జండా॥

—)(—

# జయ ధ్వజం

(వానమామలై వరదాచార్యులు)

అదిగో మన జయధ్వజం అదుగదుగో భద్రగజం
నదించునదౌ జయహిందని నవయువ సోదర వ్రజం॥

పొందీ ఎత్తండి సురల్ పూలుగురియ జయధ్వజం
దండోరావేయ నదో తరలుచుండె భద్రగజం॥

ఇదియే మన జయధ్వజం ఇది మన యాత్రల తేజం
ఇదియే మన జాతి నిజం ఇది భారత సురభూజం॥

భారతీయ సమైక్యతకు మారురూప మీధ్వజము
నూరుకోట్ల కరములొకటిగా రూపొందిన భుజము।

నలుబదారుకోట్ల ప్రజల నగవుపూల నౌల్కవోయు
పలుమతాల మన స్వేచ్ఛా-భావ పటము నెగురవేయు॥

సౌభాగ్యవ స్వేచ్ఛా జననీ హృదయ సరోజము
(శ్రీ)భారత జనయిత్రీ రక్షకుట మణిస్రజము॥

ఆ ధ్వజమును తమి గాంచుడు-అతి భక్తిని తలవంచుడు
ప్రాంజలినిడి తనుధన హృత్ప్రాణము లర్పించుడు॥

అదె మన తలపై తురాయి-అద్దె జాతికి వగయి
ఆచంద్రార్కము దానికె-యంకిత మీ జాతికుట్టు॥

అదిగో మన జయధ్వజం॥

—o—

# జాతీయ జండా

("గురజాడ")

విహరింపనిమా ! —విహరింపనిమా !

స్వాతంత్ర్య విను వీధి–జా యజండా॥విహరింపనిమా ॥

విశ్వవిఖా తిగా–విజయ నాదాలతో
విశ్వమోహనముగా–వెలసిన జండా
వీర భారత జాతి–వెలిగిన జండా॥ విహరింపనిమా ॥

మూడు రంగులతోడి–ముచ్చటగూడి
తోడు నీడయి ధర్మ–చక్రమ్ము గూడి
డించు నీయండ–ప్రియమైన జండా॥విహరింపనిమా ॥

వీరుల రక్తము –ధారవోసి, యరి
వీరులనోడించి–పేర్గొన్న జండా
భారత వీరుల–జా ౹య జండా॥ విహరింపనిమా ॥

సాహస త్యాగాలు–శాంతి సత్యాలు
ఆత విశ్వాసాలు–ఔదార భావాలు
చక్కగా పాలించు–జా య జండా॥ విహరింపనిమా ॥

సేతు తాచల–స్థిర భరత జాతి
ఖా తినిల్పిన యట్టి–జా య జండా
స్వాతంత భారత–జా య జండా॥ విహరింపనిమా ॥



# జాతీయ జండా

("గురజాడ")

ఆడనీరా! యెగిరి-ఆడనీరా! విప్పి
హాయిగా, భారత-జాతీయ జండా॥ ఆడనీరా।

మబ్బు మసకలేని-మంచి మార్గాన
తబ్బిబ్బులేని, స్వాతంత్ర్య పీఠాన॥ ఆడనీరా॥

పరజాతి చేతి, లోపల జిక్కి నలిగె
మరల విచ్చలవిడి-మసలగా, గలిగె॥ ఆడనీరా॥

వీరాధి వీరుల-వేడి నెత్తురులపై
విజయ స్తంభాలపై-వెలసిన జండా॥ ఆడనీరా॥

ధర చక్రముతోడ-ధైర్యంపు నీడ
తా త్రివర్ణంబయి-తాండవించే జండా॥ ఆడనీరా॥

సాహస త్యాగాలు-శాంతి సత్యాలు
ఆత్మ విశ్వాసాలు—ఔదార్య భావాలు॥ ఆడనీరా॥

ఈడుగా, జోడుగా-తోడిదేశాలలో
కూడి ముచ్చటలతో-క్రీడించు జండా॥ ఆడనీరా॥

సేతు సీతాచల-స్థిర భరత జాతి
ఖ్యాతి నిల్పిన మన-జాతీయ జండా॥ ఆడనీరా॥

...)(...

# స్వరాజ్యజండా

(శృంగవరపు శ్రీనివాసాచార్యులు)

ఎత్తండి స్వరాజ్య జండా। జండా
నెత్తండి ధైర్యము నిండ। నింక
స్వరాజ్య జయమును। సంధింతుమనుచును॥ ఎత్తండి॥

మూడు రంగుల జండ-ముద్దులొల్కెడి జండ
మునుకొని మనమున-యుండ-దాని
విడచిన మనకేది యండ—వట్టి
యెండమావులె చెంతనుండ-కుక్షి
నిండునె నద్దాని నిండ-గాన
తిం కి తలదాచి యుండుటకై యిక॥ ఎత్తండి॥

జాతి భేదములెంచి-యైకమత్యము వీడి
నీతి బాహ్యము బొందకండి। శుష్క-
వాదముతో నుండకండి। సంఘ
భేదముల నెంచకండి। గాంధి
యాదర్శముల నెంచి। యేకభావముగాంచి॥ ఎత్తండి॥

ఉప్పుపై పెనుదాడి-యొప్పుగ గాలించి
విప్లవ మొనరించినాడు। గాంధి

కప్పము లరికట్టినాడు। ఖద్ద
రొప్పుగ కట్టమన్నాడు త్రాగు
డొప్పమి మానుమన్నాడు। రాట్న
మెప్పుడు త్రిప్పమన్నాడు। తాను
చెప్పిన చొప్పున, తప్పకు మీరంత॥ ఎత్తండి॥

చల్లని మావాడ-పల్లి వెంకటేశు
కళ్యాణ సమయమ్మునందు-లాఠీ
ఫెళ్ళున మరి బస్సులందు-బహు
కల్లరి పోసులందు-మరి
అల్లరిగావించి యందు-పంచ
ముల్లార రండని-మూర్ఖత జూపిరి॥ ఎత్తం ॥

లా ఆర్డరంచును లాణీ భేణీ వేసి
లాటీలతో తిరిగినారు। పట్టి
బూటకముల బన్నినారు। యుద్ధ
నాటకములు జూపినారు। జనుల
తూటాలతో గాల్చినారు। యంత
నిరాయుధుల బట్టి-నెట్టిరి-కొట్టిరి॥ ఎత్తండి స్వరాజ జండా॥

···)o(···

# తిలక్ నిర్యాణము

# లోకమాన్య బాలగంగాధర తిలక్ నిర్యాణము

(జంధ్యాల శివన్నశాస్త్రి)

సీ. భారతోద్ధరణ సంభావితునకు రాజ
తంత్రమె తారక మంత్రమయె
దేశ ధర్మోప సందేశికునకు, చెఱ
సాలయె, ప్రాసాదశాలయయె
మాతృశోకోత్పాట నాతి దీక్షునకు, క
ష్టాప్తియే, ఘనశుభావాప్తియయె
స్వార్థతాదూర విశాల మతికి, ప్రపం
చంబె, యాత్మీయ కుటుంబమయె

గీ. ఆ మహాత్ము డు తిలకోప నామకుండు
బాల గంగాధరుండు, కృపాలయుండు
అవని నా బాల గోపాల మంగళార్పు
పాలుగాగదా. స్వారాజ్య మేల జనియె.

సీ. వితత మాయాదుర్గ భేదనంబునకు నీ
ప్రాజ్ఞుని బుద్ధి ఫిరంగి గుండు

గుణలుబ్ధ హైందవ కోటుల కెవని నా
మము, త్ర్యక్షరమగు మంత్ర రాజ
మాత సమున్నతి యాధార మలె వాని
కుగ్గుతో బెట్టిన యురుగుణములు
చాతుర్యమతులైన సామ్రాజ్య పతుల
యనఘు సాహసము, భయావహము

సకల జన మిత్రుడును, కర్మసా , లోక
బాంధవుడు, జగచ్చక్షువు, పరమదుఃఖ
నిరత నిరగ్న ధరణి సంతరణ తరణి
యైన తిలక ప్రభాకరు డస్తమించె॥

సీ. నిఖిలలోకాభి వందిత పాదుడైన పా
కారి మంత్రిత్వము గోరినావ।
దేవతాగురు పదస్థిత బృహస్పతి తోడ
ధర వాదము సేయదలచినావ।
సనకాది దేవతా సంయమీం దులకు గీ
తారహస్యము దెల్ప దరలినావ
వు నాటిన మొక్క నిలుపుట కమృతము
నార్జింప దివమున కరిగినావ।

స్వర్గమున కన్న గొప్పది జన భూమి
యనెడు నీవు స్వరాజ్య లక్ష్మి ని ద్యజించి
యల్ల స్వారాజ్యమేలంగ నరిగి తేని
యనుచితంబంచు జెప్ప సాహసము దాల్తు॥

తిలక్ నిర్యాణము

ఉ. దేశహితైషులార! సముదీరిత కర్మధురీణులార! యా
వేశము మీఱ, శ్రీ తిలక ధీరుఁడు, నాటిన కర్మ వృక్షమున్
బేశల మూలమున్గునయ విస్తృత వాతమునుండి కాచుచున్
నాశములేని శాంతిని దొనర్చుడి యాతని యంతరాత కున్॥

(తిలక్ నిర్యాణ దినము 3 — — 2 వానపాముల.)

# లోకమాన్య బాలగంగాధర తిలక్ నిర్యాణము

("జగన్నాథదాసు")

"చింతిలకమా !- మన (శ్రీ)రాముని కొరకు మదిని" వలె-

పల్లవి. శోకింపకుమా। జననీ! మా సోదరుడు, మహాతు డుండ॥
శోకింపకుమా। జననీ॥

లోకమాన్య నిర్యాణము-లోపము మదితలపకమా !
ప్రాకటముగ నతడిపుడీ-లోకమంత నిండియుండె
॥శోకింపకుమా॥

హిందు జనులు పందలనుచు-డెందమునను గుంద ల।
ముందు శుభములొసగుట, కా-నందమూర్తి గాంధి గలుగ
॥శోకింపకుమా! జననీ॥



# శాంతి పొందుమా లోకమాన్య

శాంతి పొందుమా! మహారాజ! ఆత్మ శాంతిపొందుమా!
దేహ మనిత్యమని-దేశము కొరకయి
బాములు పడిన-బాల గంగాధరుని! ఆత్మ ॥శాంతిపొందుమా॥

కారాగృహములు-కైలాసముగ గడపి
గీతా రహస్యము తెలిపి-కీర్తిగాంచినమూర్తి ఆత్మ ॥శాంతి॥

చరమదశయనక-జనుల బ్రోచుకొరకు
జని బ్రిటీషు తావులందు-జయముగన్న తండ్రి ఆత్మ ॥శాంతి॥

నీదు తేజము నిలుప దలచి నాడు
గాంధి కర్పణజేసి-కాయము బాసిన ఆత్మ ॥ శాంతి పొందుమా,

మహారాజ! ఆత్మ । శాంతి పొందుమా।

# పాంచాల కేసరి

("కావి పాదుషా" పువ్వాడ శేషగిరిరావు)

'లా దెబ్బల పోటులన్ మడిసితే లాలాజి! నీ' వంచు నా
రాటంబున్ బడు తల్లి జాడఁ గనుగో రారాపులై అంపపున్
గాటంపుం దెగకోఁతలై హృదయమున్ గాటించు, సామ్రాజ్యమున్
గోటన్ మీటఁగ జాలు శక్తియుతునిన్ గోల్పోతె! పాంచాలికా!

ధూమ శకటాన సైమను దొరకు నెదుట
నల్లసిడములఁ గొని మును నడచి నిలుచు
లజపతి యురమ్ము బడితె వర్షమ్ము పట్టెఁ
దోడి పంచాననము లు తూఁగి యూఁగ॥

పోటు మొనగాండు దొరలపై బొడిచి నడవ
శాంతమూర్తి లజపతి కండ్లు సాఁచి యూఁచి
వలదు వలదంచు కనుసన్న మలఁచె బ ర!
జ్ఞానమున్న యెదిరికి లజ్జాకరము!

వనిత పాంచాలి కట్టు వల్వలను నూడ్వ
మన గదాప్రహార మాఁపిన దదేది?

మ నేత్రాంత బడబాగ్ని ధూమ పరివృ
తోజ్జ్వల జ్వాల లార్పిన యుదధి యేది?

ధర జుని కండ్లతుదల శాంతమ్మె! కాని
యెవరివో యెప్పటి వాగఁ బ్రాఁతవడె మనకుఁ
గ్రొత్త పఱచి లాలాజి మెఱుంగు వెట్టె
జ్ఞానమున్న యెదిరికి లజ్జాకరము!

పాంచాల వీరులు పదను వెట్టిన కత్తి, మొనలెల్లఁ దళతళ మనియెనేని!
పాంచాల కేసరుల్ పనివడి తమ కోర, మీసాల నొకచుట్టు మెలిపిరేని!
పాంచాలయోధ సంప్రార్థన వు కన్, బొమ లూఁచు పుణ్యాన బోయితేని!
పాంచాల హరిరాజి పాథోధి యలవోలె, నడతెంచి యొకమారు కడిగెనేని!

ఆంగలేయాళి కాదు దిగంత దంతు
లైనఁ బాంచాల సింహాల నాఁపగలవె!
మోటు లాటీల నీ ఱొము మోఁదినపుడు
శాంత మూనితిగాని పాంచాల సింహా!

# పాంచాలము

ముఖారిరాగం

("గరిమెళ్ల")

పల్లవి. కంట గుడ్డను బెట్టి-కర్ణాన వేలెట్టి-వింటావటర! ఓరయా!
ముండ! రింటిలో జరిగిన చర్య ॥కంట॥

మొన్న మొన్ననెసుము -మూడు సం ద్దాల్టాటి-వారు
శతుల గెలిచొచ్చినారు-పాం-చాల దేశములోని వారు
సత్యాగ్రహమని-సర్వేశు బూజింప-కత్తితో, తెగ నరికినారు-
అయ్యో! కటిక దెందపు తెల్లవారు ॥కంట॥

బడి పిల్లల నెల్ల-పది క్రోసులగు దవ్వ-పరుగె త్తమనిచెప్పినారు
పరవకున్నను బాదినారు-అగ్గి గుళ్ళకు బెట్టి-అదనకు వెయి
మంది-అశువులనిట్టె యూర్చేరు-వారి-యుసురులనెట్టు లోర్చారో ॥కంట॥

కట్టుగుడ్డల విప్పి-కచబంధముల రొప్పి-ఇట్టట్టులుగ జేసినారు-
మన-చిట్టి కన్నెలను-సరకారు...
ఇట్టు లెందుకు జేసిరనుచును-గట్టిగ నిది తగదటంచును
పట్టి యడిగిన పెదవులను-ని-ట్టట్టు మెదపగ యూరకొనిరట॥కంట॥

వారుచేసిన యట్టి-వరుసల వర్ణింప-నోరేమినాకు నాడదుర-
మన-గౌరవంబే కూల్చి రౌర।
బారిషరుల నోళ్ళబట్టి-యుచ్చలుపోసి, నీరజముఖుల-వ-న్నెల
బయ్యట
లుదీసి దారిపోయెడి వారినెల్లను-నోరగిలి-కడుపులను బ్రాకగ
ధీరులను తమ కేతనము -దెసకు దండము పెట్టజేసిరి ॥కంట॥

వింతలలో వింత వినరా! దీని-మంతన మందుంచుకొనరా
పంతముతో మన-పెద్ద లెల్లరు గూడి-పార్లమెంటునుజేరి-
పదముల బడివేడ। మాంసభుక్కులు-పాంశు చరితులు-
ధ్వంస నిశ్చయులైనవారు- ప్రశంసించి వారల నెల్లరను మ-
న్నించి, మనలను డించిరంట ॥కంట॥

అట్టి వారలతోడ-మనకు-ముం-దెట్టి సంబంధమెందులకు-
కత్తి బలము నణచె ననుచును-చిత్తవృత్తియె గొప్పదనుచును-
మత్తు లెల్లను పీడుదనుచును-మొత్తు వారముగా మటంచును
చెప్పరా।-నీ కన్నులిటపై -విప్పురా! ఆ ప్రభుత నింతట-
తిప్పరా! లేకున్న-నీకగు ముప్పురా! మాయప్ప యిప్పుడు
॥కంట॥

దేవుడిట్టులను చెప్పేడు-నీవు-దీనిని బాగుగ నెంచి చూడు-
భావుకజ్ఞులు-పండితాఢ్యులు-వేవిధంబుల దేశభక్తులు
అవురావురు మనుచు నేడ్చెడి-అమ్మ మొరల సహింపనేరక
పట్టితిరి ఘన దీక్ష-వారికి-నెట్టి సాయము చేయమని-
వి-న్నట్టు వేడిరి, యింక జాలము-కాట్టివేగముట్ట సాయము॥
కంట గుడ్డనుబెట్టి-కర్ణానవేలెట్టి వింటా వటర। వోరయ్యా।



# హిందు మాతానురా

"రాముభార్యానురా ! రావణవినుర" వలె

(కొండపల్లి జగన్నాథదాసు)

పల్లవి॥ హిందుమాతానురా। దయ్యరు। వినర లోకమాతానురా।
హీనుడ। వినుర! దేశమాతానురా॥

నా డబ్బు తిని నీవు-నా బిడ్డలను జంప
చేతులెట్లాడెర! నీతి లేనివాడ ॥హిందు॥

దయ్యరసురుడ నీవు-దయ యెట్లు కలుగును
దనుజ భావమెనీకు-ధర మాయెనటర ॥హిందు॥

పంజాబు బిడ్డలను—పలువధల గావించి
బ్రతుక దలిచితివటర!-బ్రహ్మకల్పముదాక ॥హిందు॥

మానవతుల కయ్యో!-మాన భంగముజేసి
మానహీనుడ వగుచు-మనియెదవెన్నాళ్ళు ॥హిందు॥

గాంధి కొమరుఁడు, నన్ను-గావగ బుట్టెను
నా ఋణము దీర్చెదు—నా తండ్రి యతడేరా ॥హిందుమాతానురా॥



# కనుల నీరు కారునుగా

(- హిoగ్ రాగం చాపుతాళం)

పల్లవి॥ కనుల నీరు కారునుగా—కరుణలేక, యా—డయ్యరో నర్చిన
వధ వినిన ॥కనుల॥

రావణు మించిన- క్రూర రాక్షసుడు
రాణి వాసములు చెరచెనుగా
మానభంగ మొనర్చియు న్యానపరిచి-మనుజుల లెక్క—గొనడు
కదా ॥కనుల॥

జలియన్‌వాలా బాగున చచ్చిన-జనము లెక్క—లేదుకదా।
అబలలు బాలకులెంద ఱీల్గిరో-అసలే తెలియదుగా ॥కనుల॥

మిడి మిడి యెండకు-కడువడి నడుడని
బడి పిల్లల తెగ-బాదెనుగా।
ఒళ్ళు తెలియకే-యెన్నో చేసెను-
కళ్ళు గానకే తులువ ॥కనుల నీరు కారునుగా॥



# రక్తాభిషేకము

("జలియన్‌వాలాబాగ్" ?)

సీ. మల మల మాడ్చు, నుమ లి కంపు దెండలో
పసి కూనలను నిల్వబెంచినారు।
గుఱ్ఱాల దోలు పెన్‌గొరడాల దయమాని
ముద్దు కుఱ్ఱల జావమోదినారు।
ఘోరాలకోటి పౌన్నూరు బోయినను, బ
ట్టించి కందులను బంధించినారు।
ర్వాలేమింక మొఱ్ఱోయంచు వినక, ర
క్తా షేకమునంది యలరినారు॥

గీ॥ శ_ నంతయు జూపి, పంజాబునందు
నిండియా దొరతనము వారింక మీరు
గొడ్డువారుగాక, యనుంగు బిడ్డలున్న
మాన్పరారె సోదర్యావమాన భరము
పుణ గుణులార। భరత పుత్రులార॥

సీ॥ నిదురవో మీ ప్రక్క నొదిగిన మగల, మీ
రేల యావలకు బోనిచ్చినారు
మీ రై కలను చించి-పారవై చి పో సు
గమి ప ·క్షించు, 'వశము 'లగుచు

ముసుగులు బలవంతముగ నూడదీసి, మా
తోరారె। గమ రనూర, ననుచు
కౌలుదోయిని కాళ్ళ ిందగా జొప్పించి
చెవులు పట్టుకొనుండి యువిదలనుచు

గీ॥ పశుబలము జూపి, యవమాన పరచినారు
చలము వహియించి 'దొరలు' పంజాబు సతుల
మాన్పరారె! మీకింతేని మానమున్న
అక్క సెల్లెండ్ర నెవ్వగ నన్న లార॥

సీ॥ ఆడుగంటెనె స్వరాజ మ్ము బతిష్ఠించిన
ఘన శివా నాటి కార్య దీక్ష
గ్రమగ్గనే! కంపినీ మదమడంచిన హైద
రాలి సాహెబు మహానంద దీప్తి
బెదరెనే! వైరినొంచిన మహా టిప్పుసు
ల్తాను నాటి యఖండ ధైర పటిమ
పారదే। మా శ రారామసీమ, నా
నా సాహెబు మనః పణాద శ ్।

॥ చెడెనె! ఝాన్సీ మహాలక్షి లమహిమ
లేశమేని మగంటిమి లేదె మీకు
చెదర యభాగ్య పిశాచి నదమరయ
శూరవరులార! భారత సూనులార॥

# పాంచాలి

("గురజాడ")

డైయరు రాక్షసుండటు హడావిడిగా చనుదెంచి, నోటి న్
గూయగరాని, పెన్ మొఱటు కూతలఁ గూయుచు, మాన
హీనమున్
జేయగ సాహసించె, నవినీతుల నూరక నింక స్త్రైపఁగా
నా యమె? శక్తిగల్గిన యనాథుఁడమే! యిటు మిన్నకుండగన్.

ఒక పాంచాలిఁ బరాభవించుటను గాదో! మూల మట్టము గా
బెకలింపంబడెఁ గౌరవాన్వయ మిలన్ బేరైనలేకే, వినా
శకమున్గా కెటులుండు నక్కట! దురాశా దుర దాహం కృతిన్
బ్రకటింపన్ వెనుదీయ నేరని ప్రభుత్వక్రూర దుష్కృత ముల్.

లంకన్ బుట్టినవారు, రాక్షసులుగారా యన్నటుల్ పుట్టి, ని
శ్శంకన్, దేశము దోచు, నీ ధనపిశాచా గస్తులా, వీరి కే
వంకన్, మాటల, నచ్చ చెప్పినను, లాభం బున్నె? వీరల్ వెసన్
జంకున్, గొంకును, లేక, యిల్వెడల, యత్నం బాచరింపందగున్.

ముక్కోణములపైన, నెక్కించి, బాలుర
బెత్తాల గొట్టి, చంపిన ఫలము

మల మల యెండలో, నిలబెట్టి, క్రమ్మదిన
నోరు వాయియులేని, వారి యుసురు
పోటు మానిసులను, లాటీల మోదుచు
పొట్టలం బ్రాంచు, నట్టి జులుము
పర పురుషుల, కంటబడనట్టి, మాన వ
తుల, నవమానించు, దుర దంబు
లూరకేపోవు దయ్యమై, యూరు - రు
నిల్వకయె వంశమెల్ల, గదల్పకింక
నే మహాసతి పున్నెమ్మొ! యింతవరకు
బ్రతికి నిలచిరి, వీరు భూభారమైన॥

ఈ దుశ్శాసనుం దురాత్మకుండు, మా యిల్లూరంగా వచ్చె, మ
రా దల్ నేరని దుర్మదాంధులిటు, న్యాయాన్యాయముల్ గాంచు నో
క్కా! దుర్భాషలం దూలనాడి, మిమ్ములన్ క్రూరముగా వర్తిలన్
-దే! మా కిక దిక్కు నీవగద! తల్లీ! దుర్గ! కాత్యాయనీ!

క్రమతన్ మా మగవార లొక్కరుగా, గ్రామాంతరంబందుం గా
ర్యములన్ మున్గి భరించువేళ, పటు ధైర్యస్థైర్యులై, వే పరా
క్రమమున్ జూపంగ సాహసించిరిక ధర ంభేదో యోజింపు! మా
నము గోల్పోయిన, ప్రాణమేటికిక, యెన్నాళ్ళ ప్రజాపీడనల్.

'దయ' రైనను, మరివాని యయ్యయైన
'యెడయ' రైనను, మరి వాని యొడయం డైన
సిగ్గువిడి చేసినట్టి దుష్కృతఫలము
లనుభవింపక, యున్నె! నాయాన, తల్లి!

'ఏలా యిల్లలుకంగ, పండుగగునోయీ! తి నీకేల! పాం
చాలీ దుస్సహాశోక బాష్పకణ సంజాతాగ్నిలోనన్, మహాం
కాళుల్ రుద్రులు నుద్భవించెదరు లక్షల్ కోట్లు వేవేగ, పా
శాలన్ ద్రుంచి, స్వరాజ్యమున్ గొనెద,రిచ్ఛావర్తులైయందఱున్



## మహాత్ముని ప్రియమైన ప్రార్థన గీతములు

వైష్ణవ జనతో తేనే కహియే-జే పీడ పరాయీ జాణేరే,
పరదుఃఖే ఉపకార కరే తోయే మన అభిమాన న ఆణేరే॥

సకల లోకమా సహునే వందే నిందా న కరే కేనీరే,
వాచ కాఛ మన నిశ్చల రాఖే ధనధన జననీ తేనీరే ॥వైష్ణవ॥
సమ దృష్టినే తృష్ణా త్యాగీ పరస్త్రీ జేనే మాతరే
జిహ్వా థ అసత్య న బోలే పరధన నవఝాలే హాథరే॥వైష్ణవ॥
మోహ మాయా వ్యాపే నహి జేనే దృఢవైరాగ జేనా మనమారే
రామనామసూఁ తాలీలాగీ-సకల తీరథ తేనా తనమాఁరే॥వైష్ణవ॥
వణలోభే నే కపటరహితఛే-కామ క్రోధ న వార్యారే,
భ నరసైయో తేనుం దర్శన కరతా కుల ఏకోతేరతారా రే॥
వైష్ణవ జనతో తేనేకహియే॥



రఘుపతి రాఘవ రాజారామ్-పతిత పావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరేనామ్-సబ్‌కోసన తి దే భగవాన్॥

॥రఘుపతిరాఘవ॥

—)(—

# అతడే వైష్ణవుడు

ధన్యాసిరాగం-ఆదితాళం

("దామోదర్")

ఇతరుల కష్టము లెవ్వండెఱుగునో। అతడే వైష్ణవుడు
సతతము పరులకు సాయము చేయుచు
గతి తానే యని-గరువము పడదో ॥అతడే॥

సకల లోకముల-సన్నుతి జేయును
అపనిందలచే-యపచారము చేయడో ॥అత॥

మనసున వాక్కున-నిశ్చలు డెవ్వడో। యోగు రాలాతని
కన్న జననియె॥
సర్వము సమముగ-నెవ్వండెంచునో-ఆశవీడి పరస్త్రీ-
మాతగ జూచునో॥
నాలుక లిన-అసత్యము పల్కడో
పరధనములకై పాకులాడడో ॥అత॥

మోహము మాయయు-మనమున నుండవా
దృఢవైరాగ్య ము- ధ్రువముగ కుదురునా
రామనామమున- నుడై పోవునో-రాజిలు వానిలో
సకల క్షేత్రములు ॥అతడే॥

కపట లోభములు-కదలిచి కామ- క్రోధశత్రుల నారిట గెల్చునా
సఫలము జన ము-సర్వజనులకా-స్వామి సందర నా-నందముచే
॥అతడే॥

వైష్ణవ గేయము :

# వాడే వైష్ణవుడు

నరసిమోహతా-"వైష్ణవజనతో" అను గుజరా కీర్తన కనువాదము

(తుమ్మల సీతారామమూర్తి)

వాఁడే వైష్ణవుఁడని పలుకందగు, వాడే వలయును జగమునకు
ఇతర  వులను బాధించెడు వెత, వెఱిఁగి జాలి పడువాఁడెవఁడో
ఒరుల దుఃఖములఁ దీర్చిన పిమ ట, గరువము నందనివాఁడెవఁడో
అణఁకువతోఁ బ్రజ కంజలి సేయుచు, నన్యుల దూరని వాఁడెవఁడో
తలఁపు పల్కు పని యొకటై తల్లికి, ధన త గూర్చిన వాఁడెవఁడో
సమత నంది యాశలు విడి పరసతి, జననిగ నెంచిన వాఁడెవఁడో
దబ్బఱ లాడక లాఁతివారిసిరి తాఁకక నిల్చిన వాఁడెవఁడో
మాయా మోహము లణఁగి విరాగము మదిలో నిండిన వాఁడెవఁడో
తెలిసి రాము పేర్వ్వని విని తనువే  ర్థము చేసిన వాఁడెవఁడో
కపటము లోభము కామము క్రోధము కడచి మెలంగెడి వాఁడెవఁడో
కన్నవారి తరతరముల పాపము కాల్చివేయఁగల వాఁడెవఁడో
మేలు! మేలు! నేబా! సని నరసీ మెహతా మెచ్చిన వాఁడెవఁడో

వాడే వైష్ణవుఁడని......

...)(...

# వైష్ణవు డెవండు?

"గురజాడ"

చాటి చెప్పెద వినుము, వైష్ణవుడెవండో
ఒరుల బాధ లెఱుంగు-యోగ్యుండతండు,
పరుల కష్టములందు, తోడ్పడుచు, స్వాభి
మానమున్ ప్రగల్భమ్ములు-లేనివాడు;
నిందసేయడె వారిని-వందనమ్మొ
సఁగు, తల్లివలెన్ ప్రపంచము దెలిసి
తృష్ణ త్యజియించుచున్ సమదృష్టి కలిగి
పొందెడిన్ మనోవాక్కా-యముల ప్రశాంతి
పరసతుల మాతృ భావన నరయువాడు
జిహ్వ నెన్న డసత్యము -జేరనీడు
పరధనము లకై యాస-పడనివాడు
వ్యాప్తి నొందదు మనము-మోహము , మాయ
, నెపుడు, దృఢవైరాగ్య ముండతడు,
రామనామ రసామృతార్ణవ, నిమగ్నుఁ
డతని తనువెల్ల, సకల తీర్థాలయము
కాముమున్ క్రోధ మోహముల్ కడకు ద్రోయు

కపట రహితుడు, భక్తసంకలితు డతడు
వైష్ణవుడటన్న సరణి-న-భా సనమందు
నడచు  వంటి సహజ వైష్ణవుడు కలడె?
నిర ల పవిత్ర చరిత, గాంధీ మహాత్మ ! (



# అవతరణ

(చెఱుకువాడ వెంకటనరసింహం)

దసరాపద్యము

సకల ధరోపేత-సౌఖ్య సంభరిత
ఆనంద సంధాయి-అయిన భూమాత
కాలకరంబుచే-గాసిలిజెంది
మలిన వస్త్రంబును-మలిన దేహంబు
కన్నీరు కాల్వలై-కారెడు కండ్లు
ముడి వీడి వీపుపై-బడి వేలుకొప్పు
వంచిన మోముకా-నించిన చేయి
వాడి కృశించిన-వదనాబ్జకాంతి
కడు దుఃఖభరితమౌ-గద్గద స్వరము
తడబడు పాదముల్-దైన-భావంబు
ఏర్పడ జనుదెంచి-యేకాంతముగను
అలలోకాధీశు-డైన వైకుంఠు
పాదాబ్జములమీద-బడియిట్లు బల్కె-
"హా తండ్రి! జగదీశ! హా! దీనబంధూ
భూలోకమంతయు-పుణ్యహీనంబై
నరకతులంబుగా-నానాటమారె

బలవంతులగువారు-బలహీన జనుల
అగ్రవర్ణమువార-లంత్యజాతులను
ధనమదాంధులు- ద జనులను బట్టి
వ్రత జాతులు కాల- జాతులన్ బట్టి
తమ ప్రయోజనమునకై-ధర ంబు మాని
అస్వతం తులజేసి—అతి కూరముగను
మత ధర స్వాతంత్ర్య-మను మాట క
చెలరేగి హింసలు-చేయుచున్నారు
ఇంద్రియలోలురై - యిది యది యనక
సకల పాపంబులు-సల్పుచున్నారు
నా మనస్సుకు శాంతి-నా స్థిమితమైపోయె
స్వస్థ చిత్తములేదు-సౌఖ్యంబులేదు
పాప భారము ను-భరియింపజాల
ఇందుకు పరిహార-మేమని వేడ
అపుడు నారాయణుం-డానతి యిచ్చె
శిష్టరక్షణ దుష్ట-శిక్షణల్ జేసి
సత్య ధర ంబులన్-స్థాపన జేసి
భూతలంబును స్వర్గ-భూమిగా జేసి
జగముల రక్షింప-యుగ యుగంబులను
బహురూపముల నేను- ప్రభవించుచుందు
బహు మార్గముల నేను-పనులు సాధింతు
నా లదెలియంగ-నరులకు దరమె
అని చెప్పియోదార్చి-అంతర్హితుండై
వెడలిన పిమ ట-వెలసినాడనగ

మహాత్మా గాం.

గాంధీ మహాత్ముండు-కరుణ సాంద్రుండు
నిర్మలుండు-ధర్మ స్వరూపి
భారత దేశంపు-పార తంత్ర్యంబు
ముందుగా నాశనం-బొనరించినపుడె
వరుస క్రమంబుగా-వసుధలో నున్న
సర్వ దుర్మార్గముల్-సమసిపోగలవు
అందు మన స్వరా-జ్య ప్రయత్నంబు
సంకుచితంబైన-స్వార్థంబుగాదు
భూలోక శాంతికి-మూల కారణము
అనియెంచి మాహాత్ము-డాహావంబిపుడు
సాగించుచున్నాడు-సాహసంబొప్ప
ఇందు పాల్గొనువారి-కందు మోక్షంబు
సత్య ధర్మంబులు-శస్త్రాస్త్రచయము
దౌర్జన్య విరహిత-త్వంబె కవచంబు
రాట్నమే చక్రమై-రక్షించు మనల
ఇట్టి గాంధి మహాత్ము-నిదె ప్రస్తుతింతు
జయీ విజయీభవ దిగ్విజయీభవ



# నవ్వవోయీ గాంధి

(సారధి. కృష్ణ - - )

పల్లవి: నవ్వవోయీ! గాంధీ!

నా! బాపూ ! గాంధి !

అను పల్లవి : మా యాంధ్య పరిపంధి

మా మహాత గాంధి!! నవ్వవోయీ!

చరణములు

తెలివి కెరటాలలో తేలియాడే నవ్వు

ప్రేమ సామ్రాజా న, విహరించు నవ్వు ॥నవ్వవోయీ॥

సత వతంబులో-జననమొందిన నవ్వు

శమదమాదులలోన-శాంతి జెందిన నవ్వు ॥నవ్వవోయీ॥

దసాదల నెల్ల-నాదరించే నవ్వు

భేదవాదులకైన-మోద మొసగే నవ్వు ॥నవ్వవోయీ॥

సతా గహాగ్నిలో-నృత్యమాడిన నవ్వు

ముతా ల విరజిము -ముద్దయిన నవ్వు ॥నవ్వవోయీ॥

పారతంత్ర మునెల్ల-పార దోలే నవ్వు

స్వాతంత మున్ సదా వరలజేసే నవ్వు ॥నవ్వవోయీ॥

మహాత్మా గాంధీ

రాజ సూత్రాలలో-రంగు తేలిన నవ్వు
రాజ్య వేత్తలకైన-రక్షణిచ్చే నవ్వు ॥నవ్వావోయీ॥
రాట్న గానంబులో-లయము నొందే నవ్వు
కదురు పాటలలోన-గలిసిపోయే నవ్వు ॥నవ్వావోయీ॥
పూర్ణ స్వరాజ్యంబు-బోధజేసే నవ్వు
బోసినోటను వెల్గు-పొలుపైన నీ నవ్వు ॥నవ్వావోయీ॥
అరుణ కాంతినిగూడ-నవల ద్రోసే నవ్వు
చిత్తాబ్జములయందు-జిందులాడే నవ్వు ॥నవ్వావోయీ॥
సంఘ సంస్కారము-సమకూర్చు నీ నవ్వు
ప్రత్యక్షముగ దైవ-బలము జూపే నవ్వు ॥నవ్వావోయీ॥

# గాంధీ ఋషి

"కళా ప్రపూర్ణ" "మహాకవి" "శతావధాని" "ఆంధ్ర ఆస్థానకవి"

( చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి )

తురకలకు బాప పుణ్యము
లరయం బనిలేదు వారి యందును సచ్ఛీ
లురు గలరు శతమునకు నొ
క్కరు, తక్కినవారి జెప్పగా నేమిటికిన్.

నవకా జిల్లాలో
శివ శివ రక్కసులు మున్నుజేయని అయ్యే
యవమానంబులు హత్యలు
పౌరరుంబోతు లొనరింతిపుడు ఘోరముగన్.

అట్టియోగ్యులలో గలియంగ వలయు
నంచు జెప్పెడి గాంధి మహాత్కుండు
వాంధ్రతో జెలి మనకు స్వప్నముననేని
సంఘటింపదు గాంధి సర్వసముడు.

తురక మంత్రిత్వమున్నయందుననె, కా
ఘట్టమునకట్టి దుర్దశ గలిగె నేడు
వారితో మైత్రి గాంధి గోరుకంటె
బండ గట్టుకు నూతిలో బడుటమేలు.

మహాత్మా గాంధీ

తురకల బాధలు పడిపడి
మరచితి మాంగ్లేయులు మన మహి నేలుటచే
మఱల జవి జూచితిమి నే
డఱి ముఱిగ స్వరాజ్య భాగ్య మబ్బిన కతనన్.

స్త్రీల జంపిరి చెఱచెరి దేశమున, క
రాజకము సంఘటించిరి రాట్ప్రతినిధి
యూరకుండె గిక్కురుమనకొండు దిక్కు
లేక ప్రజ గ్రామములు వీడి లేచిపోయె.

బలవంతముగా నబలల
గలిపి కొనిరి తమ మతమున ఖడ్గపు దళ
త్తళలు గనజేసి, వారల
చెలిమి బ్రార్థించు గాంధి వీఱడియే,

కాదు వీఱడి కారార్థి, గర్వముడిగి
చేయవలయు యత్నంబని స్వీయ పౌరు
షంబు చంపుక యత్నంబు సలుపుచుండె
గాని వారలు మనతోడ గలసిరారు.

మన మెల్లరు దురకలమై
మనవలె గాదేని వారి మ్రందింపవలెన్
గొని ఖడ్గంబును ప్రార్థిం
చిన లాభము దు గాంధి యేమనునో!

ఎల్ల చోట లహింసలు నెల్ల చోట
హింసయున్‌గూడ బనికిరాదేనిగాంధి
శిరము నొగ్గినయెడ *'జపా' సేయు దురక
క త్తిపీటకు బలియుట గలదె పండ్లు.

గాంధి కెంతటికోపమో కలదుగాక
అల్ల నవకాళి సతుల యార్తారవంబు
విన్నదాదిగ దిగ మింగి వెరవులరయు
చున్నవాడు మహాతు ండు ఖిన్నుడగుచు.

అట్టి వారలతో మై త్రి యలవడదని
యెఱుగు గాంధీ మహాత్ముం డెఱిగికూడ
సలుప యత్నంబు వారితో గలిసిపోదు
మన్నవారల నాయన యడ్డబోడు.

గాంధి మహాత కుండనగ గారణ జను డు తన నంబు దు
ర్గంధులపట్ల పూ ర్తి విముఖంబని లోక మెఱుంగునా కృపా
సింధుడు వంగదేశము నశించుటకెంత కృశించుచుండెనో
అంధమనస్కులౌ తురక లారయ నేర్తురె? గోపలాశనుల్.

గాంధి యల బుద్ధునింబోలుగాని, శంక
రాదులకు దీటుగాదీత డవతరించు
కతమున బురాణ ఋషుల వాక ము లవి య
థాగములు గావుటబ్బె శ్లాఘ గుణుడితడు.

---

* సఫా

నవకా తురకలకున్
వివేక ముదయించుపొంటె వృద్ధ మహాత్ముం
డెవియో సూక్తుల దెలిపెన్
జెవిటి సంకూద ఫలము జేకుఱునె, కటా!

అంతియ కాని వేదమునకాతడె యర్థము చెప్పు శాస్త్ర మా
ద౦తమునాతదే యెఱుగు యజ్ఞములాతడె నిర్వహించు సి
ద్ధాంతము లాతడాడు నుడులన్నియు నంచు వచించువారు ధీ
మంతులుగామి, వారలు విమర కులంచు దలంచ నేనెదన్.

భగవద్భక్తుండయు ను
నిగమములం దాస్థయాతనికి లేదు మఱిన్
భగవద్గీతయు, యావ
త్తుగ ంపడు తోసిరాజుతో సరిపెట్టున్.

ఆత డవధూత మార్గంబు ననుకరించు
నదియె బోధించు నితరుల కలదియగునె!
గేస్తులకు దాని తత్త్వము కేవల మొక
గాంధికే చెల్లె నాతడీకాలపు ఋషి.

అతని భక్తియు మఱియు నల్లతని ర_
అతని భ_యు మఱియు నల్లతని శ_
అతని ముక్తియు వేఱు, లోకాతిశాయి
యతని చరితం బితరులకు నందబోదు.

పాతుకపోయి దేశమునుబట్టి పలార్చు విదేశవాసులన్
నేతల నీతులన్ గఱపి నెమ్మదిగా దొలకించినట్టి యా
చాతురికెంత మెచ్చిన రసజ్ఞకు దృప్తిజనింప దిట్టి వి
ఖ్యాతులు మున్నుపుట్టరు యుగంబుల నెన్నిట నెన్నిచూచినన్.

ఆస్తికుడయ్యు గాంధి కడు నాస్తికు భంగిని దోచుచుండు
దస్త్రములేని యాతని యుదారత దుర్గ్రహము మ్మనీషి వి
ధ్వస్త సమస్త న్నమత వర్తను డాయన తత్త్వమున్ యథా
వస్తుక మౌనటుల్ దెలియు వ్యక్తులుమృగ్యు లెఱుంగజెప్పితిన్.

చండాలుండేనియు బా
పండేనియు గురుడటంచు బలికిన ధీమం
తుండల శంకరు నట్టి డ
ఖండుడు గాంధియన నొరులు గారతని సముల్.

కాలానుసారముగ జం
డాలులు మన మొక్క టేయనక తక్కినచో
బాలిశులు తురుష్కులు చండా
డాలుర గల్పికొను నెడన్ జిక్కొదవున్

ఏ యెండకు నా గొడుగును
దీయు నెఱుంగు నా సుధీమణి గాంధీ
మాయావుల ర్జించు ను
పాయ మఱసి చేర్చికొనియె పంచమ జాతిన్.

ఒక్క బ్రాహ్మణ జాతిలో బెక్కు భేద
ములు గలట్టిరు భార తీయులగు కతన
గాదె ఖండాత రీయులు గళము నొక్కి
మనల నేలుట తుదకు సంప్రాప్తమయ్యె.

కాలినడకను బ్రతియూరు గాంధి యేగి
పడిన కష్టమ్మునకు నొక పది దినములు
గూడ దిన్నగానుండరు "కుక్కతోక"
సామెతకు వారి నడత లక్ష్యముగనుండె.

త్వరలోనే తురకలు తె
ల్పిరి తత్త్వము గాంధిజీకి; వేదాంతము ల్
మొఱకుల కడ బని సేయునె?
నఱకకతను విడుచుటది జనస్తవ్యమగున్.

గాంధి ప్రాయోపవేశము గడగడమని
వణక జేయును సకల ప్రపంచ మది తృ
ణము సేయదు తురక కులమ్ము వారి
కెందుకో! గాంధి గారి యెడల వెఱ్ఱి.

నాకు దోచినమాట ఈ నాడు గాంధి
యవతరింపడేని ఆంగ్లేయ పీడ
వదల దీ దేశమున కింత వాస్తవంబ
గాని లోకము చె యె సకల విధముల.

అన్ని వస్తువులకన్నను ప్రాణ మెక్కు
డట్టి ప్రాణము తృణముగా నటయు గాంధి
అతని గొప్పదనము సర్వమందె కలదు
దాననే వందనీయుడై తనరె నతడు.

అక్కృతమున కుల భేద మవలనెట్టి
పాలనూకిన వచ్చినదారి బట్టి
తెల్లదొర లేగుదురు వారి దేశమున క
టంచు గాంధీ మహాత్ముకుం డెంచె నెడద.

ఆపద్ధర్మము నెఱిగిన
శాపాయుధు మహాత్ము వైదిక దృష్టిం
జూపుదు రుదార హృదయులు
దీపటిమము వలయు దీనితెలి గెలుగుటకున్.

వచ్చె స్వరాజ్యమన్న నుడి వచ్చి చెవింబడి గంతులేయగా
జొచ్చెను సంతసంబు పరిశుద్ధ చరిత్రుడు గాంధి నెంతగా
మెచ్చిన దన్వి రు నపమేయు డతండు, జగన్నియంత యీ
పిచ్చితనంపు చెయ్యుల త్రివిక్రమ లకు వన్నె వెట్టిడిన్.

(ఇటీవలి జాతక చర్యనుండి)

# శ్రీ గాంధీ స్తవ పంచకము

(హరి నాగభూషణం)

సదసద్వివేక మార్జన సిద్ధముగాగ
సాధు మార్గము పట్టు సచ్చరితుడు,
ఐహికాముత్ర భోగాదుల దెగనాడి
దీన రక్షాదీక్ష నూగువాడు,
శాంతి దాంతి తితిక్ష శ్రద్ధా సమాధులన్
పంచకంబును సంగ్రహించువాడు,
ఆత్మ ముక్తి కొఱకు యత్నింపకయె ప్రజా
స్వారాజ్య సిద్ధికై పోరువాడు,

నిత్య సత్య వ్రతుండయి నెగడువాడు
బ్రహ్మ చర్యంబు సిద్ధించు పావనుండు
భూతహింసల దొలగించు పుణ్యపురుషు
డహహ! గాంధి మహాత్ముండు వాక్ప్రియుండు.

మాతాపితలయెడ మాన భక్తియెసంగ
శుశ్రూష నొనరించు శుద్ధ మూర్తి,
ఏకపత్నీ వ్రతాద్యైక చిత్తుండయి
కాముని గెలుచు నేకాంత శాలి,

హూణవిద్యారాశి నొడిగట్టు సుధీంద్రు
డయి విషయేచ్ఛల నడచుయోగి
నా యవాదియునయ్యు న్యాయంబు దప్పక
ధనము నార్జించిన తా గమూ_ర్తి
పరుల కుపకృతి సలుపు దేశవ్రతుండు
దీన జనముల తాపంబు దీర్చు ఘనుడు
రాజనీతిని గ్రొ_త్త మార్గంబులందు
నడుపునేత మహాత్మ ం, డనఘుడు గాంధి.

గీర్వాణులేనియు గేలో డ్పకే వ చ
స్సంభాషి వాగ్మితా చక్రవ_ర్తి,
రారాజు నంగవస్త్రముతోడ దర్శించు
ధీరసింహాసనాధిష్ఠితుండు,
సర్వదేవ ప్రజా సత్కృతులందు ప
రార్థ సా మ్రాజ్య ధురంధరుండు,
ప్రతిన రక్షింపగ ప్రాణము లర్పించు
తెగువరి యభయ ప్రతిష్ఠితుండు,
దైవభ_క్తియు సత్యవ్రత ప్రశ_స్తి
భూతదయయు నహింసావిభూతి మెఱయ
రాజనీతి విశారదుండై జనముల
చి_త్తరాజ్యా షి_క్తుడై చెలగు గాంధి.

బ్రహ్మ విద్యాగోష్ఠి బ్రహ్మిష్ఠతా వశి
ష్ఠాదులు చెలరేగు నంతదాక
సత్య సంధత హరిశ్చం ద్రులు ధర రా
జాదు శో ంచు నంతదాక

మహాత్మాగాంధీ

ఏకపత్నీవ్రతాలోక సిద్ధులు రామ
భక్తులు వేనవేల్వరలుదాక,
పరమ పతివ్రతా వరవర్ణిను లరుంధ
తీ, జానకులె యుప్పతిల్లు దాక

అతి పూజా భరద్వాజు లమరు దాక
ఆర్తరక్షణ శిబి చక్రవర్తుల సము
లలరు నందాక వర్ధిష్ణువై వెలయుత
మమల యశు డల గాంధీమహాత్తు డెలమి.

రామచంద్రుడు శ్రితజన రక్షకుండు
సర్వలోక శరణ్యుండు సౌమ్యమూర్తి
పుణ్య లికి గాంధికి బుట్టె డాయు
వొసగి భూమమైశ్వర్యము బొసగజేయు.

# గాంధీ మహారాజ్

రవీంద్రుని కృతి కనుకృతి

(వేలూరి శివరామ శాస్త్రి)

గాంధీ శిష్యులలోఁ గుచేలులును, దిగ్వాసుల్ గలా రిట్టి మా
బంధు శ్రేణికి మేళనం బొకయెడన్ బాటిల్లు మే మెన్నఁద
ర్థాంధుంగాఁచుచు మోకరిల్లము దరిద్రానీక కుక్షిస్థవి
సంధిచ్ఛదముజేసి మాకడుపు నించం జూడమే జాడలన్.

అంబోతుంబలె దూ నారు యములట్లై దండముల్ జూపుచో
బాబూ కన్నుల నెఱ్ఱజేసికొని లాభంబేమి? మీ చర్యకున్
బాపల్ వెఱపందుచో వెఱతురా లెండౌర! మా కాభయం
బూతంబను బారదోలితి మటం చేమందు మవ్వారితోన్.

సారళ్యంబున స్వచ్ఛతాగరిమకున్ సైరంధి మా భాష తత్
స్వారసం బెరిగింప నేరి నెడర్థంబుల్ పెడర్థంబులున్
బారం జూచె కౌశలంబు మఱి పీనల్ కోడ్డు పీడించు నే
ర్పే రెండేటికి? సూటిగాఁజెఱకు మమీ భాష కొంపోయెడిన్.

ఇల్లును వాకిలిన్ విడిచి యెవ్వరు లేటి దళంబునన్ జెఱం
గొల్లలు కొల్లతాచు గుమిగూడిరి వారల బంధశాపముల్
చెల్లెను వారి సంకెలలు ఛిన్నములాయె తమంత వారి యు
త్ఫుల్లములైన మోములను ముదితమాయెను గాంధి దీవనల్.

—X—

# మహాత్మా గాంధీ

"కళాప్రపూర్ణ కవిసామ్రాట్"
(విశ్వనాథ సత్యనారాయణ)

తండ్రీ! నీకు దిగంత భూములు తపస్తఃప్రాప్తముల్ నీకు నీ
యాంధ్రుం బిడ్డలు పేద సాదలౌకనై యాతా రాముండవై
ంద్రన్ దేశము కాలమున్ గెలిచితిన్ దివ్యుండవై నాదవున్
పుంద్రేక్షు ప్రదరాంత కోమలతనూ స్ఫూర్తే; నమస్తే నమః.

అసి శాంతంబని నీవు చేసిన రణ వ్యాఖ్యానముల్ మా, కు-
ర సముద్భూత శుక ప్రసంగములలో రాచెన్ మహార్థంబులా
దెస నీ పల్కులకున్ ప్రతిధ్వనులుగా, దివ ప్రబంధార్థ మ
ధ్యసనం బింతయులేకయుం దెలిసె నప్పా! నీ మహత్వంబునన్.

తొలి జన్మట్టి మహర్షి సంతతి మనోదోషంబు లాత ప్రభా
దళింతంబై చను తి చెప్పిరి మహాత్మా! వా లోకము నం
దలి రాజ్యాళలు దుష్టతల్ కలిపి, యాత్మాసిన్ విదారించు నీ
తులు సెప్పన్ సలుపన్ సమర్థుడయి తెంతో నూత్నవాచంయమీ!

కనుసన్నలర్థములు నేరక చిక్కువడెన్ జగత్తు ఏ
వాకును చేయుచున్నయది భారత దేశము నీ యెడ న్వీచి
తాకృతివైన నిన్నొకరు డౌనను గాదను నింక నొక్క
పోకిళలెల్ల బట్టకయ పోవుచునుంటివి దివ వీథులన్.

నేతృత సూడ చంద్రునకు నీకును పోలిక కొంత యున్న, దు
్వతల మంతయున్ గగన వీథి నిలంబడి యేలురాజు ౹
చేతనొ రాహులిద్దఱకు చెట్ట ఘటించును నూలు పోగుతో
(తుల యోదు రిద్దఱును, విశ్వజిగీషు లిద్దఱున్ మునీ!

విరిసిన బోసి నెన్నగవు వెన్నెల ౹ తొలినేల నల్దెసల్
కురిసి మహాసభాజన చకోరములం దనియించి పేదయై
బిరుసయి యెట్టివారి దురపిల్లిన మా వరిపంటచేలు కా
విరి తలలెత్త నీ కలము వెన్నులనించె సుధాప్రవాహముల్.

దీప్రోల్లోక మతి ప్రభాహత వచస్త్రీ ప్రాంధ్యమే పాణినీ
య ప్రాగల్భ్య విధాన సూత్రతతి యల్లా నాడు నీనాడు సూ
త్రప్రాయము లు దివ్య బుద్ధికములౌ త్వద్వాక్కులున్ భోగరా
జ పౌఢోజ్జ్వల భాష్య దీప్తిబరితస్సంతృప్తి కల్గించెడిన్.

నిలువ నీడయు లేని నిరుపేద దీర్ఘ ని
శ్వాసము నీకు వింజామరము
కడుపాకటిని దవడు వాని జాలు
కన్నీళ్ల కొంజడి నీకు వెల్ల గొడుగు,
సంఘదూషకుల దౌర్జన్న స్నాతు ని
గుండె నీకును సభామండపము
ఆజన సిద్ధ కారాగార వాసము
డంబు మీరెడు కిరీటంబు నీకు

తత దరిద్ర ప్రజాహృదంతరము
మొలుకు రతనాలు నీ కొలువున్న గద్దె
ఓ విచిత్ర సన్యాసి! నీ వొక్కరుడవె
రాజువన్న నిజముగా, రాజువయ్యు!
అవును నిజము భర్తృహరి యన్నయట్లుగా
మహి బరోపకార మతులు సువ్వొ
త్రవ్వియిత్తు రెండు దమయాత్మ దేహము
తమ కుటుంబికంబు తమధనంబు.



# గాంధీ ఉవాచ

(మహాకవి కాటూరి వేంకటేశ్వరరావు)

హరి సృజించె నరుని అచ్చము తనపోల్కి
నరుడు తన్నుబోల హరి సృజించె,
ఇనుము పైడిజేయ నీశ్వరుండే నేర్చు
గాంధి పలుకు ధర గంధ మొలుకు.

కడలివోలె నెల్లకడల నీశ్వరు డొక
బిందువై వసించు నందు నరుడు,
కడలిబాసి బిందు వడగారు నిక్కము
గాంధి పలుకు ధర గంధ మొలుకు.



# బాపూజీకి నమస్సులు

(పురిపండా అప్పలస్వామి)

ఇతడు బాపూజి బోసినవ్వుల తపస్వి
భారత మహాస్వతంత్ర రణాంగణమున
సర్వసేనాని, సత్యాగ్రహ ప్రణేత
సర్వ సర్వంసహా పరిత్రాణ మూర్తి.

ఈ అవతారమూర్తి నొగి
లింపదు శాత్రవమానసము ద్వే
షింపదు ఆతతాయి నయి
నన్ పరపీడన సైపలేదు ప్రే
మాస్త్ర మదొక్కటే యితని
పాశుపతాస్త్రము, గెల్పెగాక ఎ
న్నండును ఓటమిన్ గురుతె
రుంగడు ఈతనికిన్ నమస్కృతుల్.

# న మో వా క ము

(చెరుకుపల్లి జమదగ్నిశర్మ)

తన తను వఖిల భూత నికాయమై స్పర్శ
సర్వము విస్పష్ట పఱుప
తన కన్నుగవ సర్వదర్శియై లోక మం
దలి మంచి చెడ్డల తఱచి చూడ
తన వీనుదోయి ద్విధాబద్ధజనుల కృ
తాకృత వేదన మ్మాలకింప
తననాస నరుల చిత్తముదూఱి దుర్గుణ
సుగుణ పుంజములు మూచూచి తెలుప

తనదు నాలుక నిఖిలభూతముల సేమ మిల
నిలుప శుభాపాది వాక్కులనె బలుక
తానుగా నుండి సర్వాత్మ్ముడైన యట్టి
యా మహాతు న కేను ప్రణామ మిడుదు.

జయ జయ భార ీయ మనసా పరిపూజిత ధర్మపాలకా
జయ జయ దేశమాతృపదపద్మ సమర్పిత సర్వ వనా
జయ జయ జాన రమణ చారు పదార్పిత చిత్త పంకజా
జయ జయ గాంధిదేవ భ సాగరవత్సర దాస్యమోచనా.

( అక్టోబరు భారతి)



# గాంధీజీ

(పురాణం రాఘవశాస్త్రి)

ఆయన సత్యవాది, మహిమాన్వితు డుజ్జ్వల భారతీశ, తే
జోయుతమూర్తి, శాంతిరసశోభితు, దూర్జితసత్త్వుడున్, అహిం
సాయతివర్యు, డార్యజన సంస్తవనీయుడు, గాంధిజీ, స్వదే
యుల దాస - శృంఖలలు చెచ్చెర ద్రెంచెడిమాట సత్యమే.

ఏ నలుసంత సిగ్గ నయించుటలేక అనంతమైన వి
జ్ఞాన మనాది సిద్ధమగు సభ్యత, సంస్కృతి గల్గు భారత
క్షోణికి చేయివాయి ఒక చొప్పున గట్టిన కూడ నీతి తం
త్రానుగ దుష్ప్రవర్తకుల కాయన దీక్షృతియే కదా సదా.

ఈ యమృతైకమూర్తిని జయించెడి ఆటము బాంబులేదు, దీ
ర్ఘాయురుపేతు డీతడు, స్వరాజ్యరమాతరుణీ సుహాస రే
ఖాయిత చంద్రికా ధవళ కాంతి పరీవృత మాతృదేశ సు
శ్రీయది యెల్ల మాకితని, చే-చలువై లయింపగావలెన్.

ఇత భారత మోక్షదాయకుడు ప్రహ్వీభూతదేవాంశ సం
భృత దివ్యాకృతి, లక్షలాది ప్రజకేకైకాత్మ, ప్రాచీన భా
రత విజ్ఞాన సరస్వ నిలయు డార్యావర్త భానూదయ
స్థితికిన్ తూరుపుకొండ, వర్ధిలవలెన్ తేజస్వియై యబ్దముల్.

(భారతి, అక్టోబరు 45)

# గాంధీలాలీ

(కొండపల్లి జగన్నాథదాసు)

గాంధీలా ! మోహన గాంధీ లా !!
కరుణాసాంద్రా! మోహనదాస ॥గాంధీలా॥

నిదురమాని హారముమాని-నీవు మా కొరకు
కదురు రాట్నమెన్నాళ్ల గతి-ఖైదున ద్రిప్పెదవు ॥గాంధీ॥

ఎర్రవాడ చెరసాల నీకు-ఇల్లయి పోయినదా!
ఏలిన వాడవు నీదుమోము-ఎన్నడు జూతుమురా ॥గాంధీ॥

కల్లుమాని ఇల్లాలిని-గౌరవింతుమురా!
మల్లుమాని మాయషోకుల-మాటా మరతుమురా ॥గాంధీ॥

పంచమాదుల మరచినామని-పంతము బూనకురా!
పంచమ దోషము పాలింపకురా-పవ్వళించుమురా ॥గాంధీ॥

జగన్నాథ దాసపోషక-జగన్నాయక
నిరుపమాన నిర్వికార-నిదుర బోవేర ॥గాంధీ॥

# గాంధీ మౌనిని గొల్వరే

("కొండపల్లి")

గాంధీ మౌనిని గొల్వరే-పామరులారా ॥గాంధీ॥

అంధకారమునందు-బంధింపబడి యిట్లు
కుందగనేల మీరెందు హిందువుక ॥గాంధీ॥

కాలము వ్యర్థముగ-గడపక సన్నని
నూలు ౹యగను రా-ట్నమును బెట్టుడివేగ ॥గాంధీ॥

సీమ గుడ్డలుగట్టి-సిగ్గెల్ల విడనాడి
సోమరులై తిరుగ-క్షేమము గల్గునె ॥గాంధీ॥

రాగలదు మనకు, స్వరాజ్యభోగము నేడె
త్యాగులై మీ మీ యు-ద్యోగములు మానండి ॥గాంధీ॥

మురిపెంపుతో శ్వేత-ముఖుల కొల్వునజేరి
తరియింపలేరు, య-థార్థము నమ్మండి ॥గాంధీ॥



# లెండి మన గాంధిని కొల్వండి

("కొండపల్లి")

లెం । మనగాంధిని కొల్వండి। వేగలెండి॥మనగాంధిని కొల్వ

జండాలెత్తండి। మన-జండాలెత్తండి ॥లెండి॥

అసహాయోగమే మనకు-ఆధారమండి

అసలైన యోగమది-అభ సింపండి ॥లెండి॥

హిందూముసలా ను సమే లనంబె

సందేహమేల మన-స్వరాజ మండి ॥లెండి॥

దౌర్జన రహితమె-దారి యనుకొండి

త యుంచుటకు వేరె-దారి దండి ॥లెండి॥

పంచమదోషము-పాటించకండి

కొంచెపు నరులాని-వంచింపకండి ॥లెం ॥

శాసన సభ మాట-స రియించకండి

సభలలో లేదం -స్వరాజ్యమండి ॥లెండి॥

రాట్నము దిప్ప నల-వాటు చేయండి

రమ ముగ ఖద్దరు-రండి! కట్టండి ॥లెండి

కాలమెటు మారెనో-గమనించుకొండి
గాంధి నామ స్మరణ-గావించుకొండి ॥లెండి॥

గాంధి నగరమంత-గాంధిమయమండి
కాకినాడ కాంగ్రెసు-ఖ్యాతి నిల్పండి ॥లెండి॥

అసహాయోగ మర్మం పు-టర్థ మెరుగండి
దాస జగన్నాథదాసు నడగండి ॥లెండి॥

## సఖుడ! గాంధీమహాత్ముని చూచినావా? లేదా? చెపుమ

("కొండపల్లి")

సఖుడ! గాంధీమహాత్ముని చూచినావా? లేదా? చెపుమ ॥సఖుడ॥

నిన్న మొన్న వచ్చెనతడు-కన్నులార చూడలేదా?
వెన్నుడు శ్రీకృష్ణుడతడు-వెర్రివై చెడి పోక నీవు ॥సఖుడ॥

భార యుల కష్టములను-బాపుటకును బుట్టినట్టి
వాసుదేవుడైన కృష్ణ-స్వామి యతడె మోసపోకు ॥సఖుడ॥

ఒక్క యేడాదిలోపలనే-నిక్కముగ స్వరాజ్యము, మనకు
దక్క యునట్టి మా-ధవుండతడేరా! వినరా ॥సఖుడ॥

ఘోర భగవంతు మనకు-నలవిగాదు తెలియుటకును
రామదేవుని కైక దెలియక-పామరత్వమున జెడియె॥సఖుడ॥

# గాంధీ శతకము

(మంగిపూడి వేంకటశర్మ)

నిరుపమ కళ్యాణ గుణా
భరణా జనకాథ యోగివందిత చరణా,
పురుషార్థ భరిత చరితా
కరుణామృత పూరితాత్మ గాంధి మహాత్మా !

నీ వవతరించుటను నా
రా వర్తము పూతమయ్యె నవని తరించెన్.
వైశ్యకులము మెఱసెను
కావంబడె భరతమాత గాంధిమహాత్మా !

నీ వేసువనుచు బుద్ధుడ
నీవనుచున్ రాముడనుచు కృష్ణుడ వనుచున్
భావింతురు, నీవందఱు
గావలయునటంచు నెంత్రు గాంధిమహాత్మా!

క్రూరులయి హింస జేసెడు
వారల ప్రేమించునట్టి వ్రత మూనితి వా
కారణమున క్రీస్తందురు
గారవముగ జనులు నిన్ను గాంధిమహాత్మా !

భూతములనెల్ల సహజ
ప్రీతిన్ గనుగొనుచు నొక పిపీలికకేనిన్
ఘాత దలంపని కతమున
గౌతమ బుద్ధుడవటంద్రు గాంధిమహాత్మా !

తిలకింప పరశురాముడు
తిలకై జని ంప నతని తేజము గొనుచున్,
వెలసితివట కాదా మఱి
కలియుగ రామావతార గాంధిమహాత్మా !

సదయత వలువ లొసగి, ద్రౌ
పది బ్రోచిన కృష్ణుడనగ భావ మగున్, ము
ప్పది మూడుకోట్ల బ్రోచితి
గద మానము నిల్పి నేడు గాంధిమహాత్మా !

ఖండాంతర పం తులు, న
ఖండంబగు దివ శ క్తిగల వాడనుచున్
ఖండితముగ బల్కుదు, రా
ఖండలనిభ నిర లాత గాంధిమహాత్మా!

వై రులును మహాత్ము డ వని
పేరుగొనక మానలేరు తిన్ న్
వారక యెల్లరు దలతురు
కారణ జను డవు నీవు గాంధిమహాత్మా!

మహాత్మా గాంధీ

సత్యము నిత్యమటంచును
సత్యము విడనాడ వెట్టి సమయమునందున్
సత్యము నిను రక్షించు, న
గత్యముగా దోడు నిల్చి గాంధిమహాత్మా!

స్థానము ఋషికోటి , వి
జ్ఞానము-లకు నెలవు భరత ఖండంబనగా,
దీని సరిదేశ మెందును
గానము గద లోకమందు గాంధిమహాత్మా !

భోగముల కాట పట్టిది
త్యాగములకు నిలయమిద్ది ధర ంబులకున్
బాగగు నెలవిది, స్వర్గము
కాగలదా దీనికుద్ది గాంధిమహాత్మా !

గరితలకు, పుణ్య సంప
ద్భరితులకున్ సాధులకును భగవత్సేవా
నిరతులకు, సుచరితుల కా
కరముగదా! భరతభూమి గాంధిమహాత్మా !

(భారతినుండి డిసెంబరు 3)

# గాంధీజీ

("దేశభక్త" కొండా వేంకటప్పయ్య)

తరములదాటి యత్నముల దండిగ జేసిరి పూజ్యులంద
తరమున జేసె గాంధి మహితాత్ముడు తాపసి దీక్ష వతన్
వరల తపోబలంబుననె వచ్చె స్వరాజ్యవరంబు భోజ్యమై
కరములు మోడ్చి నమ్రతను గాంధిమహాత్మ నమస్కరించెదన్.

భారత మాత గర్భమున పండినపంట మహాత్మగాంధి యీ
భారత దాస్య శృంఖలము బాపగ బుట్టిన భవ్యమూర్తి యీ
భారత ధర్మమార్గముల భారతమందును లోకమందునున్
బారగజేయు కంకణము పట్టుగ గట్టెనుగాదె గాంధి .

కొట్టగ కఱ్ఱలేదు, మఱి కోయగ ఖడ్గములేదు, శస్త్రముల్
పట్టగరాదు, శాత్రవులు పట్టిన గొట్టిన నేమిచేసినన్
రట్టును రద్దిచేయకను రమ్మని పిల్చినతోడ బోవుచే
యిట్టిది యుద్ధపద్ధతి, మఱెట్టుల గెల్వగ సాధ్యమయ్యెనో.

(భారతి, అక్టోబరు )



# గాంధీజీ

('కవి సమ్రాట్' విశ్వనాథసత్యనారాయణ)

క్రామ క్రోధమదాది రాక్షస సమాక్రాంతంబులౌ లోకముల్
స్వామీ! నిశ్చల తావ న నయన ప్రాంత ప్రశాంతాంశు మా
లా మార్గము లకున్ స్వనాశ భయ లావిహ్వాలంబుల్ హాహా
హా, మోసాల పెడంబెడం బడి, యుడాయుంచున్ బడాదేశముల్.

ఇగతాళించు త్రయీశిఖా సకల మాహేయీ సుధా దోగ్ధ తా
నుగ గీతా పరమేశ్వరుండు ప్రభు! నిన్నుంగాంచి, యీ బోసి బెం
డుగ వైశ్యుండతి వర్ణ ధర్మపథమున్ నూత్నంబు గల్పించె నం
చెగడై స్వీయ దశావతార భరలజ్జానమ్రుడై పోయెడిన్.

లూన కరు లు వామలూరు గుప్త కృతుల్
వెలితి పొందనియట్టి నిలువ సరుకు
ఆత ప్రచార దోహల మత క ర్త లం
గడిలోన వృద్ధికై నడపు సరుకు
అల్పాల్పులైన వేదాంతు లము డు వోక
బుట్టలలో గ్రుళ్ళిపోవు సరుకు
నీవు శ ర యా తావాహినీ ప
పోషకంబయి పారువోని సరుకు

యి కొలలేని కోమటి! యీ యనంత
మైన బహు పదార్థ నానా నిరంత
బాధ వినియోగ ధుల ప్రాణధరణ
ఘనము నీ సరుకున వెలకట్టలేము॥

కల మజద్, గఫూర్‌ఖానులు, కారు, వల్ల
భాయికాడు, రాజేంద్రబాబు కాడు
కాదనీవు బాహ ణ సంస్థ కాంగ్రెసందు
రాత గుణముల బలముచే నమరమూర్తి!

నుడు తావెల్గులు ఉత్తదంత వదనుల్ సూరు ందునున్ వు, చం
దుడు నీవున్ మటి నూలు పోగునకు సంతోషింతు రయ్యగ్ని దే
వుడు నీవున్ సకలాహుతి ప్రకట సంభూతాత్ములే వెల్గు కా
వడులన్ వారికి జంటకుండ వగుచున్ బాలో సినావో మునీ!

కోరల్‌గాగ దుపాకులు మర ఫిరంగుల్ బాంబులున్ రాజ్య వాం
ఛా రూక్షత్వపు బెద్ద నోర్తెఱచి తృష్ణాదేవి పూర్ణాహుతి
ప్రారూఢిం దిగ మింగుచుండ జనులన్ బట్టీక కంఠాంతర
ద్వారంబందున నిల్చి యడ్డుపడె దహ్వా! స్నిగ్ధరజ్జ్వాకృతిన్।

తనకుం బట్టిన జాతి వన విధాతన్ నిన్నహో! వ క్తి
వన సూ తాగ విచారమా త దురహంభావున్ స్వకర చ్యుతుల్
మన యీ బ్రాహ ణు లాడుచుండెదరు కామ క్రోధలోభాది దు
ర్గుణ వారంబుల వ గట్టులు విడాకుల్ ముక్తికాంతా కిన్.

ఎట్లురాజో ప్రజయట్లన్న యర్థము నెఱిగి బ్రాహ్మణుడు నీకృషి నెఱుంగు
ధర సాధనకు నాద్యముశరీరమంట యెఱిగి బ్రాహ్మణుడునిన్ పరిగణించు
అసుర ప్రతారణార్థవతార రహస్యమెరిగి బ్రాహ్మణుడు నీ తెఱగు దెలియు
తనవోలెసర్వభూతములంటబహుముఖమ్ములచూచి నీదారి తెలియుద్విజుడు.

యుగ యుగాంతరముల మార్పులొందు నదియు
నాత వచ్ఛరీ రాధీనమయిన యదియు
నయిన ధర ంబు తనకు యోగ మగు వెడల
తనకు యోగు ల సృజియించు కొనును గాదె.

క్షత్రియులేని భారత జగత్తె యహింసకు మొగ్గదేని, నీ
యెత్తిన యెత్తికోలునకు హిట్లరులున్ మరి చర్చిహిల్లులున్
వత్తురె రక్తమాంసములు ప్రౌఢ చరిత్రులు, జాతిగర్వముల్
మత్తులు మైకముల్ మొదలు మాడినమోడు తుదల్ చిగుర్చుటల్.

నిన్నున్ మెచ్చరు నీతి మార్గగరిమన్ నిస్త్రింశ శాస్త్రాంబుధుల్
కన్నారన్నియు చేయనేర్తురుగదా కాల్పుల్ ఫిరంగుల్ గనుల్
మన్నున్ మిన్నును గానకుండెద రహింసా సాధు సూత్రంబులన్
విన్నారా! యిది తేలెనా! విధురితోర్వీశాసకాశాబ్ధిలో.

( -రచన)



# మా బాపూజీ

('గౌతామీకోకిల 'వేదుల')

చేవదొరంగి సత్తువ నశించి శతాబ్దుల నుండి దీర్ఘ ని
ద్రావశులై జడము ల విధము న నున్న యధీర భార
యావళి మేలుకొల్పి, యసహాయ మహోద్యమ దీక్షతోజ్వల
త్పావకులం బొనర్చితివి, భారత భాగ్యవిధాత! బాపుజీ!

తాచుకోఱల సుధాధార జ్వాలారింప
జాలు బుద్ధుని యహింసా మహస్సు
శిలువ మీదను స్రవించిన సను హృదయాం
తర ర క్తధారల త్యాగమహిమ
ఇసుక యెడారి కాసౌహృదము మార్చిన మహ
మ దు వితంపు నమ కపు బలము
అస్పృశ తాగ్ని జల్లార్ప దారక సుధం
బంచు రామానుజు భ క్తిరసము

వెరసి నీవైన నీ యాత్మ చరిత యీ య
ష దేశాల యెల్ల ల జెరపివైచి
పల్లెలకు బట్టణాలకు బచ్చతోర
ణమ్ము నాడు గట్టుచున్నది మహాత .

నెత్తుటి చుక్కయేని ధరణిం బడక స్వతంత్రతాధ్వజం
బెత్తిన శాంతి యోధుడవు, హింసకు నొదలలొగ్గి యొండొరుల్
కుత్తుక లుత్తరించుకొను క్రూరులె నీ కడకుం గటారులున్
గత్తులు దెచ్చి కైవసమొనర్చి రదెంత మహాతపస్వివో!

నీ వలన భారతమున బానిస తనము
అంటరాని తనమ్ము నేడంతరించె
భ్రాతృ రక్తాక్తమగు కురుక్షేత్ర సీమ
నిశ్చల ప్రేమశాంతి పండించినావు॥

నవ్వులోన గరుణారస మొలుకుచు
మాటలోన నిగమంబుల జిలుకుచు
చూపులోన ధీమా పురిగొలుపుచు
నడిపించితి వీ నవభారతమును॥

నేదగొన్న శ్రమజీవికి శరణము
పల్లెవాటికి బచ్చతోరణము
అంధజగతి కాశారుణ కిరణము
జయ మహాత్మ! జయ బాపూ!

# పర్యాలోకనం

(మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి)

మా బంధములఁ బాపఁ బూనవో మహాత్మా యా నిరాహార దీ
క్షా బంధంబును నిర్వదొక్కటికి నుత్సర్జించి కస్తూరి బా
యీ బత్తాయి రసంబు నందుకొనవో స్వేచ్ఛామృతం బిట్టు
నీ బంగారపుచేత మాకొఱకు నీవే యింక నందీయవో.

వడకంబారెను కాలుసేతులును యావద్భారతక్షోణి కె
ల్లెడ నీ నీరసమెంచి యా యమెరికా ఇంగ్లండులున్‌గూడ, అ
ల్లడమున్ తల్లడమందె దైవకృపవల్లన్ దండి యీ నాడు
యొడలన్ ప్రాణము తేరుకో తిరిగి మా యుల్లంబు చల్లంబడెన్,



# మహాత్ముఁడు

(తుమ్మల సీతారామమూర్తి)

సీ॥ ఉత్తమ వాగి నా నొప్పారె నురక గ
ర్జించి యా కాదు వర్జించి నుడులు
అతిలోక బల సమంచితుఁడయె ఁ గండలు
పెంచి యా కా దలయించి యొడలు
చిర జయశ్రీ ధురంధరుఁడయ్యె రిపుల ఖం
డించియా కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించి యా
కాదు నిష్కామ యోగము వరించి

యతఁడు సామానుఁడెట్లు! వీరత కపూర్వ
వములువోసి వాసి దెచ్చిన మహాతుఁ
డతని నడచిన బాటలయందు నడిచి
పందయును విక్రమాస్పందుఁడయ్యె.

గీ॥ రాజ దండము వలదు స్వర్గంబు వలదు
జనన మరణార్తులంటని జగము వలదు
తెలుపి లేని దిగుళ్లతో దేవురించు
జనులఁదేర్చుట వలయు నాకనియె నతఁడు.

క॥ రాముని సత ము కృష్ణుని
ప్రేమము గౌతముని కరుణ పెనఁగొని యోగి
గ్రామణి బాపూ బ్రతుకై
మామక కవితాలతా సమాశ్రయ మయ్యేన్॥



# గాంధీమహాత్ముడు

(కొడాలి ఆంజనేయులు)

సత్యాన్వేషణ తత్పరత్వమున నీ సర్వస్వమున్ వీడి మా
కత్యంతము ను మేలుకూర్చితి మహాత్మా। నీదు సందేశముల్
నిత్యము న్ స రియించి తా గపదసాన్నిధ్యమ్ములం జేరకే
అత్యాశామృగతృష్ణలంబడుట మా కాశ్చర్యముం గొల్పెడిన్.

మా పూర్వార్జిత పుణ్య హేతువున కామ క్రోధలోభాది దు
ర్వ్యాపారము ల పొంతబోక భవదాజ్ఞాయ త్త స్వాతం త్ర్య దీ
క్షా పారము ను చూడగల్గితిమి నీ సత్యా గ్రహానీకశి
క్షా పాండిత్య మెఱుంగన ట్టి యువ సంసారము నిస్సారమే.

ద్వేషాసూయ లనంగ నెట్టివియొ నీ దివ్య ప్రభావంబు చే
నీ షన్మాత్ర మెఱుంగ రప్డు తన సర్వేందు ప్రభావీచికల్
దోషధ్వాంతము లూడ్చిపెట్టినవి ఈ దుష్కాల మేమోకదా!
కాషాయాంబరధారి సైతము వృథా కాపాట్యమున్ బూనెడిన్.

నీ ప్రేమామృతవాక్య నిర్ఝరఝరీ నితా భిషేకము చే
నీ ప్రాపంచిక భోగభాగ్యములు లెక్కపెట్ట రానాడు, వి
ద్యా ప్రావీణ్యములేని మూకయును దివ్యత్వము చెందెన్ ప్ర
చీ ప్రాచ్యప్రజ సౌఖ మొందె భవదా ర్వాద భాగ్యము నన్.

కారాగారము దివ్యసౌధముగ సంకల్పించి లాఠీ ప్రహా
రారంభము లకున్ శతఘ్నుల కనాయాసము గా ప్రాణముల్
ధారల్వోసిరి భారతావనికి స్వాతంత్ర్యమ్ము చేకూర్పగా
ధీరాగ్రేసర చక్రవర్తులకు సందేశము నీ దెట్టిదో!

ఖాదీ గట్టినవాని పూర్వ చరితుంగా నెంచిరానాడు,
దేదో పాపము చేసినట్లతని నిందింపం గతంబేమి నీ
యాదేశమ్ముల విస రించి పదవీ వ్యామోహబుద్ధిన్ దురా
శాదౌష్ట్యము ల కగ్గమై ప్రభులు లక్ష్య భ్రష్టు లౌటంగదా!

ప్రాయంబంతయు బుచ్చి కల్మని తృణప్రాయంబుగా నెంచి అ
న్యాయత్తంబగు భారతావనికి కల్యాణంబు చేకూర్చుటే
ధ్యేయంబంచు దలంచి రప్పు పుడంధీభూత చేతస్కులై
స్వీయార్థ ప్రతిభావులైరి జనముల్ చిత్తంబు భావింపగన్.

ఊహాపోహాలులేని వట్టి అధికారోన్మత్తులంజేరి, దా
సోహమంచు భజించుటొక్కటియె దేశారాధనంబయ్యె వ్య
ర్థాహంకార దురాగ్రహ గ్రథిత నిత్యావగ్గ సంభాషణల్
సాహితంబయె దీని మించిన కుసంస్కారమ్ము వేఱున్నదే?

నీ పేరెన్నిక నిన్నుతింపక భవన్నిరాణ కారణమ
వా పారము ల నుగ్గంపక యుపనాసము సాగింపగా
నోపం డెవ్వడుగాని స్వేచ్ఛపద కాంక్షోన్మదుతా వారి న్
సోపానంబయె చరిత్రమవురా! శుష్కప్రియాలాపమై.

# శాంతి

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

శాంతి! శాంతి! యటంచునేమో
రంతు లెల్లెడ చెవుల జొచ్చెడు
సంతసింతునొ, కాక-మఱి, యీ
చంద మెఱుగనుగా.

విశ్వశాంతియటంట! ఓహో!
విశ్వమానవ మోక్షమట మఱి
విశ్వసోదర భావమట ఆ
విశ్వమదియేమో?

శ్వేతభూమియె విశ్వమంచును
శ్వేతముఖులే మనుజులంచును
శ్వేతమే సర్వంబనుచు భళి!
చెలగి చాటుదురో?

కాలజాతుల కుత్తుకలపై
కాలుమోపియు నేలమట్టుచు
జాలమైనను యనొల్లని
జాతులే నొక్కొ? శాంతికి
దూత లియ్యెడల!

రెండు ముప్పదికోట్ల తనువులు
ముండ్ల గొలుసుల గాయపడి యు
ద్దండవేదన గొలుప తల్లికి
ఉండునే శాంతి ?

రెండు ముప్పదికోట్ల కడుపులు
దండియాకలి మండుచుండగ
బెండువడి, నిట్టూర్చు తల్లికి
ఉండునే శాంతి?

రెండు ముప్పదికోట్ల నోరులు
చండవృత్తి, బిగించి కట్టియు
చెండనాడగ విశ్వజననికి
ఉండునే శాంతి?

ఒక్క యంగముబట్టి తల్లిని
ముక్క ముక్కగ తరుగుచును వే
రొక్కయంగ మలంకరించిన
చిక్కునే శాంతి?

చాలు చాల్! ఈ, యాగడములు
మేలు మేల్! దయ్యములె నవ్వెదు!
ఏల ఈ వంచనలు? దేవుం
డెదుట లేడొక్కొ?

# స్వాతంత్ర్యం

మూల రచన తమిళం :
సుబ్రహ్మణ్యా భారతి
తెలుగు సేత :
(చల్లా రాధాకృష్ణశర్మ)

ఎప్పుడు రు నీ స్వాతంత్ర్యం దాహం?
ఎప్పుడు మడియు మా అడియరిమోహం?
ఎప్పుడు మాతల్లి సంకెల లూడిపోవు?
ఎప్పుడు మా యిక్కటులన్నీ రిపోవు?

అందరిదీ ఒకే కులము
అందరిదీ ఒకే జాతి
అందరూ భారతీయులు
అందరూ ఈ దేశపు రాజులు

వేదము వెలసిన దేశమిది-మేటి
వీరులు పుట్టినదేశమిది
అఖండ హిందూస్థానమిది-దైవ
మచును పూజింపుము దీనిని పాపా!



# ఉప్పు సత్యాగ్రహము

(గరికపాటి మల్లావధాని)

చం॥ ఉడుగడు మధ్యలో ఫలితమొందక వెండియు నాశ్రమంబు నం
దడుగిడ నియ్యెడన్ విజయమందుటొ నాశవమంబురాశిపై
నెడపక దేలుటో జరుగు నింతయు సత్యమటంచు ధీరుఁడై
కదగెఁ బ్రభుత్వధిక్కృతికి గాంధిమహాత్ముఁడు భారతాంబికా.

ఉ॥ రండిదె యుప్పుచట్టము తిరస్కృతి సేయుఁడటంచు జైత్రపున్
డిండిమ ఘోషణం బెసఁగ డెబ్బది యేడ్వుర దండుతోడ ను
ద్దండిత 'దండి' కేఁగి రిపుతండము లొత్తిలి చూచుచుండ బ్ర
హ్మాండముగాఁ దిరస్కృతి మహాత్ముఁడొనర్చెను భారతాంబికా.

ఉ॥ పాయని వేడ్కమైనపుడు పశ్చిమ గౌతమి మండలంబునన్
జేయని 'యేలురం'దుటుము జేర్చిరి ప్రజ లంతఁ దచ్చమూ
నాయక పట్టభద్రునిఁ బొనర్చిరి మేరుగ రు దండు నా
రాయణరాజ ఖరు నరాతి భయంకరు భారతాంబికా.

ఉ॥ అందముగాగ మోమున జయావహి కుంకుమరేఖ దీర్చి యం
దందు బురాంగనా మణులు హారతు యగ నాత్మకూరి గో
విందసుధీవరుండు తనవెంబడి బాసటనిల్వ సేనకున్
ముందుకు సాగె రాజకులభూషణుఁడమ్మయి భారతాంబికా.

స్వాతంత్ర్యసమరము

చం॥ వెడలెె భవచ్ఛమూతతులు వీర పరాక్రమ ధైర్యశాంతముల్
ము వడ దేవదుందుభులు మ్రోగ విరోధి కదంబకంబు త
ల్లడపడి డిల్లవోవ జటులక్రియ మాటికి నూత్నయోధుల
ల్లైడపక రానుగాది తటినే పెయలాదిని భారతాంబికా.

ఉ॥ స్నాత సమస్త సాధుజన సంచయ పాపవినాశ కృద్వశి
ష్ఠాతటినీ తటాంతర లసన్మహితా శ్రమ నిర్మితంబు లౌ
నాతత శాలల న్విడిసి రయ్యెడ యోధగణమ్ము శత్రు సం
ఘాతము లబ్బురంబును వగంబడి చూడక భారతాంబికా.

ఉ॥ సేనలు తూర్పు తాళ్లకడఁ జేరిన వెన్కను సర్వుతోటలో
స్థానము నేర్పరించుకొని తద్దయు వేడుక మళ్లగట్టి పె
న్మానిక నుప్పుజేసి కొనిపోయి పురంబు సంతలన్ జన
స్థానములందు నమిరి కదా కడుధీరత భారతాంబికా.

ఉ॥ ధీరుడు బాపినీడు గడితేరిన శూరుడు వియ్యనారు డున్
వీరుడు పురుషోత్తముడు విశ్రుత ధీమణి రామచంద్ర రా
వారయ రామకృష్ణ విబుధాగ్రణి జోగయశర కన్న యా
ఖో రుబలుండు మున్ను గలయోధులు గూడిరి భారతాంబికా.

ఉ॥ మాయురె శౌర - ధైర్య విభవ ప్రథితాత్ముఁడు దంతులూరి నా
రాయణ రాజచంద్రుడును త్యాగధనుండగు ముష్టిలక్ష్మి నా
రాయణ కొామ రెడ్డి సుకులాభరణంబన నొప్పు సత్యనా
రాయణ పైడిపాడి కులరత్నము వేంకటశోభ నా
రాయణ సూరిశాస్త్రి ముఖు లర్చన సిరి భారతాంబికా.

ఉ॥ అ ది సామాన ధీరుడును నా శమనాథుడు, సుబ్బరాజు
లాద్రి వదాన ఖరుడు హాస్యవచోనిధి సుబ్బరాజు ని
ర్ణిద్రయశుండు జగ్గనమనీషి బుద్ధుండు ప్రకాశ రాయడున్
మాద్రి మించి నీ పద సమర్చన జేసిరి భారతాంబికా.

చం॥ అలఘుడు రంగశాయి సుగుణాఢ్యుడు ధీరుడు, కృష్ణమూర్తి ని
శ్చలుడగు గంగరాజు నతిసాహసుడౌ నల వీరభద్ర రా
వెలమిని రామమూర్తి ఘను శనివారపు సుబ్బరావు నుం
బొలుపుగ నీ పదాబ్జములఁ బూజలొనర్చిరి భారతాంబికా.

చం॥ బెలుపెసగ ను డుంబ నరసింహా మనీషి నృసింహాశర్మయున్
ములుపురి రంగయార్యుడు ప్రబుద్ధుడు కొవ్వ గోపమంత్రి ని
శ్చలపటు ధైర్యదౌపసలసత్కుల చంద్రుడు కృష్ణమూర్తియుం
జెలువలతోడ నిగ్గొలిచి శిక్షల నొందిరి భారతాంబికా.

ఉ॥ ఎందఱొ శర లున్ మఱియు నెందఱొ వర్మలు గుప్తలెందఱో
యెందఱొ చౌదరుల్ మఱియు నెందఱొ కాపులు రెడ్డులెందఱో
పొందుగ మాతృదేవతకు బూజలొనర్పగ జేరినట్టి యా
యందముచాటె తావక మహత్వ వి షము భారతాంబికా



# ఆగస్టు విప్లవము

("కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రి)

సీ॥ రేచిపోయినవి పోలీసుల టోపీలు
వందలు వేలు రాబందులట్లు
కాలిపోయినవి సర్కారు కచ్చేరులు
ఖరదూషణాదుల కాష్ఠమట్లు
తెగిపోయినవి తంతి తీగెలు భారతీ
యుల పారతంత్ర్య శృంఖలములట్లు
తరలిపోయినవి క్రిందకు రైలుపట్టాలు
పాశ్చాత్య రాజ్య సౌభాగ్యమట్లు

ఒకటి యనుటేమి నాటి మహోద్యమమున
రేగిపోయిన ప్రజల యుద్రేకమునకు
అల్లకల్లోలమై దద్దరిల్లిపోయె
తెల్లదొరల ప్రభుత్వ మందిరములెల్ల॥

ఉ॥ భారత వీర విప్లవ విపంచిక భావి చరిత్ర కారుఁడే
తీరున మేళవించునొ గదే యువ యోద్ధుల వేడి రక్తపుం
జూరలు చూచి యశ్రువులు జారవొ కన్నుల వేడి వేడి వి
ట్టూరుపు లెట్టులాపుకొనునో ఎటులన్ స్వరముంబెకల్చునో

సీ॥ నేరమెంచిన వేళ- రుద్రై వెఱువక
ధీరుడై నిలచిన శూరుడెవడు
జైలు కేగుమటన్న జంకు గొంకును క
వేడ్కమై తరలెడి వీరుడెవడు
ఉరిశిక్ష వైచిన-వెరపించుకయు లేక
ధైర్యమూనినయట్టి ధన్యుడెవడు
మాతృభూమికి ఋణము మన్నన దీర్పగా
ప్రాణమర్పించిన త్యాగి యెవడు

అట్టి సర్దార్భగత్సింగు ననఘుమతిని
రాజగురు శుక దేవుల పూజితులకు
భార యులకున్ దేశభక్తులకును
భక్తినంజలి నిదె సమర్పణము సేతు॥



నాటి నిజాము సంస్థానములో జాతీయవాదిగా పత్రికా రచయితగా పేరొందిన శ్రీ షోయిబుల్లా ఖానును రజాకారు మూకలు హత్యచేసిన సందర్భమున

# 'కన్నీటి కానుక'

(ధవళా శ్రీనివాసరావు)

చీకటి తెరలను చించిన—నీ కలమునె విరిచారా
ఆతతాయి పాలనలో—అందలేక అల్లాడెడు
నిరుపేదల దీన రవళి—వినుపించిన నీ కుత్తుక
రక్కసి మూకలుగూడి—నొక్కివేసిరా షోయాబు
ఎటు జూచిన చీకటులే—పొటమరించు నగరిలోన
వెలుగుజిలుకు నీ బతుకునె—మలిపి వేసిరా తండ్రి!
నీవు చంపబడినావని—భావించము అమృతమూర్తి
సత్యాహింసల నిలువున—హత్య జేసిరని వగతుము
ఆ నిజాము నరకములో—దీన జనుల అసువు లెన్నొ
కానరాక మసియయ్యెను.
అన్నా నీ బలిదానము—మిన్ననె కదలించెనోయి
అదిగో! అదిగో అదిగో!
మానవులకు శాంతి నొసగ-ఆ నరకము నశిస్తుంది?
ఆ పాపము భగ్గురుమని—ఆ లేచేమంటలలో
కాలుచున్న రజ్వీలు—కూలిపోవు నైజాములు
మానవులను ప్రేమించే—మంత్రభిక్ష బెట్టుమనుచు
మోకరిల్లి నీయడుగుల-శోకించుచు నున్నారదె
కంపించే నా హృదయము—కన్నీరే కానుకగా
నీ కొసంగు చున్న దిదే—స్వీకరింపుమా సోదర!

(అది 1946వ సంవత్సరము–భారత శమంతా మతకలహములు, కరువు కాటకాలతో కల్లోలముగానున్న రోజులు)

# ఏమి వ్రాయాలి?

(ధవళా శ్రీనివాసరావు)

ఏమి వ్రాయాలె?
నే నేమి వ్రాయాలె?
నా యింటి నడుమనే
పెనుమంటలే రేగ
నా తము లే విలయ
నాటా లు సేయగా
నా తూన నాడు
బాకులకు బలిగాగ
నాదు చెల్లెండ
మరా ద దోపి సాగ
నా తల్లి గుండియలు
కోతల్లు వడ్డాక ఏమి వ్రాయాలె?
నా నేల కరువులకు
తావలం బైనాక
నాదు ఆకటి డొక్క
బూడకున్నాక

స్వాతంత్ర సమరము

నా సభ్య సంస్కృతులె
నరుకుళ్ళు వడ్డాక
నా నాయకుల రక్తనాళాలు
దెగినాక
నా రాజ సౌధాల
స్వాతంత్ర వీధులే
బారు దీర్చక మొన్నె
కూలిపోనున్నాక
నాదు కోరికలలెల్ల
బూదియై పోయినాక
నేనె నాశన మొంద
బూనుకున్నాక నే నేమి వ్రాయాలె॥



# వీరావేశం

(మల్లాది రామచంద్రశాస్త్రి)

వీరావేశం చెంది నారమిక
వీర విహారం చేస్తాము
పరాధీనతన్ బాపుకొనంగా
ప్రళయ భేరి మ్రోగిస్తాము॥

దేశ ద్రోహుల గుండెలవియగా
సింహ గర్జనం చేస్తాము
దేశ మంతటా దుర్భిక్షమిక
తలెత్తకుండా చూస్తాము॥

తెల్ల వారికిక తొలగి పొండంచు
తెల్లముగా చెప్పేస్తాము
ఢిల్లి కోటను విజయపతాకం
త్వరలో నెలకొల్పేస్తాము॥

ప్రళయ బాంబు విలయము న కేనని
ప్రముఖులచే చెప్పిస్తాము
ప్రపంచ శాంతికి సతా హింసలె
ప్రధానమని చాటిస్తాము॥

స్వాతంత్ర్య సమరము

విశ్వ సోదరత్వము నెలకొల్పగ

వివిధ యత్నములు చేస్తాము

విస్వ మంతకును మహాత్ముడొకడే

విజేత యంచనిపిస్తాము.

వీరావేశం చెందినారమిక

వీర విహారం చేస్తాము

పరాధీనతన్ జాపుకొనంగా

ప్రళయ భేరి మ్రోగిస్తాము॥

# కళ్యాణ కాంతి

(మల్లాది రామచంద్రశాస్త్రి)

సమదృష్టిని వీక్షించేము
సమాదరణ జూపించేము
సమస్త ప్రాణుల నొకే ·తిగా
సంభావనము జేసేము॥

హృదయ మొక యమృతము ఝరిగా
మది నిండిన తేనె వాకగా
సుధా ప్లావితము లౌ వచనము ల
సకల జగతి నలరించేము॥

అనూనమౌ విజ్ఞానముతో
ననన్యమౌ నుత్సాహముతో
ననుపమమౌ ననురాగముతో
న ·ల విశ్వమును సేవించేము॥

అవరోధము ల నతి ·మించి
అవిరోధమ్ముల నైక మొనర్చి
అమర పథము ల నన్వేషించి
విమల చంద్రికల విహరించేము॥

# స్వేచ్ఛాగానము

రాయ వేలూరు జైలు 1931

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

నా తనువు కర్కశోపల నద్ధ కుడ్య
రాజి పరివృతాయః పంజరాంతరమున
శృంఖలాబద్ధమై కృశియించుచుండు;

నా మది విహాయస పథము నధిగమించి
దిక్కుగమి దాటి యశ్రుత ద్వీపములను
నిత్య స్వేచ్ఛా విహారియై నెగడుచుండు.

నా కనులు తారకా కిరణ ప్రసార
మును చొరగరాని గాఢతమోవృతములు;

కాని మహిత దివ్యప్రకాశపుంజ
నవనవోషమై వెల్గు నా హృదయము.

నేను యమభటులంబోని నీచదండ
నాధికారి తిరస్కరణా ఘాత
ముల కనుక్షణమును సిరమొగ్గ వలయు;

ఐన విశ్వజనని కరుణార్ద్ర మధుర
లోల దృఙ్మాలికాజాల లాలితుండ.

కొలిచి దినమును నాకిడు కూడు కుక్క
లైన ముట్టని హేయ పదార్థచయము;

నా రసన చవిచూచెడిది నితాంత
షడ్రసాన్విత మధుర రసాయనము .

నా శిరము క్రూర నిశిత కంటక కిరీట
పరి నిపీడిత మైన [illegible] భరతధాత్రి

తరుణ చరణాబ్జ సంస్పర్శ ధన్యతమము.

నా యొడలు డస్సి క్రుస్సి నానాట శల
శేషమైనను లోన విశిష్ట విమల

దివ్యకాంతి మయామరదేహ మొందు
దినదిన ప్రవర్ధమానమై జరిల్లు.

—x—

# జైలు

("దాశరథి")

ఇది నిదాఘము: ఇందు సహింపరాని
వేడి యేడ్పించుచున్నది: పాడువడిన
గోడలందున జైలులో పాడినాద
వాడిపోనున్న పూమొగ్గ పైనిపాట.

మండుటెండకు క్రాగిన గుండె నెత్రు
బండవారిన మనసులోనుండి జారి
పచ్చ పచ్చని పూ మొగ్గపై నటించి
ఎఱ్ఱవార్చిన దీగ్రీష్మ మేదిపింప.

చల్ల చల్లని వాగులన్ చిల్లుచున్న
తుంపురుల గుంపులో నకాలంపు కన్నె
తాన మాడినదో! రసోద్యానవాటి
వలువ విచ్చుక నృత్యాలు సలిపెనేమొ!

ఈ యెండకాలము లో యెన్ని వర్షాలు
దాగియున్నవో చూడసాగినాను,
ఆ యెడారి పొలాలలో యెన్ని గంగలు
పొంగునోయని చూడబోయినాను.

ఆయాసపడు జైలులో యెన్ని ప్రజల రా
జ ములున్నవోయని యరసినాను,
నిరుపేదవాని నెత్తురు చుక్కలో నెన్ని
విప్లవాలో యని వెద నాను,
నీళ్లలో నిప్పు మాదిరి నిప్పులోన
నీళ్ల మాదిరి. కష్టాల నీడలందు
సుఖము నివసించుసంట, ఉస్సురను వేడి
ఊర్పులోన ప్రళయాలున్న వంట.

ఈ కాలానల లికావితతిలో యేయిల్లు యేవూరు యే
లోకం బాగును ఎందఱెందఱు దరిద్రుల్ చచ్చిరో యేస
శోకం బాకస మంటుచున్నదో; సుతుల్ చట్టాలు చల్లారిరో
నాకు న్నీకు గణింప శక్యమె; దురంత క్రాంతి కాలార్భటుల్.

ఇట వసంతములేదు సహింపరాని
గ్రీష్మ హేమంతకాల కాళికలె గాని
ఇట ఉషస్సులు లేవు; భరింపరాని
అంబునాహసందోహ నిశాళికాని.

వెన్నెలలు లేవు పున్నమ రాత్రి లేదు
పైడి వన్నెల నెలవంక జాడలేదు
చుక్కలే లేవు ఆకాశ శోకపీ
ధూమ ధూమమ్ము, దుఃఖ సంగ్రామభూమి.

కాలదైవజ్ఞు డీజగత్కన్య హస్త
తలము దర్శించి జోతిషము వచించు
"పరుల హింసించువారలు బాగుపడెదు
మాట వట్టిది నాశనమౌట నిజము"

# ఇదిగో దివాలా ప్రభుత్వం

రాజమండ్రి జైలు

(గురజాడ రాఘవశర్మ)

ఇదుగో! దివాలా ప్రభుత్వం
వ్రేళ్ళతో-కదిలి కూలిందిదిగో!
కనుము-దీని సత్వం ॥ఇదిగో॥

అంతులేని మనల-నెంతమందిని బట్టి
గంతులేసి బ్రతుకుతాడు!
త్రావ ముంత సప్లయి చేయలేడు
మల్ల సుంత యివ్వలేని వాడు
తొడుగ బొంత లెన్నియ్య గలాడు
తన పంతము నిల్ప చూస్తాడు
కళ్ళకు గంతలుకట్టి యాడ్తాడు
ప్రజ్ఞ సుంత-దెలియు శక్తి శూన్యము వీనికి ॥ఇదిగో॥

ఎన్నాళ్ళునైచిన సున్న వీడికి జాలి తిన్నగ కూడు నీరీడు
పురుగు లన్నపుముద్ద లిస్తాడు
మేకు లన్నపుముద్దలిస్తాడు
ఉప్పు దన్నపుసుద్దలిస్తాడు

వాస నన్నను మంచిదంటాడు
దీనికి మిన్న లేదట మంచికూడు
జిహ్వ లన్ని కట్టాడు యీ పాడు
కూడు కన్న-నీరే పాన-కము, ప్రాణాధారము ॥ఇదిగో॥

యూనియను జాకు-బూని బ్యాండుమేళం
తోను యూరేగింపు జేసి
జైలు ఖానాలెదుట నిల్వజేసి
మాకు లేనిపోనట్టి రాకాసి
ప్రభువు నేనెయనుచు తిరుగు నిస్సీ
మనము వీని లెక్కగొనము వాసి
యనుచు ప్రాణములను తలపోసి
మొన్న దీన ప్రదర నము-తెచ్చె, మెచ్చెనెవడు ॥ఇదిగో॥

కుళ్ళిపోయిన చచ్చు-కూరలు, ముల్లంగి-
ఉల్లిపాయలు, గలిజేరు-
వంగ పేళ్ళు, చీడతోటకూర
చిరి వేళ్ళు, వెంపాలి, గోంగూర
పెద్ద పల్లెకుడు, బూజుమామిడి
పెంకల్ వెల్లుల్లి, పచ్చి బొప్పాయి
ఉప్పు గల్లు. చిటికెడు-తెల్లకారం
చిన్న పల్లెకుడు– నూరుడు పప్పు
తలప యొళ్ళు ఝల్లని-నీళ్ళుగారు
పుచ్చు నల్లచింతపండు రు
కలిపి నీళ్ళుజేర్చి, యిట్టిసారం
ఇనుప కళ్ళాయిగాచి, యధారు
వుగ నిచ్చు దేవతా పులుసు-యితని శక్తిదెలుసు ॥ఇదిగో॥

---

# ఇందూరు దుర్గము

నిజామాబాద్ సెంట్రల్ జైలు

("దాశరథి")

ఇది చరిత్రాతత కమ్మయిన, ఏ మహదాలయమో; ఇదే మహా
కదనముకోసమై మలచి కట్టిన దుర్గమొ; భారతీయ సం
పదలను కొల్లగొట్టిన నవాబుల గుబ్బలు గుయ-నన్ బదా
బదలయిపోన్ మరాటి భటవర్గము లొత్తిన శంఖపుంఖమో

ఇచట శివాజివాజి యొనరించిన హేషలు నేటికిన్ గుహా
నిచయములందు గాలి పయనించుటతో వినిపించు బేద ని
ర్వచము చేసినారలు ధరాసురవర్గము రాఘవాలయ
పచురతరాంగణము ల ప్రపంచిక మ్రోసిరి సామగానముల్.

నశియించెన్ రఘునాథ యోధుని దివాణముల్; మహారాష్ట్ర వీ
ర శివా గురురామదాస రసనాగ్రవ్యగ్ర మంత్రౌఘముల్
నశియించెన్ రఘురామ దేవళము నాడీ నిజాం రాక్షసీ
నిశితాసిం బడి బందిఖానయయి కన్పించె న్వికారముగా.

ఒక కాలమున యిద్ది దేవళము వేరొక్కప్డు దుర్గంబు నే
డకటా! జైలయి కానుపించెను; భవితవ్య త్కాలమందెట్టి రూ
పకమున్ దాల్చునొ! కాలచక్ర గమన స్వాభావికావర్త క
ల్పకమై దేవళమౌను దుర్గమగు నీ బందీలె పాలింపగన్.

ఇట మరాటీజోదు పటపట కొరి న
పండ్లలో గోల్కొండ గుండ్లు నలిగె,
ఇట మరాటిజోదు చిటిక వేయుటతోనె
ఔరంగజేబు కంగారు పడెను
ఇట మరాటీజోదు కటి బిగించుటతోనె
గగన భూమార్గాలు కట్టువడియె
ఇట మరాటీజోదు గుటక మ్రింగుటలోనె
తురక భూపతుల నెత్తురులు తఱిగె,

ఇట మరాటీలు స్వాతంత్ర్య పటహములను
మ్రోసినారట; రాజ్యాలు చేసినారు
ఇట స్వతంత్ర పతాకాల నెత్తినారు
కత్తిమొనతో దురాత్ములు మొత్తినారు.

ఢిల్లిలో భరతాంబ చేతులకు బేడీల్ వేసి బంధించి, లాల్
ల్లాపై విషదంష్ట్రిబోల్ శశికళల్ గీలించుజండా పటం
బల్లల్లాడ ప్రభుత్వమున్ జరుపునా డౌరంజేబుండు నీ
ఖిల్లామీది శివాజి కేతనము లాగింపగ లేడయ్యె బో!

అల వింధ్యా చలసీమలన్ రణము సేయన్ బోయి యున్నట్టి వీ
రుల గుఱ్ఱము లు దప్పిదీర్చుటకు రాతుల్ రాత్రులేవచ్చి
నులతోనే రఘునాథ సాగరమునన్ తోయము లన్ ద్రావి పి
ట్టలవోలెన్ రణమందు దూకెను మరాటాగుఱ్ఱముల్ గుఱ్ఱముల్.

అతడొక బ్రహ్మచారి, పరమాత్మకు నైక్యతావియో
గతలను గూర్చి చర్చలకు కాలము పుచ్చెడినాడు భార
యత కపకారమున్ జరుగునప్పుడు ఖడ్గముబూని మ్లేచ్ఛులన్
మెతిపె మహామహుండ తనినే రఘునాథుడటండ్రు లోకులున్.

అమితోత్సాహమునన్ బురాతన చరిత్రాంకములన్ జూడ ప
శ్చిమ చాళుక మహాంధ్రతేజము వికాసించెన్ ప్రభాతారుణా
ర మ దివ్యద్యుతిపోలె ఇందుపుర దుర్గద్వారరాల, ఆం
ధ్ర మహారాష్ట్ర నృపాలు రెత్తిరసిధారాపూరమిచ్చోటనే.

# కారాగృహము

(యనమంద్ర కృష్ణారావు)

ఈనాడు తన వృత్తినెటు వీడెద నటంచు
చేదుమేసెడి న్యాయవాదియొకడు

ఈనాడు సీమనూలెట్లు వీడెదనంచు
పరదేశ లాభ తత్పరు డొకండు

ఈనాడు కచ్చేరి నెటువీడెద నటంచు
పరుల సేవయొనర్చు బదుగొకండు

ఈనాడును విరోధ మెటుడింతునని యన్న
పైవా జ మాడెడి వాడొకండు

నేడో రేపోవచ్చు స్వరాజ నిధిని వెఱచి
బిచ్చమింతేని యిడనట్టి వెట్టివారు
చేరలేరమ నిన్ను ని ్చష్టులగుచు
రాజకీయాయుధంబ కారాగృహంబ.

్తి శేషుండైన ్స్తు నిర్బంధించు
ఖ్యా తి యెవ్వరిని ప్రఖ్యా తి పఱచె

స్వచ్ఛందమూర్తి యా జయదేవు ఖండించు
పేర దెవ్వారి పేరుతెచ్చె

వీరహూసేను హసేను హూసేన్ శూరులం దునిమిన
ర్తి ఎవ్వరి సత్కీర్తి గూర్చె
వీరుడైన శివాజి పిచ్చి బంధించిన
యశమదె వ్వారికి యశము పెంచె
క్రౌర్యమునగల్గు పటు నహంకారవృత్తి
బలపఱచు వానికదియె దుర్బలము కాదె
అట్టిపగవారు మననేల ముట్టగలరు
రాజ యాయుధంబ కారాగృహంబ.

## జన్మమదేలా జైలుకుపోని

జన మదేలా జైలుకుపోని ॥జన్మమదేలా॥
ధర ముతోడను-జన భూమికి మన
నిర లత్యాగము నొసగని వాని ॥జన మదేలా॥
నందనందను జన -మందిరమునకేగి
సందియములు వీడి-సంతసింపని వాని ॥జన మదేలా॥
వీరమాతలకు-కారాగార విముక్తులకు
చేరి నమస్కరింప- తులెత్తని వాని॥జన మదేలా జైలుకుపోని॥

# జైలు ప్రబోధము

జైలనగన్ మిగుల సుఖము-వీలుగా నుండుమనకు
వేళకు స్నానాలు-వేడివేడి భోజనాలు  జైలనగన్॥
హెచ్చుపన్ను అచటలేదు-రొచ్చుకంపేలేదు
గచ్చుచేస్ని లోగిళ్ళు-ఘనమైన వాకిళ్ళు  ॥జైలనగన్॥
కంటబడరు ఋణ దాతలు-వెంటరావు దుర్గుణములు
అంటియుందురు డాక్టరులు-జంట బాయరు నౌకర్లు ॥జైలనగన్॥
కరువుభయము కానరాదు-పరభావమనగరాదు
భారమైన ధనముండదు-మారిపోవ వీలుండదు ॥జైలనగన్॥
కూట సాక్ష్యమచట లేదు-కోర్టు ఫీజు లచట లేవు
కష్టమైన పనులులేవు-కష్టములు కానరావు ॥జైలనగన్॥
కృష్ణజన స్థలమునుండ-ఐకమత ము మనకు అండ
శ్రీకింగు జార్జి విందునుండ-శ్రీకరముగ బిళ్ళదండ
॥జైలనగన్॥



# జైలు ప్రబోధము

జైలనగన్ మిగుల సుఖము-వీలుగా నుండుమనకు
వేళకు స్నానాలు-వేడివేడి భోజనాలు జైలనగన్॥
హెచ్చుపన్ను అచటలేదు-రొచ్చుకంపేలేదు
గచ్చుచేస్ని లోగిళ్ళు-ఘనమైన వాకిళ్ళు ॥జైలనగన్॥
కంటబడరు ఋణదాతలు-వెంటరావు దుర్గుణములు
అంటియుందురు డాక్టరులు-జంట బాయరు నౌకర్లు ॥జైలనగన్॥
**కరువుభయము** కానరాదు-పరభావమనగరాదు
**భారమైన** ధనముండదు-**మా**రిపోవ వీలుండదు ॥జైలనగన్॥
**కూట** సాక్ష్యమచట లేదు-కోర్టు ఫీజు లచట లేవు
కష్టమైన పనులులేవు-కష్ట**ము**లు కానరావు ॥జైలనగన్॥
కృష్ణజన స్థల**ము**నుండ-ఐకమత ము **మ**నకు **అం**డ
శ్రీ కింగు జార్జి విందునుండ-శ్రీకర**ము**గ **బి**ళ్ళదండ
॥**జై**లనగన్॥



సందెవడంగ, మము గల సాధనపుం గుహలందు నుంతు, రా
నందముతోడ, వితమునన్‌గల భాగ ములం దలంచి. మే
ముందుము రేల ప్రొద్దుననె యుండెడి యిల్వెదరింతు రందటిన్,
విందొనరింతు మంత సరవిన్ గడతీరిచి నిత్యకృత ముల్.

మేనులు పొంగి పర్వులిడి మి త్రులు కల్పిత వర్షధారలన్
స్నానమొనర్చు వేళనెకసక్కెము లాడెడు వేళ నొండరుల్
బూని పెనంగువేళ తమ పుట్టెమునింగిన యట్టు లా తతన్
స్నాన జలము వేగగొను చందము, నందము, నోలలాడుటల్
కానగగాని, సంతసము కల్గునె యిచ్చటి స్నానఘట్టమున్.

వాల ల్యులబోలె యశ్వద్ధవృక్ష
ముల, సమీపమునన్, ప్రొద్దుపొడుచు తోన
పలువిధంబుల నాసన ప్రకరణముల
యోగ సాధన లిచట, చేయుదురు, మించి.

కొందఱు పర్వులెత్తుదురు, కొందరు బొజ్జల నూపుకొంచు, నీ
బందె౹ బ్రద ణము సలుపన్ జనుచుందురు, కొందరింద్లలో
వందన మాచరింతురు, ప్రభాతములం దినుగూర్చి కష్టమున్
గొందఱు చేతురిట్లు తమకుం దగునట్లు శ ·రవృద్ధి కే
చందమునచ్చునో, యటుల సాధనలన్ బచరింతు రిచ్చటన్.

ఆహా! బారులు దీర్చి, వృక్షముల ఛాయన్, విందుగావించుచున్
స్నేహాం దోశిక నోలలాడుదురు, కంశే! వీరి యానంద మీ
యూహాపోహల కందజాలనిది సద్యోము ్తగాదోచు సం
దేహం - ల! సుఖంబు నుంటిమిట రద్దీరవ్వ కుండగన్.

గంట గంటకు మ్రోగెడి గంట లిచట
కాలమున్ దెల్పు, రేల బగళ్ళ నందు
విశల ప్రతి పావుగంటకున్ నియతి మ్రోగు
చుండు గంటలవేళ విసుంగులేక
వార్డరులు హెచ్చరికల దెల్పంగ విందు,

లాలిత రాజమందిరములన్ బ్రతినిత్యము మేళవించు వై
తాకుల ల్లెపెండ్లియగు తావుల మ్రోగెడి మేళమట్ల బా
కాలను నూదుచుంద్రు ప్రతికార ముగూరిచి యందు నీ యుషః
కాలపు మేలుకొల్పు వినగా సరిగా ప్రతి వి మేల్కొనున్.

కూడుగుడ్డ యొసంగి కాపాడు షరతు
బూని తెచ్చెను మమ్ము ప్రభుత్వమిటకు
జేయుచున్నారలిట రాజసేవ మాకు
నౌకరుల గూర్చి సేవ లొందంగ దినము.

ఉచిత భోజనములు మాకు నుచిత వైద్య
శాలలు గలవు మంగలి చాకలియును
గనవు నూడ్చెడి చౌక నౌకరులు గలరు
కనుమ వీరి మా తోడిదొంగలెయటంచు.

చక్కనౌకార మాకు నొసంగి నార
లద్దెయడుగరు మేముండు నంతవరకు
బుద్ధి పుట్టిన సున్నము బూయ బాగొ
నర్తు యందమైన యొంటరి గృహాలు.

ఎందఱొ పండితుల్ కవు లికెందఱు భోగులు తాగులుండి
బందియ నొక్కరొక్కరు లవంబు నికేరికి దీసిపోవ రా
నందముతోడ వీరి గనినన్ దరిజేరిన బల్కరించినన్
దుందుడు కెల్లమాను పరితోషముగల్గు సువిద యబ్బెడున్॥

—: x :—

# జైలు

(గరికిపాటి మల్లావధాని)

ఉ॥ లెక్కకుఁ బ్రొద్దుటన్ ఫయిలు లేచినవెన్కను గంజి ఫైలు ప్రొ
ద్దెక్కిన పీచుఫైలు మఱియించుక తాళిన ముద్దఫైలు నీ
చక్కని ఫైళ్లలోఁ గొఱతసల్ప ఫిఖిర్లను రాజమండ్రి జై
లక్కటకక్కసంపు నరకాలయ మౌగద భారతాంబికా.

ఉ॥ **ఉప్పుడు**బియ్య మన్నమున నొద్దిక గొట్టిన **ముద్ద**ముద్దతో
**గుప్పు**న నాసికం బగులగొట్టు నసహ్య పుఁ గంపు దిక్కులం
గుప్పుచు నుప్పుకారములు గానని చప్పని పుల్సు నాకటల్
దప్పిన వేళ బెట్టుదురు తల్లి వినంగదె భారతాంబికా.

చం॥ గలిజేరుకాడ దొగ్గలియు గడ్డియు గాదమువైచి రాళ్ల మే
కులు గల కంపుపుల్సు నొక కొంచెము పోయుదురమ్మ ! దేవతా
పులుసట దాని పేరహహా! మోక్షపు పుల్సనరాదె చావుపు
ట్టులు గన రద్ది గుక్కెడు గుటుక్కనఁ ద్రావిన భారతాంబికా

ఉ॥ హృద్యములైన వంటకము లిచ్చటవచ్చునె నీకు సర్వమా
వేద్యముగాదె యీ పులుసు వేసిన యుప్పుడుముద్ద నాటన్
ఖాద ముగావునన్ నిర ఘూర మపాత్రమునైన నీకునై
వేద మొసంగుచుంటి గొనవే నిరసింపక భారతాంబికా.

ఉ॥ ఒక్కయెడం బురాణములు నొక్కెడ సత్కవితా విలాసము
నొక్కడ గావ్య పాఠములు నొక్కెడ హాస్యము లాటపాటలిం
కొక్కెడ నుప్పుబద్దెలు మఱొక్కడ బల్చెడుగుళ్లు నొప్పగా
నిక్కరణిం బ్రిదిం జరిగె నెంతయు హాయిగ భారతాంబికా.

ఉ॥ వేళకు రాదు బోన మొక వేళను వచ్చినఁ గూడ జాలియుం
జాలదు చాలెఁ నియును జక్కగ బక్వముగాదు పక్వమై
గాలిన నుప్పు కారములు గానరావొక యింత యుండినన్
రా లిసుముండి దంతముల రాల్చుచునుండును భారతాంబికా.

ఉ॥ ఫైలుల గోలపోయె దలవాకిట గావలి మాయమాయె స్నా
నాలకు భోజనాలకు నొనర్పఁబడెన్ సదుపాయముల్ విలా
సాలకు పాఠశాలలకు జాలకయుండెను గాల 'మల్లిపూర్'
జైలొక జైలునా జనునె సత్యము చెప్పిన భారతాంబికా.

ఉ॥ వేళకు స్నానపానములు వేడుక లాటలు వారివారికిం
బోలిన విద్యలున్ సభల పొడిమి పెల్లుగ గూర్చు నల్లిపూర్
జైలును గూడ జైలనుట సాహసకృత్య మిదొక్క విశ్వ వి
ద్యాలయమంటకుం దగు యథార్థము జెప్పితి భారతాంబికా.

చం॥ అరవము కన్నడమ్ము మళయాళము నాంగ్లము దెల్గుసంస్కృతం
బురుదును హింది వాంగ్లమును నుత్కలమాదిగ పెక్కుభాషలం
గరచిన మమ్ము నొక్కెడ సుఖంబుగ నుంచుట నేడిదే పర
స్పరమును నేర్చుకోదగిన భాగ్యము నేకురె భారతాంబికా.

ఉ॥ కూళలు త్రాగి రాజభటకోటులు రక్కసులట్లు పొట్టి లా
టీలను బూని త్రుళ్లుచు గడిం దిగనార్చుచుఁ బిన్న పెద్దలన్
స్త్రీలను వారువీరనక తికినందిన వారినెల్లఅన్
జాలియు నాలిలేక పిలుచన్ బడమోదిరి భారతాంబికా.

ఉ॥ వేలకువేలు నీ ప్రజలు పెండ్లికి బోయెడు లీల బుణ్య
ర్థాలకు నేగుకై వడి ముదంబున గన్గొన నాటకా ల్సినీ
మాలకు బోలె "జై" భారతమాతకు "జై" యని వచ్చి నార
జైలుల నింప భక్తివివశత్వము దోపగ భారతాంబికా.

# జైలు

(జోగయ్యశర్మ)

సీ॥ కరము పవిత్రమౌ ఖద్దరు వస్త్రముల్
విడిచిపెట్టితినయ్య వేధమీర
మట్టలాగును గోచి మరి జుబ్బయును టోపి
ధరియించితినిగదా దైన్యవృత్తి
మురిపెంపు ముంగురుల్ మొదలంట గొరిగించి
పిలక బెట్టితినయ్య పీడదోప
వెలగలవస్తువుల్ వీడి సీసపుబిళ్ల
రొము న దాల్చితి రోతపుట్ట.

గీ॥ గోనె చాపొక్కటియు బొచ్చు గొంగ యును
పట్టు పరుపును శాలువై పరగె నాకు
నింక నేనేమి నేయంగ నెంచినావొ
కాచి యుంటిని పొందంగ గాంధిదేవ॥

సీ॥ సన్నని బియ్యము చక్కగావండిన
భోజనంబు మరచిపోయినాను
వంకాయ చిక్కుడు పనస గుమ్మడికాయ
అరటి కూరల మాట మరచినాను

జైలు కడగం

వెలగ చింత దోస వివిధములగునట్టి
మామిడి పచ్చళ్లు మరచినాను
ఉప్పు మొదలగునట్టి యున్నయారు రుచుల
మజ్జిగ నేతులన్ మరచినాను

కళ్లు ఉప్పుడు బియ్యపు కూటిముద్ద
దేవతా పులుసొక్కటే దిక్కునాకు
నింక నేనేమి సేయంగ నెంచినావో
కాచి యుంటిని పొందంగ గాంధిదేవ॥



జైలు కడగం

వెలగ చింత దోస వివిధములగునట్టి
మామిడి పచ్చళ్లు మరచినాను
ఉప్పు మొదలగునట్టి యున్నయారు రుచుల
మజ్జిగ నేతులన్ మరచినాను

కళ్లు ఉప్పుడు బియ్యపు కూటిముద్ద
దేవతా పులుసొక్కటే దిక్కునాకు
నింక నేనేమి సేయంగ నెంచినావొ
కాచి యుంటిని పొందంగ గాంధిదేవ॥



# స్వాతంత్ర భారతి

(జంధ్యాల పాపయ్యశాస్త్రి "కరుణశ్రీ")

'గణగణ' మ్రోగెరా విజయ ఘంటలు భారతమాత మందిరాం
గణమున; ద్వారబంధములఁ గట్టిరి చిత్రవిచిత్ర రత్న తో
రణతతి; వీధివీధుల విరాజిలుచున్నవవే త్రివర్ణ కే
తనములు; మేలుకాంచె పరతంత్ర పరాజిత సుప్త కంఠము..

# దేశభక్తులు

(పురిపండా అప్పలస్వామి)

చిరపరాధీన శృంఖలాచ్ఛేదమునకు
వితసుమాలె ధారవోసితిరి మీరు
కురియదే నేడు స్వర్గీయ కుసుమవృష్టి
( ) విరాజిల్లు మీయోధ శిరములందు.

బాధలే భాగ్యముగ నొడి బట్టజాలు
భారతా శ్రమ తరుణ తాపసులు మీరు
ఏ నిరంకుశులేని బంధింప నిండు
నిగళముల ద్రెంచుకొనెడి సైనికులు మీరు.

స్వార్థలవమేని ని మీత్యాగ గరిమ
పాకిపోయెను ఖండాంతరాల దాటి
ఇది స్వరాజ్య రమానవాభ్యుదయ వేళ
నభమె నినదించె విజయ దుంధుభుల మోత.

# నైవేద్యము

(దువ్వూరి రామిరెడ్డి)

తల్లి, నీయుత్సవముఁ గాంచఁ దరలినార
లనుగుఁ దనయులు నైవేద్య హస్తులగుచు;
ధను లెల్లరు నాత్మోచితంపుఁ గాన్క
లర్పణము సేయవచ్చిరి; యందికోము.
స్వర్ణ సుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీపాద పద్మములకు;
ఏమిలేనట్టి భిక్షుకుండేని నేడు
కంటి క్రొన్నీటి ముత్యాల కాన్కవిడుచు.
పూజ్యులధములు ధనికులు పుట్టు ద
లనెడి యెడలేక యెత్తిరి హారతులను;
భక్తిపరవశులైన యాప్రజలగీతి
దిక్కుదిక్కులయందు బ్రతిధ్వనించు
అమ్మరో! నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండగణము,
త్యాగ పరిశుద్ధమగు నాత్మఁ దొలగిపోవు
కామమటు ధూమరేఖలు గడలుకొనఁగ,
ప్రొద్దు పొడుపున నీ పాదపూజ కొఱకు,
కవిని, తెచ్చితి దోసిటఁ గన్నెపూలు;
బలి వితర్దిక నిరతంబు వెలుగునటుల
హృదయపు సుగంధ దీప మర్పింతు గొనుము.

---

# సేవ

(దువ్వూరి రామిరెడ్డి)

మమ్ముఁగన్న భారతమాత మందిరమున
దివ్వెలై మన ముందామా. | పైడి
దివ్వెలై మన ముందామా.
పరమ పావని తల్లి పాదపూజల వాడు
పువ్వులై మన ముందామా, | పొన్న
పువ్వులై మన ముందామా.
భారతీదేవి విపంచిక రవళించు
తంత్రులై మన ముందామా, | దివ
తంత్రులై మన ముందామా.
జన్మభూమీ శౌర్య సౌరభములు చల్లు
గీతలై మన ముందామా, | భావ
గీతలై మన ముందామా.
కదన వీరులచేతి ఖడ్గ ధారలలోని
మెఱుపులై మన ముందామా, | కాఱు
మెఱుపులై మన ముందామా.

# నా । న్మ ॑హా షిం

(తురగా వెంకటరామయ్య)

౧

నా జన భూమేదిరా

బాపు ।

నాముద్దు తోటేదిరా?

నా కోకిలమే ది, నా పూలమేడేది?

నా రాణి వీణేది, నా వలపు పాటేది.

కలలోని సిరులాయెరా

బాపు

కారడవి పాలై తిరా।

౨

నాయేటి లంకేదిరా

బాపు ।

నాయాల మం దేదిరా।

నామేని పొంగేది, నా మనసు పరు ది

నాగ స్వరమే ది, నాయేల పాటేది?

కాలమిట్లైపోయెరా

బాపు

క ్లరె యేరాయెరా ।

3

ఏనా- కథలాయెరా?

బాపు !

ఈ వమెటు నిల్చెరా?

నా ప్రేమ గెలిచేనా? నాతోట పూనేనా?

నా వీణ మ్రోగేనా? నాపాటే పాడేనా?

నాపాలి ప్రభు వేడిరా!

బాపు

నా కృష్ణుడేమాయెరా?

# దొరవు నీ వయ్యేదవురా

(తురగా వేంకటరామయ్యా)

పరమ శివుడే తండ్రిరా! ఈ
ప్రకృతి సుందరి తల్లిరా!
పాడియావులు పంటపొలములు
భాగ్యములు రాజములురా!

దున్నరా ఈ భరత భూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువులేనీ స్వర్గరాజ్యపు
దొరవు నీవయ్యేదవురా!

కాలమే తలక్రిందుగా
కాలయముడే యేలుకోనీ
నీవు నీ గోవులును శాశ్వత
వులై యుండేరుగదరా దున్నరా॥

పాడునే లేదురా! నీ
భావమే డాయేరా!
పరిమళించే తోట పెంచీ
పరమశివు నాడింపరా! దున్నరా॥

గాలి వెలుగులు జూడరా! మే
ఘాల వర్షము నడుగరా
సూర్య చంద్రుల గమనలీలా
శోభలను దిలకింపరా! దున్నరా॥

ఏటి లంకల మేతమేసీ
పూతగిల్లిన జోడుగిత్తల
పై నాగటి కర్రులో
వాల్ విత్తముండెనౌరా దున్నరా॥

పైరులను గాచేటి సుందరి
ప్రకృతితో వెలిగేనురా! ఆ
మేడలో వర్తించు రాణికే
కూడు గుడ్డలు దూరమగురా! దున్నరా॥

ఆలుమగలూ జోడుగూ-
ఆడుకొంటూ పాడుకొంటూ
వకాంతుల వెలుగు సస్య
ములలో విహరించెదరురా దున్నరా॥

శుభదమగు 'రాట్నంపు' శ్రుతితో
సుందరీమణి పాడుచుంటే
పొంగుతూ ఆడేటి బిడ్డలే
భూములన్నీ యేలెదరురా! దున్నరా॥

కత్తికలములు వ్రాలెరా! నీ
కష్టమే గెలిచేనురా!
ప్రకృతి పురుషుల ప్రతినిధులు మీ
ప్రభుతయే నిత్యమ్మురా ! దున్నరా॥

దున్నరా ఈ భరతభూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువులేని స్వతంత్ర రాజ్యపు
దొరవు నీ వయ్యేదవురా! దున్నరా॥



# దే-మాత కొలువు

(పై డిపాటి సుబ్బరామశాస్త్రి)

ఎత్తం  దివ్విటీలు-ఒత్తండీ శంఖాలు;
కొలువు -ర్చె దేశమాత-కొలువు తీర్చెను.

పత్తనముల, పల్లెలలో-భారతదేశమ ంతా;
అంతులేని ఉత్సాహం-అంతరంగమున పొంగి.

ప్రామినుకుల తోబుట్టువు-ప్రాచీనత అంతటిదీ-
ఆది సృష్టియైన మాత-కంజలింపుడీ.

మల్లెలతో, మొల్లలతో-మటి గులాబి పూవులతో
ఉల్లము రంజిల్ల, పూల-జల్లు పట్టుడీ.

పదునాలుగు బాసలతో-ప్రణవతత్త్వ గీతులతో;
పాడుడీ ఆడుడీ-భార యులూ.

ఎత్తండీ దివ్వటీల-నొత్తండీ శంఖాలను;
కొలువు ర్చె దేశమాత-కొలువు ర్చెను.



# స్వాగతం

(పైడిపాటి సుబ్బరామశాస్త్రి)

స్వాగతమమా స్వాగతమమా!
భారతమాతా! ఓ-భారతమాతా

హాటకము రత్న సిం-హాసనమి దిగో ము
వ్వన్నె వలువతోడ వచ్చి-పున్నెము ల పోవ, నీకు. స్వాగత॥

అర్ఘ్య ము లు, పాద్యము లు-ఆచమనము లు సర్వము
అందుకొనుము తల్లి! నీకు వందనమమా. స్వాగత॥

ఆడెదము పాడెదము-హారతి నెత్తేము నీకు;
ఎనుబది కోటుల చేతుల-నిదిగో, కైకొమా.

స్వాగతమమా -స్వాగతమమా;
భారతమాతా మా- భారతమాతా.



# స్వాతంత్ర్య దినోత్సవము

(శిష్టా వెంకటసుబ్బయ్య)

సీ॥ బహుళ రత్న ప్రభాపటలిచే మిన్నందు
వడకు గుబ్బలి పట్టుగొడుగుగాఁగ
బ్రహ్మపుత్రా భగీరథజాది తటినుల
వరతరంగములు చామరలు గాఁగ
ప్రాచీన దక్షిణ పశ్చిమార్ణోనిధుల్
తళ్కొత్తు నిలువు టద్దములుగాఁగ
అర్ణవాంతర సదా ఘూర్ణమానోర్మి కా
ధ్వానముల్ మంగళ ధ్వనులు గాఁగ

గీ॥ నలుబదియుకోట్ల భార యులును దనకు
అడుగు దాఁటని కూరి బిడ్డలును గాఁగ
డంబు మీఱెడు లంక పీఠంబుగాఁగ
ప్రజల గాపాడు గాత మా భరతమాత

శా॥ కొండాడందగు త్యాగ లురును, వాకోరాని పుణ్యాతులున్
చండాంశు ప్రతిమాన జులును చంచద్భాగ్య భోగ్యేందిరో
ద్దండుల్ వేలకొలంది యెందరొ సుధీ తండంబు లుంకించి, యీ
జండా కోసముగాదె? వీడి రసువుల్ స్వచ్ఛందతా ప్రియన్॥

శా॥ నిండుం ప్రతినిఁ గొత్త పెండ్లికొడుకుం బిండుంబలెన్, భద్ర వే
దండ శ్రేణులపోల్కి, ధీర చరిత స్త్వవ్యాత కుల్ నాయకుల్
గుండె ద్దిసిన బంట్లు, బందిఁగృహులై, ఘోరంబుగాఁ బోరి యీ
జండాకోసము గాదె? వీడి రసువుల్, స్వచ్ఛందతా ప్ర యన్॥

# స్వాతంత్ర్య దినోత్సవము:

("గురుజాడ")

నేడుగా తమమేని నెత్తురులొడ్చి
రాజ్యముని చేకొన్నయట్టి దినము
నేడుగా జగతి బానిసజాతియనుపేరు
పోగొట్టుకొన్నట్టి పుణ్యదినము
నేడుగా యెన్నడు వీడని దాస్య శృంఖలముల ద్రెంచిన ఘన దినము
నేడుగా పరజాతినిన్ ద్రోసిరాజని
యాట గట్టించినయట్టి దినము

నేడుగా దేశమాత పున్నెము ఫలించి
ఖండ ఖండాంతరముల నఖండయశము
బడయు దివ ముహూర్త మీ పర్వమందు
జేరుడి స్వతంత్రభారత వీరులార.

---

# " ్వ ంగస్టు ~"

'ధవళా (్రనివాసరావు'
"సాహి మేఖల"

అమ కడగండ్లన్ని అంతరించాయి
అమ కమ ని రోజులవతరించాయి
మా గాంధిబాబయ్య మంత్రమే మాయమ
చెరబాపి స్వాతంత్ర శిఖరమె క్కించింది.

వెలుగుకై తపియించి విసిగిపోయిన రేయి
అన్నంబునకె అఱ్ఱు లెత్తిచాచిన పూట
గుడ్డకై మర్యాద గోలుపోయిన ఘడియ
ఇనుప సంకెళ్ళ బరువును మోయలేక.

కొనప్రాణములతోడ కొట్టుకొన్న యుగాలు
తలుపులో పలుకులో నడకలో బాటలో
అన్నింట దాస్యము ననుభవించిన కాల
మాగష్టు పదిహేనుతో అంతమైనాది.

మా తల్లి విజ్ఞాన మహిళయై యనిశంబు
తోడి దేశాలలో గూడి తలనెత్తుకొని
గరువంబుతో దిరుగు కాల మేతెంచింది
అమ కడగండ్లన్ని అంతరించాయి.

———

# సుస్వాతంత్రము

("రాయప్రోలు")

ఓ సుస్వతంత్రమా! మోహ మంత్రమా
నీరూపు కనబడేనా! ఎందైన, ఎపుడైన
నీ రేక తేటబడునా! ఓ సుస్వతంత్రమా॥

నీ నామ జపమాల-నిష్ఠతో త్రిప్పితిమి
కంటకపథాలలో-కటిక చీకట్లలో
కక్కసల చెఱలలో, ఓ సుస్వతంత్రమా॥

నీమోము భయ భూత ధూమాగ్ని వలయమో!
కళాణ పాత్రమో! కనక శతపత్రమో!
కనుపించునా మాకు, ఓ సుస్వతంత్రమా॥

నిండి తొణికిసలాడు-నీ భుజాభాండంబు
మము బలిమిలాగేను, మధుర రసమున్నదో!
మరుల విషమున్నదో ఓ సుస్వతంత్రమా॥

నీ కుశల ఖేలనము-నిఖిల సుఖరూపకమో
జగడాల జూదమో! జాతర్లు సలిపేరు
జాతులును రాజ్యాలు ఓ సుస్వతంత్రమా॥

నరుని స్వాతంత్ర్యమై-నారీ స్వతంత్రమై
అర్థ స్వతంత్రమై వ్యక్తి స్వతంత్రమై
తెగునె నీ సూత్రంబు ఓ సుస్వతంత్రమా॥

జన్మహక్కులచిక్కి, స్వార్జితంబుల చీలి
రాజ్యసీమలనిరికి, పూజ్యమగు నీ పొలము
పండునో ఎండునో! సుస్వతంత్రమా॥

స్వకుటుంబ కలహాలు జాతి మత భేదాలు
నీ తలకు చుట్టేరు నీతివేత్తలు నేడు
నిజమో! అబద్ధమో! ఓ సుస్వతంత్రమా॥

పంచభూతములను భాగాలు పంచుకొని,
తెగి స్వతంత్రించితే దిక్కేది!
ఈ లోక ధర్మయాత్రకు తేపు, ఓహో స్వతంత్రమా॥

ంంంంంంంం

# అమర జ్యోతి

(తుమ్మల సీతారామమూర్తి)

సీ॥ యుగయుగమ్ముల భారతోర్వీ తపః పుంజ
మెసరేఁగి జగముల కిడిన పంట
తర తరమ్ములనుండి తరలని దాస మ్ము
కట్లు త్రెంచిన శాంతికదనయోధ్ధ।
నర నరమ్మున వన జో త్స్నగా నహిం
సను సహించిన యోగిసత్తముండు।
పద పదమ్మున సత్యభాషా సనాతన
సౌరభ్యములు చిమ్ము సాధు లుఁ

దహరహమ్మును విశ్వకలా ణలబ్ధి
కొఱకు నాతార్పణ మొనర్చుకొను తపస్వి
కూలె నా దుర తోనా ద కుటిల తంత్ర
జుష్టదుష్టచ్ఛటా మృత్యుముష్టిహతికి.

మ॥ ఒఱగెన్ విశ్వపతాకలెల్ల వసుధావో మంబు లార్తస్వర
స్ఫురణాకంపిత వీధులయ్యె మిహిరాంశుజ్యోతు లేపారినన్
గఱకుం ఁకటులేచి కప్పె దెసలన్ గాకోల కల్పమ్ములై
చరమ స్థానము ఎవునేర జగమే స్తం ంచె యోగీశ్వరా

ఉ॥ పూవుల తెప్పపైఁ గదలిపోయితివా యమునా తరంగిణీ
పావన రాజఘట్టమున భౌతికదేహము గాల్చుకొంటివా
నీ వపురస్థి చందనవనీ శకలము ల బూదియయ్యెనా
బాపురమంచు నీదు చితి పజ్జల శోకము పొంగెనా ప్రభూ!

క॥ మందాకినీ సరిత్కా, ళింది సరస్వతుల నస్థిలేశము కలియన్
హిందూ ముస్లిము క్రైస్తవ, బృందములో నీ మహస్సు పెన
గొన్నదిరా!

సీ॥ అపవర్గ బాంధవం బదికి లౌకిక ధర ,
మాలపించితి నందబాలునట్లు
కను దిక్కు లేక సోలిన మూగ వాల,
మూల్గు మాన్పితి శాక్యముని విధాన।
సతత క్షమా ప్రేమ శరణమై నరదైత్య
కిల్బిషం బోర్చితి క్రీస్తువోలె।
ఆత్మ నిత్యము, దైవమదియొండె-యని ప్రతి
ష్ఠింపఁజాలితి సోక్రటీసు కరణి
బానిసము వ్రేఁగు డించి కింపాకజాతి
కందగా నిల్వఁబడి త బ్రహాము పగిది
నద్భుతంబాయె మనుగడ యందకాక
మృతి వీధిన్ వీరి ననుసరించితె మహాత్మ

మ॥ నిను రామాదులఁజేర్చి మెత్తురది మన్నింపన్ రిపుగ్రీవముల్
రణరంగము నఁగోసి రక్తఝరిలో రామాదులోలాడి రా
పని న్ నీకనులేదుపొత్తు, రిపుతన్ బాధించి విద్వేషి పై
నెనరుం జిమె ద వీవు చిక్కదు ప్రభూ నీ వియోగ మెవ్వానికిన్॥

గీ॥ అనఘ! నీ వీశ్వరుని దూతవగుట విశ్వ
మానవీ మానవుల్ భగవాను పట్ల!
దేట పఱుపని భక్తి నీదెస వెలార్తు
రసలుకంటెను వడ్డి ముందైనయట్లు.

ఉ॥ అంకిలివీడి నిర్భరవయః పరిపాకమునందె యింద్రి యా
హంకృతిఁ దూల్చి పూనితి మహామతులోర్వని బ్రహ్మచర ! మీ
బింకములేని నాఁడు వలపించి జగంబుల నిట్లు నీ
లెంకలఁ జేసికోఁదగవుతే! తెలిసెం గిటుకెల్లఁ గోమటీ!

శా॥ ఆ నాఁడేసు పవిత్ర రక్తమున దాహం బార్చుకొన్నట్టి యూ
దీ నాఁడెందును దిక్కులేని పురుగై యేఁ కారుచున్నాఁడు నీ
వే నీచత్వమునేలెదో మఱియు నేయే హింసలంగూలెదో
దీన త్రాణ పరాయణున్ ఋషివరున్ దిన్నాఁడ వేనఃఖనీ!

ఉ॥ చచ్చిరి దేశభక్తులు విశాంపతు లిద్ధకవుల్ పవక్తలుం
జచ్చిరిగాని మున్నెవని చావునకుం బ్రజలిట్లు క్రుంగిరే
సచ్చరితుండు పోవునెడ సర్వజగంబు లిటుల్ వెలార్చె న
తుచ్ఛతరాదరంబు హృదయోద్గత భక్తియు సానుభూతియున్॥

గీ॥ మనుజుడవుగావు నీవు కోమటివిగావు
బడలిపోయిన భార యుఁడవుగావు
కావు గాంధివి-లోకలోకముల వెల్గుఁ
జూపు నిరవధి కామరజ్యోతివోయి!

—:o:—

# బాపూజీ నిర్యాణము

(“కరుణశ్రీ” జంధ్యాల పాపయ్యశాస్త్రి)

కత్తి కదల్పలేదు! విశిఖాలు విదల్పనులేదు! గాండివం
బెత్తనులేదు! ఏక్రియ జయించితివో నరమాంస పారణో
న్మత్తుల? నీ ప్రభావము లమానుషముల్! భవదీయ శాంతి సం
పత్తికి దోసిలొగ్గెను ప్రపంచము భారతభాగ్యదేవతా!

పుటలా డెబ్బదియైని దేగినవి బాపూజీ వయః కావ్య సం
పుటిలో; పైపుట త్రిప్పులోపలనె మాపున్నెము మిన్నంది ప
స్ఫుట భంగిన్ వినిపించె నేఁటి కిట సంపూర్ణ స్వతంత్ర ప్రజా
పట వీరవిహార విశ్వవిజయ ప్రస్థాన భేరీధ్వనుల్!

‘యుగ పురుషుండ’వంచు ‘పురుషోత్తమమూర్తి’ వటంచు మూర్తిమ
జ్జగ దనురాగ శాంతిమయ సాత్వికశక్తి వటంచు వేనవేల్
మొగముల ప్రస్తుతించెను ప్రమోదముతో జగమెల్ల నిన్ను ఏ
మగుదురు నీకు? తొల్లిటి మహాపురుషుల్ క్రీస్తును బుద్ధదేవుడున్.

కనిపింప దిదియేమి? కనకకాంతులుచిందు
సత్యావతార ప్రశాంత మూర్తి!
వినిపింప దిదియేమి? వీనుల విందుగా-
'రఘుపతి రాఘవ' రామ భజన'
కళదప్పెనేమి? ఏకాలము కళకళ-
లాడుచునుండు బిర్లాలమేడ
తలవంచెనేమి? మిన్నులు ముద్దుగొను
మూడు-రంగుల వీర భారత పతాక!

తడిసిన దిదేమి? కన్నీటి ధారలందు
భరత జనయిత్రి ఖద్దరుపైట చెరగు
ఏమొ పోగొట్టుకొన్నట్టు లేడ్తురేమి?
గోడుగోడున నలుబదికోట్ల ప్రజలు !!!

దివ్యమూర్తి :

విచ్చేయుచున్నాడు విశ్వసౌభ్రాత్రము
సాధించుకొన్న 'దీక్షా తపస్వి'
దయచేయుచున్నాడు! ధర్మమే జయమన్న
కర్తవ్యమును దెల్పు 'కర్మయోగి'
వేంచేయుచున్నాడు!! వీరభారతశక్తి
చాటిచూపిన 'బోసినోటి బాబు'
వచ్చుచున్నాడు నల్వదికోట్ల ప్రజలకు-
మేలుకొలిపిన 'వైతాళికుండు'

దర్శనమొసంగుచున్నాడు! స్వర్గమాత
పతితపావనుడగు 'విశ్వబాంధవుండు'
రండు రండంచు పువ్వుల దండలూని
దేవతలు మింట బారులు తీర్చినారు.

## సర్గీయబాపు :

వీఁడటే! దక్షిణాఫ్రికా ప్రభుత్వంబును
మూడుచెరువులూపిన 'ముసలితాత'
ఇతఁడేనటే జగత్రితయమునకు సత
సందేశమందించు 'శాంతిదూత'
ఈతండటే! ప్రజా స్వాతంత్ర్య రథమును
కదలించు 'విశ్వమంగళ విధాత'
ఈయనే నటే! యూరపీయుల తబ్బిబ్బు-
సలుపు 'సత్యాగ్రహ సమరనేత'

అంచు నీ దివ్యమూర్తి దర్శించు కాంక్ష
పూలదోసిళ్లతో వేల్పు పూవుబోండ్లు
గుములు గూడిరి స్వర్ణ సౌధములమీద
స్వర్గ వీధుల నీతేరు సాగువేళ.

## ధ్రువతారలు :

మండెడు స్వరాజ్య సమరాగ్ని కుండమందు
ఖసమైన గులాబి పుష్పములు మీరు
ఎన్ని కల్పాంతములకేని యింకిపోని
భరతమాత ఆనంద బాష్పములు మీరు.

# మహాత్మా

(శాస్త్రి వెంకటనరసయ్య)

అజ్ఞాన తిమిరార్కోఽయం. అహింసా సత్యపాలకః
అస్పృశ్యతా ప్రతిద్వంద్వీ, మితభాషీ జితేంద్రియ॥
బాపూ , శిష శిక్షార్థం ఉపవాస వ్రతోఽభవత్
తస వాణీం సమాకర్ణ్య, భార జాగృ భువి॥
జనానాం మానసక్షేత్రే, గాంధీఖ్యాత కృషీవలః
నీతి రూపక జాని, చిక్షేప ప్రేమవారిణా॥
రాజఘాటే సమాధిస్థః, నానాపుష్పైర్విరాజితః
భవత యం కర యోగి, సర్వదేశై స్సమాదృతః॥
లోకేఽసి న్ బహుధాకుర్యాత్, గాంధి సిద్ధాంత పాలనమ్
స్వరాజ శుభసంధాతా, మహాతా పాతు శాశ్వతః॥

కనుదోయినుండియుఁ గరుణారసంబూర
చిరునవ్వుమోమునఁ జిందులాడ
వెన్నెల పోగులు వెలుగొంద నవ్వులో-
గాం ర ముద్రయుఁ గానుపింప
మదిలోని ప్రేమాంబుమాధురి పొంగగా
సాత్విక గుణరాశి సందడింప
శర యోగారూఢ కాంక్షలు తళుకొత్త
ధర స్వరూపము తాండవింప

విశ్వమానవ శాంతికై వేడ్కమీఱ
దివ యత్నము సలిపిన దీపితాత!
మార్గదర్శక! కరుణించి మాన తిఁ
మాదు హృదయము లందున మసలు మయ!

---

# ఎవరి పాద చిహ్నములివి?

("దాశరథి")

ఎవరి పాద చిహ్నములివి?
ఎవరి పాద చిహ్నములు?
అతని ప్రతి అడుగు గురుతు
ఆలయమై తలయెత్తును
అతని చేతి గొడుగు క్రింద
అ ిల జగము శయనించును.
దానవులను కరగించిన
మానవు డతడెవ్వడు?
గుండెనొడ్డి తుపా ల
గుండె పగలగొట్టెనతడు
రాటంతో రణశూరుల
ఈ చెల నెదిరించె నతడు.
హిమాలయంకన్న నెత్తు
ఎవడాతం, డెవ్వడు?
ప్రతి మానవ హృదయము న
నొదిగిపోవ జాలునతడు
విశ్వములో ప్రతిప్రాణిని
ప్రేమించగ జాలునతడు.

కత్తికి కన్నీరు గూర్చు
కరుణాకరు డెవ్వడు?
విషమిచ్చినవాని కమృత
చషక మిచ్చె నాతడు
కారాగారము స్వర్గము
గా, మారిచె నాతడు.

తరతరాల మన సంస్కృతి
తానై నిలిచిన దెవ్వడు?
ఓపిక రూపం దిద్దుక
ఉరికివచ్చు నాతనిలో
'శాంతి' శరము బూని
సాగివచ్చు నాతనితో.

మంచి' మరాళము వోలిక
'మసలునెవని మనసులో,
'క్షమ' శిశు శశి నవరేఖా
సదృశమయ్యె నతని శిరసి
'ఔదారం' అతని నుండి
అమర వాహినిగ దూకును.

ఎవని తనువు గతాగతము
లేకమైన యటులతోచు
ఎవని చిన్ని నివాసము
అవనికి శ్రీకైలాసము?
గుండెలలో ఆతడున్న
కొంచెము నే పాపుడి!
కన్నులలో ఆతడున్న
కాస్త నాకు చూపు।

ఎవరి పాద చిహ్నములివి?
ఎవరి పాద చిహ్నములు?

# మ హా త్మా

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

అపుడు సత్యతపము మహాద్భుతముగ
పూచి ఫలియించెనొక్క యపూర్వ ఫలము
భారతులె కాదు, ఆశాంత ప్రజలు హర్ష
మేచి నినుకీటించి ర్తించినారు.

ఇపుడు నీ సత్యదీక్షా ప క్ష సురలె
నీ పరాజిత లజ్జిత నిందితమగు
శిలువ గొట్టిన నెత్తుటి శిరముపైని
నేసలను జల్లి మ్రొక్కి యా ర్వదిం తు.

ఏది జయము? పరాజయమేది? నీకు
మేదిని గలంచు పశుబలోనా ద మెదిరి
దేవునకు ధరు వునకును దేశమునకు
ఆత్మ బలియిచ్చుపూత సతా వహమున,

# మహాత్మా

('కవి పాదుషా' పుష్పాల శేషగిరిరావు)

నీ వాక్యామృత ధారఁ గలిసెన్ నీహారధారాళి, వి
ద్యా వైదగ్ధ్యములందుఁ బాటిన దనంతంబైన సంద్రము, నీ
దౌ వర్చస్సున నమైన దఁటె శాంతజ్యోతి, గాంధీమహా
త్మా! వల్లించెడి భూనభోంతర దిగంతంబుల్ భవన్నామమే!

రులు పొంది సౌరభము తేఱ మెయింగయినేసి ఆత జ
స్ఫార విలోకన పథలు పండిన వెన్నెల తీవలట్లు గాన్
స్వైర విహార సంపదలు పట్టెను భారతమాత నిన్ననే!
నీరము చాళ్ల చెక్కిళుల నించితి వింతనె ఏమయా—ప్రభూ!

సంద్రములు దాటి యేఱులు చక్కఁగడచి
కొల్వ దియు నిలుముందు కొల్వఁబడితి
జగదుపాధ్యాయకుడ వంచు వగతుగాని
జన చరితార్థ మో గాంధి సార్వభౌమ

భార య స్వరాజ్య సంపాదనమున
ముప్పు దెలియక స్వోనూ లమునకె పెరుగు
కదళికా భూరుహమ వైతి గాంధిదేవ!
ఎంత బలిఁగోరె! స్వాతంత్ర్య కాంత నేడు!

రోగమునఁ కి చిక్కి మొఱ్ఱోయటంచు
మంచమునఁ బత్తు యనామక జనము
గాంధి భవాదృశ మృత్యు కథయె వేఱు
వల్లె! మృత వి విప్వి వచ్చువాలు!

కృష్ణుఁడెటులేగె? నా ౹ స్తు మృతియు నెటుల?
అరిగి రెటు సో౹క్రటీసు మహామ దులును?
ఆత బ తప్ప నవతారమందు నేది?
పదయ నోతురె మిము నిర్భాగ్యజనము?

తిలకు కలగనె, దాసు శోషిలుచు బోయె,
లాలఁ ప్రాణమిచ్చె, స్వేచ్ఛాలతాంగి
అదిగొ యి గో యనంగ బోసరిగె, నీవు
ధను డవు, స్వేచ్ఛఁ జూచియే తరలినావు.

జనని కై యాత రక్తమాంసము లోడ్చి
తుదకు బలియైన వీరుఁడా దుఃఖ బాష్ప
సింధువునఁ దోగు మాయూర్పు చెమ లెల్ల
యుష దాత ( ౹బశాంతిలో నోలలార్చు!

—X—

# గాంధీ-అమరగీతి

(జ్ఞానానందకవి)

చివికి జితించు మా హృదయసీమల నీదు ఘృణావినిర లాం
బువులను బోసి చక్కని సముజ్జ్వల పుష్పవనాళిగా నొన
ర్చి, విసుగు దాస కంటకము లిచి కమ్మని దేశమాత సొం
పు విధిగ నిల్పబెట్టిన ప్రబుద్ధ చరిత్ర జోహారులందుకో!

జగతీ చక్రము సన్నుతింపగ, నహింసా ఖడ్గ రాజము గే
ల్దగ మన్నించి పరాయి గర్వముల నిర్దంబోయి, యస్వేచ్ఛ పుం
బొగలం దూలు సవిత్రి భారతి యశంబుందేల రాటాన, నీ
దగు శారీరము ధారవోసితివిగాదా! గాంధిమున్యగ్రణీ!

యమునాధునీ తరంగములపై నసి యాడ
పిల్ల వీచికలెల్ల వెడలువేళ
ఆకాశ మార్గాన నంబుద కన్యలు
హాయిగా యానంబు సేయువేళ
నలుబదికోట్ల బిడ్డల భారతీయుల
కన్నీటి హృదయాలు క్రాగువేళ
నవఖండముల మెప్పు జవిగొన్న భారతి
మురువు కన్నుల రేఖ చెఱగువేళ

విశ్వదేశ వితతి విలపింప ముద్దుల
జహ్వారునుఁబటేలు, జాలఁబొగుల
మము బాసినావు మా పూజ్య బాపు
హృదయ గాయమెటులఁగుదురుతండ్రి

మఱి రావయ్యా వరాలబోసిదొర, నీ మాహాత్మ్య సంపత్తిచే
కలవయ్యెంగద దేశజుల్ తనివికాగం జూఱలాడంగ, నీ
దరహాసామృత మెచ్చటం జిలికితో ధర్మా లాషి యదే
కుటిపింపం గదవయ నేడు భరత క్షోణీస్థలిన్ బాపు !

గంధపుఁగాష్ఠపుం జితిని గాయ మదెప్పుడు భస్మమాయెనో
గాంధిమునీ! భవన హిత క్రమ సదాశయలక్షి నేడు నీ
యంధుని దేశమందున కటా! నశియించునొ లేదొ లేక యా
గంధపు టింధనముల, జగాబడి మ్రగ్గి జితించి కూలునో.

పలుకరించునె దాదభాయి నౌరోజి కాం
గ్రెసు సంస్థ నిరాయి త్రికామి?
మురిసిపోయెనె ముదాంబుధిఁదేలి, లజపతి
రాయండు, భారత నాయకుండు
కౌగిలించెనె నిన్ను గాంచి, మో లాలు
పండితుండు, ప్రమాద భరితుఁడగుచు
కేలుమోడిచినె, గోపాలకృష్ణయ్య, స్వా
ర్థత్యాగి తెనుఁగు రత్నాలమూట

పరవశుఁడాయెనె మా భగవత్తు సింగు
ప్రశుభవచనాల ననెనె సుతామసమితి
యైదుమూర్తుల గావంచయయ గాడు
నేమమా మీకు, నా, స్వర్గసీమలోన॥

కూలిపోయినది, యీ కులమత భేదాల
పోరుకై ఘనవట భూరుహము
రాలిపోయినది, స్వార్థ పరత్వముంగాంచి
పరువు మీరినయట్టి పండుటాకు
ఆరిపోయినది, విద్వ హీనతc జూచి
జరిల్లినయట్టి దివ్య కాంతి
ముంచిపోయినది, యీ ముజ్జగంబులు, శోక
మునదేల, కరము కార్మొగులు బాయ

ఎట్టి శక్తిలోన నే భూతములలోన
నెట్టి యణువులోన నిడుముకొనియె
నా మహాత్మ వమాపరంధాముని
యింత యూపిరకట! యెవటికెఱుక॥

స్వాతంత్ర్య సామ్రాజ్య సమర రంగమునందు
రాటంబుతోడ పోరాడునాడు
'క్విట్టిండియ' యంచు బల్కిన టోసినోట, ము
తాలు వాక్యాలు పొంగారునాడు
హారు నవఖాళీ కర రక్తంపు
ఏరులో తిరిగి దుఃఖించునాడు
శాంతి బాటగ నహింసా కృపాణముబూని
విశ్వము లను భయపెట్టునాడు

ప్రమదమందవె! సీతనూథవుని ఘనత
గాంచి యట్టి మహాత్ముని, గాంధి మహుని
పున్నెములరాశి, యశువుల గొన్న చెడుగు
భారత జాతికి నిజముగా బరువుcజేటు॥

వినుపించునే విశ్వమునుఁదన్ను నవ భా
రత వర్ష నిరా త రమ్యవాక్కు
కనిపించునే! హిందు ఖండ స్వతం త్రయో
ధా గ్రేసరుని మహోద గ్రదృష్టి
రాల్చునే రమణీయ రత్నాలు, ముత్యా లు
భువన వంద్యుని, దొడ్డబోసినోరు
లయవేయునే! హిమాలయ శృంగమునకెక్కి
కండెబొట్టు బిహారి నిండు పిలక

ఖద్దరుధారి గాంధి గావంచ నేర్చునే
దేశభ క్తి యెడద తరలింప
నన్ని కలుగుదాన నన్ను జూడవుగాన
నుడువుమిక బిఠాన కడుము దాన॥

తలలు వంచినవి, నిస్తుల యశోమూ ర్తి గ్రమ
గ్గిన వెంట విజయనికేతనాలు
విలపించినవి మహాతు లవారి ఘోకకు
ఘనత గాంచినయట్టి కవికులాలు
అడుగుబట్టినవి విద్యా ర్థి గుంకుట
క గ్గనాయకుల సదాశయాలు
కుమిలిపోయినవి, నిక్కచ్చిగా స్థాపించు
సమతా ప్రబోధంపు శాసనాలు

చిలుముఁబట్టెను, మా జాతి చిహ్నములకు
వెనుకనున్నట్టి మా జాతి విపుల ర్తి
నిలుచునోలేదో యెవని దెలియుఁదొలుత
నిలుపు వాడల్లి స్వర్గంపు నిలయమేగ॥

మహాత్ముని దివ్యస్మృతి

నూలు పోగున జగజ్జాల వస్యైభంబు
గర్వంబు డించు నఖండమూర్తి
సత్య శౌచక్షమా శాంతిదయాసుధన్
విశ్వాల, జిమ్మిన పెద్దతలిసి
కదురురాటమునఁ బక్కా స్వరాజ్యముఁ దెచ్చు
నొడలు కుంకిన యట్టి బడుగుముసలి
తులలేని యమృత బిందువుల చినుకులు రాల్చు
ననుపమ గుణమూర్తి యమృతమూర్తి

భారత కళావ దాస్య బంధనముల
నూడ దన్నెడు మొనగాడు నేడులేడు
మఱలఁ గన్పింపబోడింక మందుకైన
భావిభారత రథమదే త్రోవజనునొ॥

ఉడుకు నెత్తురు నరముల, నుడుకుచుండ
నలతి స్వాతంత్ర్యమను పెనుమొలక లెడద
నెమి, చిగురొత్త వీరమన్నలరుధిర
ధారలందే యడంగె, స్వాతంత్ర్య రథము॥



# కొత్త స్వర్గము

("పైడిపాటి")

ఎవఁడురా వాఁడు, గుండియలెన్ని వచ్చి
కొట్టెరా! గాంధి గుండెల గుండుదెబ్బ:
ఎవఁడురావాడు! గుండియనేమిచేసి
కొట్టెరా! గాంధి గుండెల గుండుదెబ్బ.

అయయో! చచ్చిన జాతికి నాయువిచ్చి
పరమ ధీరుఁడవై జాతికొఱకుఁజచ్చి
చచ్చి బ్రతి న వాఁడవై శాంతినిచ్చి
సాక్షివై నిల్చినావటే-స్వామి వు.

సంద్రము లై పొంగె జవహరు క న్నరు
వల్లభాయి యెడంద పెళ్లవిటిగె
రాజేంద్రబాబు ధైర్యము టలువాఱె
వగచె రాధాకృష్ణ పం తుండు
డగ్గుత్తి పడెను పట్టాభి గొంతుక బిట్టు
టంగుటూరి గుండెఠావుతప్పె
భారతము న బట్టపగలె చీకటితోచె
తోచె విశ్వము న దోశచుక్క

శాంతి సత్య మహింసయు సాధనముగ
జేసిచేసిన నీ యొడల్ జీర్ణమైన
పాతకమె౦త చేసెరా భరతమాత
కటకటా గాంధి సాధురక్తము గ్రోలిందె॥

తొలి కవాటము నను బలకరించును నిన్ను
'బాల గంగాధర' పండితుండు
మలి కవాటముగ పువ్వులు మంకెనల్ వట్టుc
జల్లుగా నీమీద 'ఝాన్సిరాణి'
'జై హిందు'తో నమస్కారము లర్పించు
సైన్యముతో సుభాశ్చంద్రబోసు
సింహాసనము నను జేర్చి యర్ఘ్యంబిచ్చుc
గ్రొత్త దేవేంద్రుc అల్లూరిరాజు.

సరస జేరిన సిద్ధార్థ శాక్య యోగి
తాను చెప్పని భక్తి తత్వము జెప్పి
జాతి నడిపించినావని సంతసించు
స్వర్గరాజ్యము నీవేగు సమయమందు॥

వడుకు నీకయి నూలు పిడుల భంభరవేణి
రాట్నము -రంభ విరామవేళ:
నులివెచ్చజేసి దొప్పలc దెచ్చియందిచ్చు
మేనక ము ప్పొద్దు మేకపాల
నొలిచి భద్రముచేసి, యూర్వశి తినబెట్టు
జాయcదేరిన వేఱు శనగపప్పు
రామభక్తుcడు దగ్గిరాల గోపాలుండు
పనిపెట్టుకొని 'రామధునుల' వినుచు

మన రవీంద్రుcడు 'జనగణమన'ని పాడు
జాతి వాసించు సరిక్రొత్త స్వర్గసీమ
బోసినవ్వుల వెలుcగుల దూసివోసి
తలcచు కొనుచుందు నవభారత ప్రశస్తి॥

# ఏడవకు ఏడవకు నా చిట్టిపాపా

(కొప్పరపు సుబ్బారావు)

తొలికోడి కూసింది
తెల తెల వారింది
ఏడవకు! ఏడవకు, నా చిట్టిపాపా,
ఇప్పుడే వస్తాడు-నీ గాంధిబాబా ॥ఏడవకు॥

యమునమ తల్లికి
ఏ బాధ కలిగిందొ
కన్నీళ్లు పెట్టుకొని
కబురు పంపించింది॥
కబురందుకొన్నాడు
కదలితా వెళ్లాడు
తెల్లవారేలోన
తిరిగొ స్తనన్నాడు॥
పంటపండించేటి
పాలేళ్ల కడుపులు
గుంటపడి వీపులకు

అంటుకొని వుండంగ॥
తనపొట్ట పెంచుకొని
తనివి సెందాడంట
తనబాగు చూచుకొని
తనిసి పోయాడంట
ఆ స్వామి పేరు.
మరచిపోయానమ ॥
రైలులో వెళ్లతా
యమునమ కడుపులో
రాగిడబ్బులు కొన్ని
వెదజల్లినాడంట

తిండి గింజల్లేక
దేశ మల్లాడంగ
దండిగా కొట్లలో
ధాన్యాలు నిలవుంచి
పేదసాదలనోట
బెడ్డకొట్టాడంట
దొంగచాటుగ డబ్బు
దోచుకొన్నాడంట
ఆసామి పేరు నే
మరచి పోయానమ
ఎడులక్షలు పెట్టి
యమునమ్మ వొడ్డుపై
కట్టుతున్నారంట
గంగాధరుగుడి

కోడి కనుమూసింది
ప్రొద్దు కనుతెరిచింది
వెక్కి ఏడవకమ నాచిట్టిపాపా!
వేళాయె, వస్తాడు-నీ గాంధీబాబా॥

# విప్లవం

("పూర్ణానంద్")

భారతదేశం
మహావెలుగు
మహాత్ముని
మరణం
కదిపివేసింది
మానవహృదయం
కంపించిందోయి
భూవలయం
గర్జిల్లిందోయి
భూనభోంతరాళం
కుంగిందోయి
హిమాలయం
కృశించిందోయి
మహోదధీ
మహాత్ముని
మరణం
మాపరాని

మతోన్మాదుల
మారణహోమం
వచ్చిందోయి
మహాత్ముని
మరణంతో
మరుగున్న
మతోన్మాదపు
మహావిప్లవం
వచ్చిందోయ్
మనస్సులేని
మనుజుడొకడు
మతోన్మాదపు
మహాజ్వాలతో
మరాతియొకడు
మహాత్ముని
మరపించెర
మహాత్ముని

మహాత్ముని దివ్యస్మృతి

మహోదాశయ
మంతరించునని
మంతనించె
మతోన్నాదపు
మరాతియొకడు
మూరుమూలల
మతోన్నాదపు
మహాద్వేష
మంతరింపక
మహాత్ముల
మడియించుటకు
మహాజ్వాలలు
మందనంబునకు
నెగయుచుండెర
మత సామరసం

నిలబెట్టంగా
పిన్నలు పెద్దలు
ప్రజలు నాయకులు
కట్టండోయ్
మతానాదుల
మహా విషంబును
వారించుటకై
కంకణం
మహాత్ముని
మానవ సేవయె
మాధవసేవగ
మహితను
మరువకోయి
సత్యాహింసల

వీడకోయి॥



# అ శు ధా ర

("పూర్వాశా ద్ర")

ఓ భారతభాగ-విధాతా
శోభాయుత  ర్తి సమేతా
చాలించితివా అవతారం
సైరింపుము మా అపచారం

సకల భువన సంపూజితమూ ర్తీ
సకలలోక సంఘోషిత  ర్తీ
నీ మాటలె మం త్రచయంబై
మౌనమె వింతభయంబై
విలసిల్లెను-ఆత లలోన.

నీ నగవున అమృతము పుట్టి
నీ చూపున హింసలుగిట్టి
నీ యాత మహ త్తరశ క్తికి
నిక్కృష్టులే మరలిరి భ క్తికి

ఓహో! భోగ విరాగి! యో ,
ఓహో! సౌఖా ంబర త్యాగి
ఓహో! సతా హింస స్వరూపా
 ో! మతకుల కక్ష ప్ర పా

ఓహో! భారతజాతి ప్రతాపా
హో! భారతదేశ ప్రదీపా
మనికితనమున మము ల ముంచి
చనినావా! దివికామించి॥
శోభాయుత కీర్తి సమేతా
భారత భాగ్య విధాతా
సర్వలోక సంఘోషిత కీర్తి
సకల భువన సంపూజితమూర్తి
చనినావా! దివికామించి
మనికితనమున మము ల ముంచి

卐

# ౕవే పభువు-బాపూజి

(రామమూ ర్తి)

క్రారడవుల
కలల కావరములో
మరణించిన-గాంధీ
నీ అమృత వాహినులెక్కడ?

ఆశలు నిరాశలై
అస్తమించిన-గాంధీ
నీ చల్లని చిరునవ్వులెక్కడ?

మదించిన మతోనా దికి
బలియయిన బాపూజీ
నీ మత సామరస్యం యెక్కడ?

ప్రజ గహించి
దే ఖడ్గం తమ
నాయక హృదయం
చీల్చిందో?

ఏలోకానవున్నా
కురిపించు బాపూ
నీ చిరునగవు

హంతకులను హతమార్చి
నీ ఆశయాలగద్దెకు పజ
కదిలింది గాంధీ -

ఏలోకానవున్నా
నీవే పభువు-బాపూ

# బాపూజీ

(చంద్రన్)

మహాత్మాగాంధి
మాతండ్రి. ఏడంచు
దిక్కుదిక్కులగాంచు
పిచ్చి భారత ప్రజలు

ఆరె మా వెలుగంచు
భగ్న హృదయాల్ తోడ
బ్రతుకు బ్రతుకంతయును
విశ్వమంతా వెలుగు
వెలలేని చిరునవ్వు॥

అదృశ మాయెరా
అంతలోనేడు
మూర్ఖభారతావనీ!
ఓ! మతోనాదినీ
మంటగలిపితివాహా!
మన ప్రతిష్ఠను నేడు

మృతినొంది యమరుడై
దారి చూపెను తండ్రి
ఏ లక్ష్యసిద్ధికై
ప్రాణమును బాసెనో

ఆలక్ష్యమును మనము
సాధించి రాలి
ఆ శాంతి బాటన్
అడుగు యాలి

ఆనాడె మనజాతి
గౌరవము, స్నేహితుఁడ
ఆరోజె, మన ప్రతిష్ఠ
మరల నిలపెదమోయి.

—: x :—

# ఆవేదన

(రంగాచార్య)

కరుణాజలధులు పొరల హృదయం
సతా హింసలు చాటే గుండె
శాంతి బోధనలు-సలిపే గొంతుక
సౌహార్ద్రము వెద జల్లే మనసు
విడిపోయినదీ విశ్వ భారతిని
విడిపించినదీ విపదంబుధిలో

భౌతిక శక్తుల బలము గూర్చుకొని
ఆధాత్మిక శిఖరాగ్ర మందు వాని
సర్వస్వము దేశాన కొసంగిన
పురుషోత్తముడగు పుణ్యాత్మునిపై
పేలిపోయినవి పిస్తలు గుండ్లు
రాలిపోయినది రత్న రాజము॥

దాస కూపమున మూల్గే జగతిని
స్వేచ్ఛాపదముల బట్టించిన యొక
జాతిపితామహు చంపు కొనుటకా
జాయుని మది సమ్మతించెనన

తలలెత్తుక నిక మెలగంగలమా
ముందడుగిదియని మురియంగలమా॥

కత్తులు మెరసే క్షేత్రములందు
చిత్తముమారే విత్తుల జల్లిన
భారత స్వేచ్ఛా వీరహాలికుని
తూరమతాగ్నులు కోరి దాకినవి

బంగరు పంటల రంగుమారునో
భస్మీపటలమె ప్రాప్తంబగునో!

మన సఖ్యతకై వెతబడు విని
మత పిచ్చయె హతమార్చిననాడు
మతము కోసమొక మానవోత్తముని
మారణ హోమం జరిపిననాడు

జాతి మతాల చర్చలేటికి
నీతి నియమముల నిర్ణయమేటి ॥

ఏ మత సఖ్యతకై తపియించెనో
ఏ మత పిచ్చకుగా మరణించెనో
ఆ మత సఖ త సాధించేందుకు
ఆ మహాత్తుని ఆశయ సిద్ధికి

కట్టుండయ్యా దీక్షాసూత్రం
సలుపండయా శపథ ప్రార్థన॥

—:o:—

# సత్యస్మృతి
('గురజాడ')

మన సార మన బంధుఁడు
మన హితుఁడున్ మనగురుఁడు, మన నాయకుఁడున్
మనభారత సేవకుఁడున్
మనగాంధి భానుడస్తమయమున్ గనగా॥
ఎట్టి సముద్రఘోషయిది, యీ యమునది ఘోషనద్దెసల్
చుట్టి భయంకరంబగు శోకమహాంబుధిగా దెరల్చె, నె
ప్పట్టున గుండియల్ పగుల వారలిటుల్ మన భారతాతాంబ, క
న్నట్టి మహాతుఁడల్లదిగొ యస్తమయంబగుటన్ గదా!యిటుల్
"కట్టా యెట్టి దురంతకారము, వినంగా సిగ్గగున్ మాకె, హా
పొట్టన్ బెట్టుకొనంగ జాలిరి, మహాత్మున్ భారతీయుల్, మనం
బెట్టాశించెనొ యిట్టి దుష్కృతికటం" బింకెంట దేశాల దూ
పట్టన్ మేము శిరమ్ము లెత్తుకొని,యెబ్భంగిన్ మనం జాలనౌన్॥

మూగవాడేయననౌ 'గాంధి' యంచు
రెండక్షరంబులు పల్కనట్టివాడు
గుడ్డివాడగు గాంధి రూపంబుఁగనకున్న
యతని పటముఁ జూడనట్టివాడు
బధిరుఁడగును, గాంధి పల్కు స్వయముగా
వినకున్న యంత్రాన విననివాడు
హృదయమ్ములేని వాడేయగు, గాంధి
మాహాత్మ్యముఁ దెలియలేనట్టివాడు

భార ీయుడు, కాడింకవాడు, గాంధి
పుట్టినది, నేనుపుట్టిన పుణ్యభూమి
భరత ఖండమేయని, గర్వపడని వాడు
మిగిలె నీ తృప్తి ువు లేమిని, మహాత్మా!

ఎంతయో మంచివాడవు కదే మొన మొన్న వధింపజొచ్చు నీ
హంతకు ప్రాణముల్ మరల నాతనికిచ్చిన పుణ్యమూర్తి ని
న్నెంతగ లోకమెన్ను కొననీ వచియించెద సత్యమిందు, నిం
కింతకు, నీదు మంచితనమే, విషమై, మరిమృత్యువాయెగా॥

ఆ యమునానదీ తటము నందున హాయిగా బవ్వళింపగా
బోయితివే సమస్త జనముల్ విలపింపగ, వీరివీడగా
న్యాయమె యెంతగా విలచినన్ మరిరావు కదయ్య యశః
కాయము సంచరింపగ, జగము నజేరితె, 'రాము' సన్నిధిన్.

వసివాడ లేదింక స్వాతంత్ర్య విజయోత్స
వారంభనవ పుష్పతోరణము
ఆరిపోలేదింక నూరూర వెల్గిన
స్వాతంత్ర మంగళా భంగ స్తి
మరపురాలేదింక పురుషార్థ పాతనాం
తరలభ్య ప్రవిమల తా గబుద్ధి
సమసిపోలేదింక సల్పిన సత్య దీ
క్షాబద్ధమౌ నహింసావ్రతము

ఈయ దింక విడదీసి యెవరి వారి
రాజ ములు పంచి రామ రాజ్యముగను
ఔర! ఫలభు మాకెల్ల చూఱవిడచి
చల్లగా జారినా వనాసక్తయోగి.

# నీ చేతులెట్లాడెరా

("గురుజాడ")

నీ చేతు లెట్లాడెరా!! మన గాంధి_నిన్ జంప మనసొచ్చెరా!
నీచ! నీచే, జాతికి, ఆరని-నిందకొాడి గట్టితివిరా ॥నీచేతు॥
ఇట్టివాడింతవరకు–జగతిలో-పుట్టనేలేదు, కదరా!
పుట్టేమి, మున్గినదిరా! గాంధిని- పొట్టను బెట్టుకొనగ ॥నీ॥
నేల బాకే చీమకైన-పైన-నింగి నెగిరే, పక్షికైన
నీటగదిలే, ప్రాణికైన,దలప-నేరడీ చెఱు, పెన్నడైన ॥ ॥
ఈశుడని, బుద్ధుడని-యేసు క్రీస్తే, యని
దేశదేశాలవారు-దర్శించి- ర్థమై, కూడినారే॥ ॥నీ॥
తిట్టిన, తిట్టడెపుడు-మరల-నిన్ దీవించి, పంపు గదరా
నిన్ గొట్టిన, గొట్టడకట! వైరులకు-కోట్లధనము, గుప్పెరా॥నీ॥
కట్టబట్టలేని, జాతి-మానము -కాపాడి-రక్షించెరా
కడజాతి, వానినైన-తండ్రిగా-కౌగలించు, కొనియెరా ॥నీ
ఊయిరా నీ గుండె-చంపితివి-రాజ మిచ్చిన తండినే!
హాయిగా, ననుభవింప-గా, లేక-పోయితివి, మాతృద్రోహి॥
నీ చేతు లెట్లాడెరా।

# బాపుజీ

( మద్దోజు సత్యనారాయణ)

జీవితమంతయున్ ప్రజల క్షేమముకై, కృశియింప, సత్యమౌ
త్రోవ నహింస ధర్మములతో దయనించిన బాపు ! భవ
జ్జీవము దైవ సన్నిధికి జేర్చిన 'జన్వరి ముప్పదిన్' విషా
దావృత మానసాబ్జముల దండలు గుచ్చితి మందుకొమ్మి కన్.

ఓయని యేడ్చె భారతి, మహోన్నత ౦త నగంబునుండి, గం
గా, యమునా ఘధారల మొగంబును కన్నులువాయ బాపు-
పోయెనటన్న వార్తవిని బుద్ధినిగన్న పవిత్ర భూమికిన్
పాయని మచ్చ దెచ్చిన యభాగ్యు డెవండని వంత గుందుచున్.

జిన దేవుండును, క్రీస్తు బుద్ధుడును భ్రాజిష్ణుల్ తదంతరు ౦
బున దీపించెడి దివ్యమూర్తి విలసత్పుణ్యంపు వారాశి శాం
తిని నిర్మించిన ధాత, భారతధరిత్రీ మాతృ సౌజన్య తా
జనితున్ గాంధిని, యల్పు డొక్కరుడునై జంపంగ తాజచ్చెనే!

చావగ లేదు లేదు- ఋషిసత్తము డాతడు విశ్వమానవ
ప్రవిభవా రామముగ స్వీయ గళంబున దివ్యవాణిలో
పావనమైన సూక్తులు, సుభాషితమున్ వినుపించుచుండె ఓ
కావున జచ్చునే యుగయుగాల తరాల తరాల వారి న్.

కరవాలంబును చేతబట్టవు బృహద్గాండీవమా లేదు. సం
గర రంగంబున కక్కరైనది, తురంగం బొందునున్ లేదు, యే
సరణిన్ వ్యూహములల్లి గెల్చితివొ నీ సత్యాగ్రహస్ఫూర్తిచే
పరదాస్యానల తప్త భారతమహీ బంధంబు తెల్లింపగన్.

అస్పృశ్యతా పిశాచాళి బట్టిన పిచ్చి
మనుజుల రోగముల్, మాన్పె నతడు
కరకు కత్తుల గుండెకాయ నెత్తురు దీయు
కఠినాత్ముల కహింస గఱపెనతడు
నిరుపేద ప్రజ నహర్నిశలు సేవించుచు
ఆర్తిమై జూచె మహాత్ము డతడు
క్రూరాహి మతముల కోరలు దీయించి
కాంగ్రెసు మతమున గలిపె నతడు

అతడు స్వాతంత్ర్య సమర సన్నాహమందు
రాట్నంపు జక్రమున, తెల్లరాజు గెలిచె
ఒక్క నూలుపోగునగట్టి, యుదధికవల
బారవైచెను, గాంధి సమ్రాట్టతండు.

ఇరువదైదు శతాబ్దముల్ యేగు పిదప
బుద్ధ దేవాకృతిని బొంది పుట్టె గాంధి
యిఱువదైదు శతాబ్దము లరిగి కూడ
పుట్టునో! లేదొ! మనగాంధి బోలుతపసి॥

స్వారాజ్యమునకునై పోరాటమున విశ
మించుటలేని శ్రామికము వాడు
తన భుక్తమునకుగా, 'తకిలి' తీసిన నూలు
పై వచ్చు విలువతో బతుకువాడు

బిచ్చగానిని లక్షలిచ్చు వానిని గాని
కనిసమము_గ వెలగట్టువాడు
దాస విము_్తకై తపియించి తపియించి
యుపవాసముల జిక్కి_యున్నవాని

లేడు, మనకింక లేడి, కేనాడురాడు
వచ్చిపో విట్టులే, ప్రతివత్సరమున
మనదు సంస్కా_రమును గాంచి, మందలించి
బోసినవ్వులు గురిపించి పోవు కొరకు,

కేలంబూనిన పట్టుగఱ్ఱ. మొలకున్ గీలించు 'వాచీ'యు, మో
కాలుం దాటని కట్టుపంచె, పయిపై ఖద్దర్దొ చేలమున్
కాలం జెప్పులు, కంటియద్దములునున్ గాసించు కాల్నడకా_తో
ంలన్ వచ్చెను చూచువాడడుగొ! ఢిల్లి రాజ్యాదైవె ష్యముల్.

# పరంజ్యోతి

(మానేపల్లి సంగమేశ్వరకవి)

ధర పరంజ్యోతి, ప్రేమైక దామమహాతి
సృష్టి ముద్దాడు చక్కని జీవమూర్తి
శాంతివిస్ఫార చంద్రికా చక్రవర్తి
యైన మన బాపు స్వర్గాన కతిథియయ్యె॥

భువనాలు కవనాలు పొంగి పొర్లెడువేళ
అవని ధేనువు లిండ్ల కరుగువేళ
పశ్చిమాంగన కెంపు పటిమ దీర్చెడువేళ
సత దీపిక దిగజారువేళ
భువి పవిత్రత నోష్ఠబొట్టు దిద్దెడువేళ
గోవత్సములు చన్ను గుడుచువేళ
కష్టవుల యాత్ర కరిగిపోయెడువేళ
అష్టదిక్కులు తెల్వి యాడువేళ

రాట్నమందలి ఓంకార రమ్యగీతి
నరుల హృదయాంతరంబున, మెఱయుజ్యోతి
పుడమి నవతారమూర్తి యా బుద్ధమూర్తి
యైన, మన బాపు, స్వర్గాన కతిథియయె॥

యమునా తరంగిణీ యశ్రుధారావ
పొంగి నింగిని, మారు మ్రోత ిువె
గోమాత కన్నీరు ఘూర్ణిత ఘనఘనా
సంజాత పానీయ జలధులయె
అపరంజి సంధ్యలో నరమోడ్చు ముని చేతి
జపమాల నేలపై జారిపడియె
మహిని సీమంతినీ మాంగల్యరక్షిత
కుంకుమ మంతలో కూలిపోయె

బోసినవ్వుల వెన్నెల బొలుచు రథము
శాంతి సత్య మహింసయే శాంతి సుమము
భక్తి విజ్ఞాన భారతభాగ్య ఫలము
కల్ప వృక్షము భువిపైన కూలిపోయె॥



# అమరజీవి బాపూజి

(వేముగంటి నరసింహాచార్యులు)

ఏడీ మా గుజరాతి వైశ్యముని, నేడేమాయె గన్పింపఁడా
రాడా మము లఁజూడఁడా దయదలిర్పన్ శాంతి సందేశ మిం
డా చక్కని బోసినోటఁ జిరునవ్వేచిందఁడా అక్కటా
మోడుల్ వారెనుతద్వియోగమున బెంపున్బాసి మా చిత్తముల్.

నిగనిగల్ దళుకొత్తు నెమ్మేని శోభల
బందీ గృహంబుల పాలొనర్చి
ఉడుకు రక్తము పొంగి యుబుకు సత్త్వంబెల్ల
భారత సేవకు ధారవోసి
తూగుటుయ్యేలఁ దులఁదూగించు భాగముల్
కొల్లాయి గుడ్డకు గుదువబెట్టి
మకరందమూరు కమ్మని వాగ్బలం బుప
న్యాస పీఠంబుల కప్పగించి

తుదకు బాణంబులైదు పిస్తోలుగుండు
దెబ్బలకు నర్పణముజేసి, దివికిబోతె!
సురకులాధీశ్వరుడు నిన్ను జూఁడ గోరి
పిలువనంపెనో బాపూ! విమల చరిత॥

సంచరింతువె! నిత్యంబు సంబరమున
నందనోద్యాన దివ- వనంబులోన
స్వర్గ సుఖడోల నూగుచు భరతసుతుల
మరువబోకుమా! మహాత్మా! మునీంద్ర

నూరేండ్ల యినను నిండలేదపుడె, నిన్నున్ స్వర్గమున్ జేర్పఁగా
నే తిన్ మన సొప్పెనో అకట బ్రాహ్మి భర్తకున్ నిన్నుబోల్
ధీర గ్రామణియైన నాయకుఁడు, ధాత్రిన్ గల్గునే యింక, గాం
ధీ రక్తాశ్రులు జిమ్మె లోకములు నీ నిర్యాణమున్ జూచియున్॥



# అశ్రుతర్పణము

(గరికపాటి మల్లావధాని)

అశని పాతంబొ భూకంపమయ్యె నొక్కొ
అగ్ని పర్వతమే బ్రద్దలగుట నిజమొ
ఆకసము కూలెనో సమస్తాబ్ధిచయము
పొంగెనో లేక, లోకమే క్రుంగెనేమొ.

హృదయ విదారకంబయిన, యాకటు దారుణ ఘోరవార్తకున్
మది, కలగెన్, వచించుటకు మాటలు వెల్వడ జాలవయె. గ
ద్గదిక యొసంగె గాత్రముల గాలువు గంపము విస్తరిల్లె, న
య్యది యెదియో, యొకానొక మహాప్రళయంబుగదోచెనక్కటా!

గాంధి మరణించెననుమాట కర్కశంబు
కష్ట దుర్వాచకం, బమంగళముగాఁగ
దోచి యదివల్కు వాడొక దుష్టుడంచు
వానిపై నాగ్రహావేశభావ మొదలె॥

అయయో నేడు, మహాత్ముడే, ధరణిలేడా!యింక దిక్కేది, సం
శ్రయమే పోయెనె, ధర్మమార్గమునకు సత ంబు, శాంతంబునున్
దయయు న్నిల్వఁగవీడిపోయెనె ప్రశస్తంబౌ నహింసాధ్వమున్
వ్యయమైపోవునె లోకమాతయు, క్షయంబై పోవుటే,నిక్కమా.

అరియే లేని యజాత శత్రునకు నీకా, యీ యవ్యాజంపు, దు
ర్మరణం బయ్యది కూడ స్వీయకృతమా మాకింక నే తిగా
శిరముల్నల్గురిలోన నెత్తికొనఁగాఁ జెల్లున్ మహాత్మా! మమున్
దరిజేర్పన్ భవదాత్మయే తరణికాదా యిట్టి కష్టాబ్ధికిన్॥

# గాంధీస్మృతి

(కొగంటి దుర్గా మల్లికార్జునరావు)

సత్య ప్రభావ గరిమన్
నిత్యము బోధించినావు ని ల జనులకున్
సత్యస్వరూపుండవనగ
సతే తరమిందులేదు-జననుత గాంధీ॥

అవతారమూర్తివని, ని
న్నవనీ జనులెల్లరు, గొనియాడిరి, అయయో!
అవతారము చాలింపంగ
అవనీ జనమెల్ల మునింగె, ననుతాపాబ్ధిన్.

ఓయీ! దురాగ్గా! నీ
చే యెటులాడెనుర! విమల భక్తుని గాంధిన్
మాయింపం బైకినెత్తగ
బోయడవో రాక్షసుడవొ భూతంబవొకో॥



# ఘోరతమస్సు

(కొడాలి వెంకటరాజారావు)

మతమదోన్మత్త మృత్యు దుర్మార్గ చర
ఫలితమా అహింసా చక్రవర్తి గుండె
లోతులకుపోయి మండినదా తుపాకి
లోని సీసపుముక్క కల్లోలపరచి॥

శాంతికోసము యెడద, విశ్రాంతి విడచి
హింసకోర్వక యెడద, నహింస నడపి
దెబ్బదెనిమిదియేండ్లు పండిన వయస్సు
నే కిరాతుని కరము దహించె తంత్రి॥

సత్యమన్నది 'బాపు' వచస్సు నిమిడె
శాంతియన్నది 'బాపు' వర్చస్సు నిలచె
మరి, యహింసయన్నది 'బాపు' మనసు పెనచె
మరల క్రమ్మెను ఘోరతమస్సులకట॥

— X —

# హాహా కారమయ్యెలోకము

(కవికొండల వెంకట్రావు)

శాంతిశూర! కర వీర, సత్యాగ్రహధీరా
నీ-ఈ-మరణవార్త
ఘోర, మతికఠోర, మరరె! చోర!
ధాం! ధాం! ధాం! శూర!
మరయ చిన్న మనిషి !
ద నింత రక్తమా?
కూడనింత మాంసమా?
వాడు తినగబంపెనా?
వాడుమనగ చేర్చెనా!
తు-పాకి -వేట గూర్చెనా
తోడి మానవుండగున్
ద వానికింకెటు?
వేడికొనగ లేవుగా!
వీడిపోతివా భువిన్!
మహాత్మ గాంధి? హా-హా కారమయె లోకము
ఆకారమెడసి నీవు పో
అంధమిడియె శోకము!
కల్యాణ గుణ పరంపరా! నిర్మాణ మీవు పొంది
భారతాంబనీవు వినా-భయోత్పాత నిపతితం!

## మహాత్ముని దివ్యస్మృతి

లేదె మృతికి ఆవల
వాదు - ని సత్యము
స్వాదువైన అమృతం?

గుండె గుండె బొఱగన్
వెలికి వెడలె హృద్రుత -
నీ సుహృద్రుతమదే
మాకు మాకు అమృతం
శోకమార్చు సూనృతం.

నెత్తురింత చిందకే
ఎత్తు కెత్తు తెచ్చితి
'హమార్ దేశ్' స్వతంత్రతల్
నీ స్వతంత్ర వయో
నెత్తురోడ్చి కంటివి!!

ఓ మహాత్మ గాంధిజీ!
మహిమే నెవరిలో
నేన్ మహిపైనున్న చో
పునః ప్రాణజేతుమోయ్
మహాత్మ గాంధి నిన్
పునః ప్రాణజేతుమోయ్!!

ఆ-దాకా చేతులెత్తి మ్రొక్కనీ
నీ-ఆత్మ శాంతి కొఱకు
నీ-ఆత్మ శాంతికొఱకు
నీ-ఆత్మ శాంతికొఱకు
నీ-ఆత్మ శాంతికొఱకు
ఓం-శాంతిశ్శాంతిశ్శాంతి!



# గాంధి మహిమ

(మారేపల్లి రామచంద్రశాస్త్రి కవి)

అవతారము లావేశము
లవు నొక్కొక తఱిని నీది యట్టిదె యగు, హైం
దవ దాస్యము క్తి చేయం
గ వచ్చి చేసితివయారే; గాంధిమహాత్మా!

భారత దాస్యపు చీకటి
పేరు అహింసావ్రతంపు వెలుగునఁదొలగన్
నేరిచిన ధీరశూర; ని
కారపు హతిఁ గ్రుంకితకట గాంధిమహాత్మా!

బోయడు కృష్ణుని వలెనే
యీ యెడ నొక బోయ నిన్ను హింసించెనయో!
గాయమున నీకు మృత్యువ!
కాయము క్షణభంగురంబు గాంధి మహాత్మా!

ఢి ్లలో నీ ల్గుట
లల్ల ప క్షిత్తు మరణమాత కు దెచ్చున్
బల్లిదులు కాతు రనుటలు
కల్లగదా చావునుండి గాంధిమహాత్మా!

భారతులకు స్వాతంత్ర్యము
దారతఁ దెచ్చితివి కాన ధన్యుఁడవు మహో
దారుండగు పరమేశుడు
గారవమున ముక్తినిచ్చు గాంధిమహాత్మా !

పౌరపడె 'బెర్నాడ్‌షా' యని
సరసముగా దెలుపువాడ సాహిత్య కళా
పరుడైన సత్యమెఱుగుట
కరమరుదగు నొక్కచోట గాంధిమహాత్మా !

నీ హత్య వినుచు భూ ప్రజ
హాహాకారము లొనర్చు టది వింతయె స
మ్మోహిత మది నీ సమతా
కాహళనినదంపు మహిమ గాంధిమహాత్మా !

స్థూలత కంటెన్ సూక్ష్మత
మేలగు సూక్ష్మంపుటొడలి మేదుర శక్తిన్
పాలింపుము భావి కలి
కాలపు పాపములఁ బాపి గాంధిమహాత్మా !

ధీమంతులు కొండాటన్
సామెత నీకిడుచు నెంతొ సోలెద రకటా
సామాను లవలె వారలు
కామితముల దీర్పు ప్రతిభ గాంధిమహాత్మా !

నీపయిగల భ_త్తి మెయిన్
పాపము కొందఱు కలంగి పరుల కహింసన్
పాపింపజేయువారల
కాపాడవె యా_ర్త రతుల గాంధిమహాత్మా !

మత సహనము దేశస్థుల
మతులన్ కలగించి యొక్క మతి నందఱి నీ
గతి నడవఁజేసి వెస దు
ర్గతులన్ తొలగింప వలయు గాంధి మహాత్మా !

భారత దేశంబునకు, న
పార యశం బబ్బె నీదు ప్రజ్ఞన్ దానిన్
ధీరత కావలె నీ స్మృతి
కారణమునఁ జెడక నిలువ గాంధి మహాత్మా

ooooooooo

# మరణవార్త

('సుధ')

రేడియో యేడుస్తుంది
సృష్టిదేవత శోకిస్తుంది
ఆకాశంలో
కరుడుగట్టుకుపోయినహిమం

కరిగి, కన్నీరు కాల్వ-
నింగి నున్న నక్షత్రాలు
'ఏమిటిదంతా,'
ఆతురత చూడవచ్చి
అచ్చెరువందాయ్-వెల వెల
బోయాయ్
మహాత్ముని మరణింపజేసిన
మతిని మానవ దౌష్ట్యాన్ని
ఆసహించుకున్నాయ్
ప్రపంచం పాలిపోయింది

దేశాలన్నీ దిగ్భ్రమజెందాయ్
భూగోళమంతా బావురుమన్నది
ఒక్కమారుగా
నిత్య వ్యవహారాల్లోంచి విరమించు
కొన్నది
నిశ్చేష్టురాలై నిలచి పోయినది
దేశం.
కన్నీరు-మున్నీరు
మానవ- హృదయంనిలచిపోయింది
మనుషుల భాషలు
మూగవోయినై
అవక్తంగా ఆగిపోయినై!
—లోకం—శోకం—!
కాలం- కదల- -
'ఇదే మహాత్ముని మరణవార్త'

# అమరజీవి గాంధి

(జాగర్లపూడి వెంకటసుబ్బయ్యశాస్త్రి)

రాముడవై తన ప్రాణాలు తీసిన
కోపాన మును వాలి, ద్వాపరాన
కృష్ణుండవై పుట్ట-కినుకతో బోయండై
అవసాన ప్రాణాలు దీసి
అంతతో బోవక యాతడే కసిబట్టి
పొదలుచునుండె నీ పుటుక కొఱకు
గాంధివై పుట్టిన గమనించి యా పాపి
ప్రత క్షముగం మొక్క హత చేసె

అతడు కసి బట్టుకున్న నీ యవని యందు
వాతవులు నీకు రు, నిస్సంశయముగ
భరత భాగో దయ విధాత పతితగీత
రామమంత్ర ప్రభాత ! గాంధీమహాత !

కొట్టినన్ దిట్టినన్ హత కోరియున్న
భౌతిక శ రమునకెగదా! తలంప
అమర జీవి నీకు చావరయ గలదె
దివ్యతేజః ప్రహర్షి! గాంధీమహర్షి!

# మన గాంధి

(‘దేశభక్త’ కొండా వెంకటప్పయ్య పంతులు)

కానగరాదు గాంధి, యిక గానగ జాలము వారిపోలికన్
తానుగ కష్టభారముల దాల్చెను మెండుగ దేశభక్తికై
పూని దవానలంబనగ బోరు చరించెడి నౌకహాలిలో
మానగజేసె దౌష్ట్యమును, మాన్యుడహింసను బోధజేయుచున్-

నిరసన వ్రతదీక్ష నెన్ని సారులో, పట్టి
కలహకల్లోలంబు గట్టిపెట్టె
కాళీ ఘట్టమునందు గఠినమౌ వ్రతదీక్ష
హస్తినా పురమందు నట్లుజేసె
తన ప్రాణరక్షణకు దగిన భద్రమొసర్ప
వలదని వారించెఁ బాలకులను
పరగ ననర్థముల్ పాయంగ శ్రీరామ
మననంబు జేయించె జనులచేత

దేహమర్పించె, శాంతికై ధీరుడతడు
మనసు నర్పించె బరమేశు మహితభక్తి
తపమటన్నను నిది ఘోరతపము గాదె
తపసి యాతడు, మహితాత్త తపసియతడు.

పరమ గురువంచు ప్రణతులు భక్తితోడ
హృదయపు బళ్లెరపుటార్తి సదయుడంచు
దేశముక్తు దాటించుసు దీపపూజ
సలిపి మొక్కెద గాంధికి స్థైర నిధికి॥

# మహ త్మ

(కన్నెగంటి వీరభద్రాచార్యులు)

కాఱు చీకటులలో గాంతి రేఖలగూర్చి
దారి చూపిన మహోదార జీవి
అగ్నికుండాలలో న శ్రుధారల నింపి
యెల్లలోకము నేలు చల్లనయ
వడగాడ్పులో తవాతంబు గల్గించి
హాయి జూపిన భార య యోగి
హాలాహలంబులో నమృత మాధురిజొన్పి
కల్లోలమాపు దీక్షాతపస్వి

రామరాజ్య ప్రదాత భారత విధాత
కరుణగల శాంతిదూత మా గాంధితాత
ఖండ ఖండాంతరముల దుఃఖమున ముంచి
తరలి పోయెను స్వర్గలోకమును జేర॥

ఇల కంపించెను, దేశనాయకులు 'తం డ్రీ'!యంచు వాపోయి మూ
ర్ఛిలుచున్నారు పవి త భారత సవి - నేత్రదుఃఖా శ్రువుల్
సెలయేళ్లై ప్రవహించె శాంతిగుణరా ! ఖండ ఖండాంతరం
బులు ఘోషిల్లె భవిద్వియోగవిషయంబున్ విన్నమా తంబునన్॥

అమరుల్ నీ యిరుప్రక్కలన్ నడువ, దివ్యధ్వానముల్ మ్రోగగా
రమణుల్ హారతులిచ్చి సన్నుతులొనర్పన్ బాలగంగాధర
ప్రముఖుల్ దీవెనలియ అవ్యయము జేరంబోవు నీ పాద ప
ద్మములన్ బవిత్రమైనవి మహాత్మా! స్వర్గసోపానముల్.

హాలమా రాట్నము-గిత్తలా విమల సత్యాహింస లేప్రొద్దు నీ
పొలమా భారతభూమి విత్తనము లభ్యుత్థాన సందేశముల్
ఫలమా దాస విముక్తి సత్వరమనః స్వాతంత్ర్యముల్ కర్షకో
జ్జ్వల చారిత్రము నీయదే, మధురాత్మవా ఎంత ధన్యుండవో?

—:

# ఘోరదుర్దినము

("జాషువ")

అది తలపోయరాని హృదయ ప్రవిదారి విషాదవాచ్య కా
స్పదమయి పంచఖండములు బావురుమన్న పిశాచవేళ ము
ప్పది పదికోట్ల భారత తపస్సముదాయము భస్మరాశియై
చిదికిన ఘోర దుర్దిన మిసీ వచియింపగ జిహ్వలాడునే.

ఉపవాసం బుపసంహరించుకొని, యెన్నోనాళ్లు కాలేదు, తా
నుపలాలించు ప్రపంచశాంతి రమ కాయుర్జ్యోతి సిద్ధింప లే
దపరాహ్ణంబున గ్రుంకెన్ భరత మునా దిత్య బింబంబు, తూ
రుపు ఖండంబున సస్వభావికముగా రోదసు రోదింపగన్.

అదిగో రాట్నము త దేశజుల కాహారము గల్పించి, అ
భ్యుదయాపాదక సామరస మున కాయుర్దాయమున్ బోసి ఆ
పద పాలై మరణించి భస్మచయమున్ భాగించి దేశాలపై
వెదజల్లించిన గాంధితాత ఋణమున్ విశ్వం బెటుల్ ర్చునో

అటం బాంబులవారు దద్దరిలి, రాజ్య త్యాగమున్ జేయ, ము
ప్పూటల్ పస్తులు సి చి క్రన మహాత్మన్ ణాకంకాళమున్
వేటాడించిన క్రూరురాల వకటా! నీ కాస్వరాజ ంబు, నీ
చేచే శాశ్వత దాస్యమున్ మరల వ్రాసెన్ బహ ధ్లిప !

గోచియు గొంగడిన్ గలిగి, కొట్టక తిట్టక భారత క్షితిన్
గీచిన గేటులో నడుపు నేర్పరి-కన్నుల ప్రేమచంద్రకల్
పూచి ఫలించు నిశ్చలుడు, మ్రొక్కిన తక్కిన సామరస్యమున్
తూచి యొనంగు నీశ్వరుని దూతకదన్ పగ కూపిరాడునే!
ప్రేమ స్వర్గము సృష్టిచేసి చనియెన్ క్రీస్తుండు మున్నిండియా
భూమిన్ బుద్ధుడహింస నాటిచనె మామూదుండు హింసక్రియా
వైముఖ్యంబు విధించె, వర్గకలహవ్యాధి న్నివారింప, నిం
మందుల్ పనిసేయు; శాంతి చనిపోయెన్ ఛాయలాపద్దదై.

అవతరించిన స్వరాజ పాజ్య బాలిక
కక్కటా ముకుపచ్చ లారలేదు
సకుటుంబముగ వీడి-చనుచున్న పరరాజు
నిజసీమలో కాలు నిలుప లేదు
హస్తినాపురిమీద హైందవ ధ్వజమెత్తి
నిండుగా యేడాది నిండలేదు
స్వాతంత్ర్య ఘనమహోత్సవ జయధ్వానంబు
మారోగత లూరూర మాయదు

సింహపీఠిక నధివసించిన యనుంగు
మనుమలన్ జూచుకొనుచు, నమందహర్ష
పులకిత స్వాంతుడగు దొడ్డముసలివాడు
మాయమయ్యెనే! లోకాల గాయమగుచు.

అంటరాని వాడవై యాఫ్రికాయందు
తెల్లవారి నడుమ తెలిసికొంటి
అంటరాని వారి యతరంగంబున
ప్రేలు అగ్నిపర్వతాల ఘోష.

---

# మహాజ్యోతి

(- పాల పిచ్చయశాస్త్రి)

కారు చీకట్లు గ్రమె, నాక్రందనములు
ఖండ ఖండాంతరమ్ముల గ్రందుకొనియె
స్తం తంబయ్యె సాధు తః ప్రవృత్తి
అల మహాత మహాజ్యోతి మలగిపోవ.

సీమ సింహాలు, నౌఖాళి చిఱుతపులులు
నీదు తత్వంబు నెఱిగి మన్నించెగాని
ఎఱుగలేదయ్యె నీ సహోదరుడె, నిన్ను
కాల్చి మ్రందించె నతడెంత ఘాతుకుండొ?

తూర్పు పడమరలైన, హిందూ మహమ
దీయులకు నైక లేమిని సాధించుటేమి?
కాని పని బూని నిష్కామ కర యోగి
బలియొనర్చితె బంగారు వంటి బ్రదుకు.

కడగండ్లమారి చీకటి బందిఖానులే
రమణీయ ధర హర్మ్యములుగాగ
కిలింతలుతెచ్చు తూకంబు మెతుకులే
షడ్రసోపేత భోజనముగాగ

క్రూరభటా కఠోర గర్హణములే
యాప్తసల్లాప వాక్యములుగాగ
కృపణాధికారి నిర్దిష్ట కర్మంబులే
యాయ నిత్య కృత్యములుగాగ

తన్నులకు తోపులకు గూడ, తాళితాళి
తెచ్చికొన్న స్వరాజ్యంబు తివిరి యనుభ
వించు వేళకు నిటు ముప్పు ముంచుకొని యె
భారతీయుల గాఢ దౌర్భాగ్యమేమొ?

# పూర్ణరాజర్షి

(మాల కొండారె )

ని ·ల మతములు తం త్రులై నిస్వనింప
మేలి గౌతాళి పంచిక మేళవించి
సత్యగానామృతము జిందు సాధుఋషికి
హత్య కాటోలు హైందవు లంపు కాన్క

గాంధి దేవుని మరణ సంఘటన యనెడు
బాంబు వేటున చుక్కాని బద్దలయ్యె
నట్టనడియేట భారత నౌక కిపుడు
దారి జూపించు దిక్సూచి జారిపోయె

అస్తమించినది నే డా సేతు హిమశైల
దేదీప మానమౌ దివ ·తార
భగ్గుమన్నది నేడు భారత జనయి త్రి
కనిపెంచుకొన్న బంగారుపంట
బె సి గల్లున క్రిందబడిన దుర్వి కాంత
కలికి పాపట మీద కనకభూష
మూగవోయినది భూభువనభ ర్త కరాన
నినదాభు శాంతి మాణిక వీణ

మనుజ కోటికి మకుటాయమానుడవయి
దేశమున నవ చైతన దీపమిడిన
పుణ్య నిను జేతులార గోల్పోవు కతన
పూర్ణ రాజర్షి! యీ లోటు పూడ్చు టెట్లు?

రాజవు నీవు కావు. పలురాజులు నీ చరణాల దాపునన్
పూజలొనర్చినారు, అసి బూనిన యోధుడవీవు కావు: ఘో
రాజిని, నీకు మించిన పరాక్రమవంతుడులేడు, చిత్రమై
రాజిలు నీ చరిత్రకు జరామరణంబులులేవు— బాపు.



# భువన బాంధవుడు

(ఏటుకూరి వెంకటనరసయ్య)

ఒక త్రుటిలో ప్రపంచమంతె లూగిన దౌకొ్కకయత్రు వర్ధిగా
ప్రకృతి ద్రవించి యేడ్చినది ప్రత్యణు వాత డనంతకోటి రూ
పకుడని దోయిలించినది బ్రహ్మ పదార్థములోన ౹న్మై
పకపకలాడు మా భువన బాంధవుడిం కిటు తొంగిచూచునా!

నలుబదికోట్ల బిడ్డల మనః పరివర్తనకై తపించి నం
దుల కిదియా ఫలంబు: మన దుష్కృతమా శశితారకము గా
నిలువకతప్ప దీ భువన నిందకు పాత్రము గాకతప్ప దా
ఖలుని కతమ్మునన్ భరతఖండ చరిత్రమె తారుమారుగా,

చలమున్ శౌర్యము రిచూడని యహింసాఖడ్గమున్ దూసి,హూ
ణుల నొక్కొత్తున నీరు ద్రాపిన భవన్మూర్తి ప్రభూత ప్రదీ
జ్జ్వల మాహాత్మ్య వశంపదమ్ములయి, రక్షః క్రౌర్య కౌటిల సం
కుల సామ్రాజ్యము లిచ్చమెచ్చినవి నీ కూలంకష ప్రజ్ఞకున్.

ఒక నూలో్పగున ఆంగ్లరాజ్య విభవ ము బ్బూత లూగించి,యం
కెకు రాబట్టితి వంతమరల, త్రిలో పూజ్యమౌ నీ చరి
త్రకు దిగ్వ్యూహముల్ నమస్కృతులొసర్పన్ స్వీయ దే యు
ష్యకు లోనై తెగటార్చి రాత హనసవ్యాపార పా ణులై ॥

ఆరిపోయిన దాసియా జ్యోతి నీవెట్టు
చీకటుల నెదు దగలవు
సడలిపోయినద హింసా సూత్రమె దయా
మహిమ హింసాకాండ మాన్ప గలదు
దగ్ధమైన దపూర్వ ధర దేవత మరే
న్యాయ మీ లోకంబు నడుపగలదు
తరలిపోయినది సత్యస్ఫూర్తి యే నీతి
నిష్ఠ లాశాంతిని నిలుపగలవు?

సార్వకాలిక సమధికాచార సార
మీమహాస్సు మదాత లం దేలగించి
అజరమమర మనిర్వాచ్యమగుచునగుచు
విశ్వ కల్యాణ కిరణమై వెలయుగాక.

---

# గాంధి మహాత్మ

(నండూరి రామకృష్ణమాచార్యా)

సత్య మహింస, యుచ్ఛ్వాశ నిశ్వాసముల్
సల్పి వించెడి సత్యమూర్తి
విశ్వ కల్యాణ గవేషణాపథమందు
పయనించు, యొంటరి బాటసారి
సత్యాగ్రహమ్ముచే శాత్రవులను శిష
నిర్వి షుల జేయు నిగమరాశి
రాట్నము ధర చక్రముజేసి పరిశుద్ధ
ఖద్దరు ధరించు కర్మయోగి

బుద్ధ దేవుడు పుట్టిన పుణ్యభూమి
నేటికిని పునః పూతమై నెగడునట్లు
అవతరించిన యట్టి, యో అమృతమూర్తి
అందుకొనవయ్య మా స్వాగతార్ఘ్యములను.

గాంధిమహాత్మ ! దివ్య పదకంజములంట జనావళుల్ జగ
ద్బాంధవ ర్థయాత్రకయి వచ్చిరి; లెమ్మిక ఊతకోలతో
బంధములో కృశింపదిక భారతమాత; స్వతంత్ర గీతికా
బంధురమైన దుందుభి రవంబులు నింపుము బోసినోటితో.

— x—

# బాపూజీ

(పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు)

అకుటిలచారు వృత్త మనహంకృతి పాత్రము, మాతృదేశ పూ
జక సహకారి నాయకము, సత్యదయా నయశాంతిదాంతి బో
ధకము స్వరాజ్య లాభన ముదాత్త మహింసముగాంధి ముఖ్య నా
యకము, విషాదనాటకమహో ముగిసెన్ భరతోక్తి శూన మై.

ఆ పాతాళము త్రవ్వసాగరులు యజ్ఞాశ్వార్థ, మాగంతికున్
వ్యాపించెన్ సుయశంబు సాగరము నా బాపూజి: తద్భస పున్
బ్రాపున్ గాంచ నివారు, త్రవ్వరట, తత్పాతస్థలిన్ మృత్స్నకై
కూపంబో యది పుణ్యవాసియొ, మహాకూపారమో కాదొకో!

రతనంబున్ జెయిజార్చికొంటిమిక, నూరాపేర, నీకయొ భా
రతమా నిశ్శరణంబవైతివి, పదార్థంబా! వృధానూనృత
వ్రతమా నీ బ్రతుకింక. సద్గుణములారా! మీరు నిష్కాసితుల్
శత వర్షంబులు నీకునిండెనె యహింసా హింస కాలానితే?



# యుగ ప్రవక్త

(బొడ్డు బాపిరాజు)

జోహారులు బాపు
స్నేహామృత శిశిరసారణీస్మిత రోచి
స్సౌహార్ద మధురమూర్తీ
ఊహా షండవైతివో మా తం

ఒకచూపు చాలులే సకల ప్రజాకోటి
చిత్తసీమల శాంతి చిలుకరింప
ఒకమాట చాలదే, ఉద్రిక్త సోదరా
శుల తేర్చి సుప్రసన్నులను జేయ
ఒక వ్రాతచాలుపో ఉ వ్యధరుల రాజ
ముద్రికలకు మార్గములను జూప
ఒక దీక్షచాలు ఊరక లోకములు లోక
ములు తల్లడిలి పదము లకు మ్రొగ్గ

అతడు నిస్వార్థబుద్ధి సత్యాగ్రహుండు
అ ల మతములాతనివె దాస్యాంధకార
బంధురాకాశ వీధి నవ స్వతంత్ర
సుప్రభాత విధాత యుగప్రవక్త.

స్వేచ్ఛాలోభ పరస్పరాసహన దుర్హింసా మతద్వేష దో
షచ్ఛాయాఖిని భారతావని ప్రతిష్ఠాపింపగా సర్వ లో
కోచ్ఛంబౌ యొక రామరాజ్యమును, నీ వూహించితే తండ్రి యీ
తుచ్ఛ స్వార్థమత ప్రమత్తులకు లేదో ఆ మహాదృష్టమే,

ఒక్క దీపము తాను కొండెక్కి నంత
నేడు నలుబదికోట్ల గుండెలను కూడ
వెలుగుచున్నది శాంతి నిశ్చలపు కాంతి
ఏ తుపానులు ఆర్పలేవింక దీని.

# హృదయావేదన

(దివాకర్ల వేంకటావధాని)

తన మనోవైశాల్యమును చెప్పకయె చెప్పు
　　　　వెడద కన్నులదోయి బెడగుతోడ
తన తత్త్వ విజ్ఞాన తత్పరత్వము దెల్పు
　　　　సదమల బ్రహ్మ తేజంబుతోడ
తనదీనమానవోద్ధరణేచ్ఛ సూచించు
　　　　కుదురైన కొల్లాయి గుడ్డతోడ
తన యహింసా మార్గమును ప్రతిష్ఠాపించు
　　　　శ్రుతి మనోహర వచోవితతితోడ

పూర్వ హైందవ భూమి భృద్భూమి విజయ
నివహ సంపాద నోద్యోగ నిత్యహేతు
భద్రమ_ భ గమన శోభనత తోడ
నాత డెచటికొ నడచుచున్నట్లు తోచు.

అంతరిక్ష తలంబున నఖిలలోక
దుఃఖపిశునము తోచెను తోకచుక్క
భూతలమునుండి ని ల భూభువన పుణ్య
ఫల మెగిరిపోయె నొక్క దివ్యంపు జుక్క॥

దీనులపాలి కల్పకము, దేశముగాంచిన పెన్నిధానమున్
మానవ సంఘమందు దలమానికమున్, గరుణా స్వరూపమున్
జ్ఞాన నిధానమున్ జనకసన్నిభు నంధమతా మాన క్రౌ
ర్యానవధించినాడు, సకలావని గుండెలు చీల్చెనొక్కటిన్.

చాలెటులైన మర్త్యులకు సంఘటిలున్: మృతిగన్నవారి స
ద్భావమునెంచి యేడ్చుటయు, వ్యర్థముకాని యహింసకోసమై
జీవితమంత పుచ్చిన విశిష్టుని హింసకు బాలుసేయు దు
ర్దైవము చెయ్దమెంచిన యథాయథలై హృదయము క్రుంగెన్.

*

# ఓయి మహాత్మ
(కొత్త సత్యనారాయణచౌదరి)

ఓయి మహాత్మ ! లోకము సయోమయమ్మై హతమారి పోయిన
ట్టేయిక నిన్ను బాసి యెకదెక్కడ నేమిట ప్రొద్దు పుచ్చునో,
నా యము చట్టుబండలయి యారడి పోయెనె ? పాడులోక మీ
గాయము మాన్పుకో నయితిగాక, కృశించి తపించి పోవదే ?

బంగరు వాన వెల్లువలు పారి ఫలించి ప్రపంచమంతయున్
గొంగున దాచిపెట్టు నదిగో నవభారతమంచు, మించి యు
ప్పొంగితిమయ్య దాని నిజమున్ గుహతించెడి వేళ నిట్టుల
యె ంగద యోయిపాపపు విధీ ! నినుమెత్తురె లోకు లిత్తరిన్॥

ఈ కొరగాని దేశమున నింక మహాత్ములు పుట్టబోరు, లో
కైక మహాత్మ దాచుకొనరైరి కదా ! యొక యాతతాయి చీ
కాకయి దేశ గౌరవము గాలసురాచి మతంబులోన ము
క్కాకలు దేరియున్న మొనగానిని గ్రుక్కలుబట్టి మ్రింగునా ?

అదిగో! తూరుపు దిక్కులో నెరుపు దృశ్యంబయె నామీద న
భ్యుదయంబున్ గనవచ్చునంచు మదిలోనుత్సా ముత్సేకమై
పొదలన్! రివ్వునగారు చీకటుల సంపూర్ణంబుగా గ్రమి ; య
భ్యుదయంబున్ హతమార్చె శాపమదియో మోగాని యీజాతి న్.

# జగతి నిర్జీవమయ్యె

(మహావాది వెంకటరత్నము)

ఆ దుర్వార్త వినంగనే మనసు గ్రైపోయె, నా గుండెలో
యేదో తీరని బాధ హెచ్చినది, నా యిల్లాలు నా బిడ్డలున్
నా దుఃఖంబున పాలుపంచుకొని, రానాడే జగత్తంతయున్
చెడిపోయెను-తాతతోనె, నశియించెన్ విశ్వసౌభాగ ముల్.
ఆరిపోయెనుగదా అన్ని లోకాలను

వెలిగించు నిర్మల ప్రేమదీప్తి

ఆగిపోయెనుగదా అన్నిమతాలకు

సఖత గలిగించు శాంతి ..తి

చచ్చిపోయెగదా సర్వతోముఖముగా

చెన్నారు భారత వశక్తి

నిలచిపోయెనుగదా కుల భేద మెరుగని

రఘుపతి రాఘవ రామ భజన

నీవు, "హా రామ" యనుచు, యీ నేల గూల
వేయిపడగల సామియే వివశుడయె
ప్రకృతి యంతయు చైతన రహితమయె
.వు కనుమూయ జగతి ని.జ.వమయె .

నెత్తురు జిందకుండ యొకనిన్ బలిపెట్టక కత్తిలేక లో
కోత్తర శాంతిపూర్వక మహోద్యమ మొక్కటి లేవదీసి; యు
ద్వేత్తగ వైరిశక్తుల జయించి స్వతంత్రత గొన్ననేమి ? నీ
నెత్తురు దావె నేటికొక నీచుడు, -బాపు ! యిదేమి వైరమో ?

---

# హతవిధీ

(ధూపాటి కొండమాచార్యులు)

హతవిధీ! పొట్ట బెట్టితి వనుపమాన
శాంతిమయ ·వి నిటు మహాసాధు ·లు
నింక జగతిని తావెద్ది ? యెంచిచూడ
సత్యము నహింస కిద్దియా సత్ఫలంబు ?

భౌతిక శ ·ర మొక్క_టే బానె గాని
యనుపమంబై_న యాతని యాత శ_
నిండుకొనివెల్గుచుండె, బ్రహ్మాండమెల్ల
మించి రా త్రి పునరుద్ధరించుగాత!



# అహింసా తపస్వి

(జూలూరి కామేశ్వరి)

ప్రార్థనా సన్నివేళ సభముఖాన
శాంతి సతా-లు నినదించు సమయమందు
చంపెనట నిన్ను నో యహింసా తపస్వి
కఠిన పాషాణ హృదయు డొక్కడు తెగించి॥

నీ వొక ద్రోహిచేత మరణించితివన్న విషాద వార్తకే
స్థావర జంగమాత్మక విశాల జగస్థలి గుండె నీరుగా
బావురుమంచు యేడ్చినది భారతభాగ విధాత ! ఎదు స
ద్భావమె నీకు మృత్యు వయి తారసిలెన్ తుది నక్కటక్కటా

మంచికి మంచిలే దసలు మానవ జాతికి మానవత్వమున్
పెంచి సుఖింపుడంచు వినిపించిన శాంతువి స్తువిల్లై చం
పించిరి- స్వార్థమున్ విడిచిపెట్టి స్వదేశము కోసమింత క
ష్టించిన బాపుజీ బ్రతుకు చేదయి కాల్చిరి నేటికక్కటా!

ఆరనిమంట నా హృదయమందున నిల్పితి వో ప్రభూ ! యికన్
తీరని బాధతో కుమిలి దేశము దిక్కును మొక్కు లేక సం
స్కార విహీనమై బ్రతుకు చావులమధ్య కృశించి యింకన్
ఘోర విపత్పరంపరలకున్ గురికావలెనో కదా! తుదిన్॥

---

# విలయము

(అయాచితుల హనుమచ్ఛాస్త్రి)

ఒక విలయము పెంచుకొని, యొక్కడు నిన్ను సమస్తలోక భా
వుక శుభమూర్తి, శాంతి పరిపుష్టవినిశ్చలధీరు శోక ని
శ్చలిత హృదంతరాంతర ప్రసన్నమనోహరరూపు, సాధుతా
నికషము పొట్టబెట్టుకొన నేర్చెనటే! ప్రళయాంబుదార్భటిన్,

సత్యాగ్రహి సర్వలోక వినుతాత్యుత్సాహదీప్తాత్మ దీ
క్షా సామ్రాజ్య రమాధినాథ ని లాశాపూర్ణ ర్తీశ్వరా
నాసాంతః పుట కించిదుజ్ఝిత జవోష్ణ శ్వాసనిర్ధూత స
ర్వాశాదేశ విరోధియూధ యిదె సాష్టాంగము రాట్ప్రియా

# నగుబాటు

(బృందావనం రంగాచార్యులు)

కత్తుల గడ్డయైన 'నవఖాళి' తటంబున శాంతి జముల్
విత్తిన హాలికా! అహమువీడని హైందవజాతి భూతమే
మిత్తిగ మారె నీ యెడల మించె దురుష్కమతాల మౌఢ్య సం
పత్తిని మామతము నగుబాటయెపోయెను, నాల్గునోటలన్॥

దాస్యాంధజగతిలో దారిజూపెడు వెల్గు
వెల్లువవై ముందువెడలినావు
బానిసవై పరిపాలింప దగ దిక
లెమని నిద్దుర లేపినావు
నిరుపప్లవంబులై నెరపు సత్యాగ్ర
సమరముల్ మెండుగా సలిపినావు
నలుబదికోట్ల మానవ సంఘ సేవకై
తమర్పణ జేసినావు

చరితలో మున్నెరుంగని శక్తిజూపి
ఖండ ఖండాతరాలలో ఖ్యాతి వడసి
మత సమైక్యత జగతి సమత మటంచు
నచ్చ చెప్పుటకే ప్రాణమిచ్చినావు

~~~:o:~~~
~~~

# బాపూజీ

("కణ్వాల")

అతిహేయంపు దురాగహము మము దయ మట్టు లాడింపగా
మత దము సవారి జేయ మెడపై మా తండ్రి రక్తమ్మెసె, భా
రత భూమిన్ పౌ జల్లి యీ గతిని దుర్భాగ్యము గా కాల రా
చితిమే! బాపుజి విశ్వధారుణియె, నిస్సేమము గా రోదిలన్.

భారత జనయిత్రి పాలబుగ్గలమీద
కాలువల్ గట్టెడు కంటినీరు
స్వాతంత్ర వీరుని బదుకు పెడారిలో
యువ్వెత్తుగా రేగుచున్నదూ
భారతదేశ సౌభాగ తపస్వులు
నేలనో ద్చెడు కంటి నె తుటేళ్ల
యుప్పెనయై పొంగి, యురుకు హిందూమహా
పాథోధి కర థంగపౌ

ప్రళయ పరిణత నిష్ఠుర ప్రకృతి యటుల
కురులు విరబోసికొని యాడు కౌరవి దయ
ముల వలెన్ జిందు ద్రొక్కుచు కలగుచున్న
వవిగొ బాపు నీ పటు కదలినంత॥

—:o:—

## జ్యోతి

(బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు)

జ్యోతి మలగెను, పెనుతమ మూర్వి గ్రమె
యింతసైన వాస్తవము గ్రహింపరేమి!
చనిన పితకు వాజాశ్రాను సరణ మనెడి
ఆత వంచన సేత భావ్యము కాదు.

## పిడుగుపాటు

(ఆంబడిపూడి నరసింహశర్మ)

అణగెనా యొక్క మహాదీప్తి శమదమ
సుందర దివ్యతేజోమయంబు
మడిసెనా ధర నహింసా బోధనామృత
మూటలూరిన బోసినోటి తపసి
కూలెనా! కట్టిన కొల్లాయి కొంగున
కోటు లర్థించి గైకొన్న
అరిగెనా! సత్యాగ్రహము తేరు నడిపి, స్వ
రాజ్యము గొన్న సారథియు, రయి

పోయెనా భారతాంబిక పొగలు బాపి
దాస్య బంధన మూడ్చిన వినతాసుతుండు
అస్తమించెనా గాంధి-మహాత గాంధి
అయ్యో యెంతటి పిడుగుపాటాయె నేడు.

అదిగో చూడుము దివ్యయానమున కల్పానల్ప పుష్పావళుల్
పొదువంగా బడు పూలపాన్పుపయి కొల్వుందీరి కన్నీరు నీ
రథులై పారగ తండ్రీ-న నదులై రా తింబవళ్ ళగ
ద్గదికన్ నీకయి యేడ్చు విశ్వజన సంఘాతము గాంధీ వభూ.

ఎనుబదియేండ్లనాడు మనహిందు పురంధి కంఠహార భూ
షణము లభించె, కొందకు జాయ మెరుంగులదిద్ది, యీ
దినమున 'గాంధి నామకము' దివ్యమురత్నము గోలుపోయి యా
జనని గళమ్మునన్ నిలచె సన్నని దారము, కంఠహారమై.

శాంతి కొరవడి దిద్దు నొజ్జవు, యహింస
బలము రూపించు తపసివి, భరతఖండ
ముక్తి కిరవగు వేలుపు పోడవీవు
గాంధి ! నీ కిదే నమస్కార శతము.

—:o:—

# మహాత్మా గాంధి

(బబ్బిళ్లపాటి కామేశ్వరరావు)

సత్యధర్మ దయాగుణ శాంత్యహింస
లన్ని నీ మూర్తి సేవించి వన్నెగాంచె
పూజ్య భారత విపుల సామ్రాజ్యమందు
యనుపమాన కృపాత్మ! మహాత్మ గాంధి॥

గుండె చెమర్పనట్టి హంతకుం డరుదెంచి తుపాకిగుండ్ల
యెండిన బక్క దే ముపయిన్ బడవేసిన ఘోరవార్తతో
బండలు సైతమున్ కరగె, పాయని దుఃఖముతో ప్రపంచమే
బెండయి కంపమొందె, కడు బిక్కమొగంబిడె సృష్టి బాపూ!.

# అమృతమూర్తి

(బొడ్డుపల్లి పురుషోత్తం)

ఉష్ణ కిరణుడు చరమాద్రి నోరగిలగ
అరుణ కాంతులు నలుదెసలందు క్రమ్మె
అతి భయానకమయ్యె, సితాంబరము
రక్తయుతమైన ఖాదివస్త్రము వోలె.

నత సంయుతశ్త యసత మాయె
వెలుగు నశియించె చీకటు లలముకొనియె
అమృత మూర్తిని మృతు వు నావరించె
యెట్టి దాణరువార్త విన్పించె వాణి॥

## బాపూ విశ్వవైతాళికా

(ఆచార్యా ధనకుధరం)

నీ సత్యాగ్రహదీక్ష, నీ మధుర సందేశము నీ దేశ సే
వా సౌభాగ్యము, నీ యచంచలవచః ప్రాగల్భ్యమున్ యహిం
సా సిద్ధాంతము, శాంతి ఘాతుకులు దేశద్రోహు లా యుతే
మోసానన్ తమ కాహుతిన్ గొనిరె బాపూ విశ్వవైతాళికా.

పోసినపాలు త్రాగి విషమున్ వెలిగక్కు కఠోరతక్షకా
గ్రేసర మీజగము చెలరేగి తుదిన్ నినుగూడ పొంచి కా
టేసినదా దయాబ్ధి! యిక నీ భరతావని స్వీయ విశా
శ్వాసములో లి ంచుకొన సాగునటే, తన దుశ్చరిత్రమున్.



# తిరిగిరాని యాత్ర

(ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి)

చనెనా భారత గౌరవైక కృత దీక్షా కంకణస్వామి యే
గెనటో యీ పరిరబ్ధ శత్రు సుహృదే భూతవక్షుండు, పో
యెనటయ్యా! పతితార్త దీనజన సాహిత్య క్రియాలోలు డౌ
మన 'బాపూ' మహితాత్ము డింక గనలేమా భారతోర్వీ తలిన్.

ఈవు మృతుండవైతి వన నెవ్వరు నముదురో మహాత్మ! క్రాం
బూవుల తేరిపై వెడలిపోవు మహోజ్జ్వలమూర్తి భారతీ
యావనిలోన శాంతి సుఖమన్నది చచ్చెనుగాని, ధర్మపుం
భావన చచ్చెగాని, యని మాత్రమనందగు నేటి నుండియున్.

ఆఫ్రికా హైందవ వ్యధమాన్ప దివురు మ
హోద మము న నెత్తు రోడ్చియోడ్చి
తెలి పులి కొఱకు కోఱల కందయై చిక్క
భారతావనికినై పోరిపోరి
శ్వసృగాలముల కన్న పరిహీనులన్న సో
దరులకై కన్నీట దసి తడిసి
ఇస్లాము పేరింట హింసాకళంకము
నడరు శాంత మృతాన కడిగి కడిగి.

కలలలో వెల్గు స్వాతంత్ర - కలిత కాంతి
కంటబడినంతనే యోరకంట జూచి
పూలరథమెక్కి యెచటికో పోవుచుంటి
వయ్య మహితాత్మ మరి రానియాత్ర దగిలి॥

నెత్తుధారపోసి, నిజదేశ దాస ము
తరిమి భాగ మిచ్చి తనిపినావు
అగ్ని గోళకముల కాహుతి గావించి
మించి నిన్ను గౌరవించినాము.

—:o:—

# జ్యోతిర్మయ దివ్యతార

(మాదిరాజు పార్థసార )

ఒక జ్యోతిర్మయ దివ తార యకటా వ్యోమంబునందుండి, నే
లకు రాలెన్ సకల ప్రపంచగతి వైక్లబ్యంబుమై నిద్రలో
నికి జారెన్ బసికూనలాదిగ మహానిర్వేద భారావహా
నకమై మానవ సంఘమెల్ల కుమిలెన్ గలాణ సంధాయికై.

అదియొక జ్యోతి వన కళామల దివ జగత్తు, దానిలో
గుదురుగ ప్రాణముల్ నిలుపుకొన్నవి సూ మతసామరస సం
పద లతిలోకమైన పరమార్థము దాగిన నందనమ్ము, నే
డది లయకాల గర్భ కుహరాంతరమందు వి నమొందెనా.

మతము లన్నవి మోక్ష సామ్రాజ్య మునకు
వివిధ మార్గములం జూపు విధులుగాని
కలుకు గత్తుల చాటున బెరుగుచున్న
వికట మృతు కరాళ దంష్ట్రికలు కావు॥



# బాపూజీ

(మునగపాటి విశ్వనాథశాస్త్రి)

లోకంబంతయు నిద్రజెందిననది నెహ్రూబాబు కెవ్వారు ఆ
యాకాలంబుల యోచనల్ దెలుపువారాలేరు, సర్వ ప్రజల్
శోకంబందు మునింగియుండి రసువుల్ గోల్పోయిరొక్కొక్క చో
నీకై యిట్టి నరాధమున్ విధివిధిన్ సృష్టించెనా బాపు

నీ హత న్విని లోకలోకములు క ర్షిం పె, భసా స్థికై
వాహిన్యాకృతి వేనవేల్ ప్రజలు బాష్పస్నిగ్ధ నేత్రాలతో
"హాహాబాపుజి"యంచు నేడ్చి రడలన్ వ్యర్థంబె యోచింప నీ
దేహం బింకను జూతుమే కరుణమూర్తీ ఓ నిరాడంబరా!

నవకాశిం దిరుగాడునాడు నిను కన్నారంగ వీక్షించి హైం
దవులున్ ముస్లిములున్ సమంబుగ దురంతాలెల్ల బోనాడి నిన్
స్తవముల్ జేసి త్వదీయ సూత్రముల శ్రద్ధాభక్తి పాటించి రెం
త వి-షంబో యహింసచే జయము బొందన్ లేదా మేధానిధీ!

—:o:—

# కీర్తి దేవాలయము

(చల్లా పిచ్చయ్యశాస్త్రి)

జాజి గులాబులు సంపెంగలుం గావు
శాంత హింసాది పుష్పములు వలయు
పసిడి పల్ రతనాల పలక నిల్పుటగాదు
నిరతంబు హృత్ప్రతి నిలుపవలయు
అగరు సాం బాణుల పొగలు వేయుటగాదు
సద్వాసనామైత్రి జరుపవలయు
తనివిగా ఫలనివేదనము సేయుటగాదు
తెంపు ధైర్యము నివేదింపవలయు

మహిమమహాత్ముని పూజ సామగ్రియట్టు
లనుచు దెలియుడు ప్రజలార యనవరతము
నెల్ల కడలను జూపించు నెత్తుగలుగు
దివ్య కీర్తియ యగుజుము దేవళము.



# గాంధీజీ

(విద్యాపతి)

గాంధి నాడు కలుగదు మరణమ్ము
చచ్చుచున్నది దేశ శాంతిగాని
వైవర్ణ్యమే లేదు బాపుజీ ముఖమున
మానవత్వము నేడు మాసెకాని
బాపు రక్తాన పంకిలం బైనది
చరితమేకాని తత్ఫలము కాదు
అయ యో ఘాతుకా ఆ మహాతుని జంపి
యెదిమూటగట్టు కోనెంచినావొ

క్షణములో ప్రాణముల్ తీయగల్గినావు
కాని సకల ప్రజల గుండె వ్రేచుచున్న
ప్రజల సంతాప వహ్ని నార్పంగ గలవె
తరతరము ల దుష్కీర్తి చెఱపగలవె ?

నీ మేనం గలరక్త బిందువుల ము న్నే నాడొ వెచ్చించి నే
డామూ తంబుగ నస్థిపంజరములా గైనన్ మనంగల్గ
లా మావంటి కృతఘ్ను దేశజులకై ప్రాణంబులన్ గూడ నో
స్వామీ తా గముచేసి వైచితివి, నిస్స్వార్థత్వమిట్లొప్పనే.

# గాంధీ మహాత్మ

(ప్రసాద లక్ష్మీనారాయణమూర్తి)

పలికిన పలుకులో తులతూగె నుపనిష
ద్బోధనాత్మక సుధాపూర గరిమ
చూచిన చూపులో సువ్యక్తమయ్యె ని
ష్కల్మష ప్రేమ ప్రసారమహిమ
తలచిన తలపులో నొలికె సమస్త స
ర్వం సహాజస్ర కల్యాణ కాంక్ష
చేసిన చేతలో భాసించె బహుమత
సారాత్మికంబహింసాతి దీక్ష

బ్రతికినంత కాలమ్ము శ్రీరామనామ
భవ చింతనా యత్త సుస్వాంతుడవయి
'రామ రామా' యటంచునే ప్రాణములను
బాసిన మహాత్మ నీ యాత్మ బడయు శాంతి.

ఒక చెంపగొట్ట వేరొక చెంప జూపుచే
ఘనతగా భావించు క్రీస్తు వీవు
ధర ఁబులకునెల్ల ధరణి సహింస యు
త్తమ ధర్మమనిన గౌతముడ వీవు

ప్రతిఫలాపేక్ష భావములేక త్యాగంబు
లొనరించు మను కర్మ యోగి వీవు
అతి నీచులుగ నెంచు హరిజన సోదరు
లని చెప్పు పతితపావనుడ వీవు

ధర్మ సంస్థాపనార్థమై ధరణి యుగ యు
గంబు నుదయింతువన్న వాక్యంబు నిజము
పొనరుపం బుట్టు శ్రీ విష్ణుమూర్తి వు
దివ్య శాంతి స్వరూప గాంధిమహాత్మ

●●●●●●●●

# కలడు దేవుడు

(దేవులపల్లి రామానుజరావు)

ఎండ కన్నెఱుగని యిందీవరాక్షులు
కానెలు బిగియించి కదలినారు
విజ్ఞాన జగతిని విహరించు పండితు
లర్పింపనున్న వారాత్మ శక్తు
కూలినాలి యొనర్చి కుడుచు పింబేదలు
నీ గొడ్డు ఛాయల నిల్చినారు
సిరితోడ తులదూగు శ్రీమంతులెందఱో
తా గ సంసిద్ధులై తరలినారు

వేణుగోపాలు గానము విన్న గోపి
కల విధము న మేనులు పులకరింప
అరుగుదెంచిరి ప్రజలు నిన్ననుసరింప
కలడు దేవుడు, మనయందు కలడు కలడు.

—x—

# పాలించు తండ్రి

(పోలూరి హనుమజ్జానకీరామ శర్మ)

ఎవ్వాని ప్రభుశక్తి నిందలు నాయకు
లేకసూత్రము నందిమిడ గనిరి
ఎవ్వాని దీక్షను నీ భారతావని
పరదేశ దాస్యము బాపుకొనియె
ఎవ్వాని దీప్తిని నీ దాస జనులకు
ఖండాంతరముల గతులు గలిగె
ఎవ్వాని కరుణచే నీ నాడు మాలలు
హరిజనులై పెంపు నందగనిరి

అట్టి బాపు అరచేత నల భార
తము పైకెత్తి పాలించు తండ్రి, నేడు
దేశమునగల్గు పాటును దెలియ మీ
యెచటి గెను మరలి తా నెపుడు వచ్చు.



# మహాత్మ గాంధి

(మల్లాది శివరాం)

ఒక్క మహాత్ము జంపితివి యుల్లసమందితివే, పిశాచి, ఆ
యొక్కొక రక్తబిందువున కొక్క మహాత్ముడుగా ప్రపంచ మం
దెక్కడ గాంచ నక్కడ నహింసయు, సత్యము, ప్రేమ, ధర్మముల్
పిక్కటిలున్ దురంత పరివేదన నీ వొక హిందువౌటయే.

దయ్యముబట్టి గాంధియొక ధర విఘాతకుడట్లు దోచి నీ
యయ్యనె చంపుకొంటి విదియా స్వమతోద్ధరణము మూర్ఖుడా
వెయ్యి యుగంబు లీవు విలపించి తపించి కృశించి యైన నీ
తియ్యని పల్కు నెయ్యములదిట్ట గనుంగొన జాలుదే యికన్.

# మహాత్మ గాంధి

(సున్నం వీరరాజు)

హరిజనాత్రాత నిజవిప్లవాధినేత
సద్గుణ సమేత పావన చరిత్ర శాంతి
దూత భారతభాగ్యవిధాత గాంధి
మము విడనాడె క్షణములో మాయమై ?

భారతీయులకై నిరాహార దీక్ష
సలిపి తావక రక్తమాంసములు ధార
వోసిన పవిత్ర దేవతామూర్తి వీవు
నీ ఋణము దీర్ప శక్యమౌనే మహాత్మా !

# గాంధి

(భాగవతుల నృసింహశర్మ)

గాంధి లోక సన్నుత యుగంధర మంత్రి సమాన దివ్య ధీ
కంధికి, వాఙ్నిశాత కరకాండ విఖండిత శత్రురాడ్గళ
గ్రంధికి, సంధి వర్జిత పరస్పరరంధికి సర్వదేశ సం
బంధికి భక్తిపూర్వక నమస్కృతులిచ్చెద దేశ శాంతికిన్.



# గాంధి తాత

(రావెల వెంకట సీతారామారావు)

క్రో - శ్వరుండని కొనియాడ ఫలమేమి
చోక్కాకు గతిలేని బక్కవాడు
దేశనాయకుడని వాసి కెక్కిన నేమి
కూటికి కఱవైన కూలివాడు
మహనీయమూర్తియై మనిన లాభంబేమి
పరులకు చుల్కనై పరగినాడు
భారతీయులపాలి భాగ్యంబ కానేమి
నిత్య దరిద్రుడై నిలచినాడు

విశ్వ కల్యాణమూర్తియై వెలసినాడు
శాంతి పాఠంబు గొంతెత్తి చదివినాడు
దేవుడే దిక్కటంచు ప్రార్థించినాడు
కామ్యఫలసిద్ధి గన్నాడు గాంధితాత.

ముసలివాడనుకొన్న కొనలేని మీసాలు
ద్రిప్పుచు లోకాలు ద్రిప్పగలడు
మాట తప్పను బోసినోటివాడనుకొన్న
మెప్పుగా ధర్మాలు చెప్పగలడు

కూడుగుడ్డకు లేని కూలివాడనుకొన్న
కోటాన కోటులు గూర్పగలడు
పేరు పెంపులు లేని బిచ్చగాడనుకొన్న
కోటీశ్వరులనె క్షకుల జేయు

అ ల భూతా బలిగొను యమునికేవి
శాంతమే భూషణమ ని చాటగలడు
సకల జగముల శాసించు శాంతిదూత·
కలి కలుషజేత భారత గాంధితాత.



# కారణ జన్ముడు మహాత్మగాంధి

(విశ్వనాథ వెంకటేశ్వర్లు)

వ్యాధిగ్రస్త కళేబరం బది పరవాక్యవృత్తి దుర్వైర కృ
ద్బాధాలబ్ధ విమూర్ఛ మిందు నిలువన్ భద్రంబు దంచు దు
ష్టాధోలోకగమిష మాణులము, మమార్తిన్ బడం సియున్
వేధోలోకము నొక్క దేగెదవటే విదా మనోజ్ఞాకృ ।

శతికందందగు మూలవస్తు వది చిద్రూపంబు, మాయోప బృం
హిత వైరాట్పదవీ పరిష్కరణ సాహితంబు రూపించి, భా
రత సర్వంకష కిల్బిషాఘధృతి మంత్రద్రష్టవై తత్వతః
స్థితి వైరాజ మలంకరింతువు విభూతిస్థాన యోగాకృతీ.

వహ్నితవు హవ్య మయ్యెదవహో యిది యెక్క వింతయజ్ఞ మ
ద్వైతము రూపుగొన్నయది, తావకసత విభూత ఖండతా
ధేతలుగాక వస్తుగుణధీ పవిలుప్తులు నిన్నుగూర్చి దుర్
జ్ఞాత విభేద విక్రియత సాగునటంచు దలంతు రెమె యిన్,

కారుణజను దేలికను, కారణమృత్యుడవౌదువో, దురా
చార విపృత్తమౌ భరత సంఘము దగు సప్తకోటి నా
డీ రమణీయమౌ వెడద టెంకియె దూరముగా తనూ
భారము తాను నిన్‌బొదిలి పాలనసేయునటయ, మోక్షముల్.

అంతేవాసి జనాంతరాతు డవు ప్రత త్యాశ విజ్ఞాన వా
గంతర్నాద విలాసభాసిని త్వదీయారంభ దివార్థ సా
రాంతస్తత్వములన్ గహింప వశమే యానంద కందాను భూ
త ంతర్వాణి కులాబ్ధిచంద్ర, కొనుమయ్య మా నమోవాకముల్॥

# మరువకుడీ మహాత్ముణ్ణి

(మల్లవరపు విశ్వేశ్వరరావు)

మరువకుడీ జనులారా! మన గాంధీమహాత్ముణ్ణి
మరువకుడీ ప్రజలారా! చిరం వి మహాత్ముణ్ణి
భారతదేశ విముక్తికి బంగారపు కలలుగన్న
మహాత్ముణ్ణి పేద జనుల పెన్నిధియౌ మహాత్ముణ్ణి.

గోచిపాత దాల్చి తాను దేశస్థుల కట్టబెట్ట
నూతన ధవళాంబరముల నాతని, కల, అతనికల?
నిరాహారదీక్ష నెలలు తన దేహము బలిచేసుకు
జనపాళికి భక్తికూర్ప కలగాంచెను, కలగాంచెను!

దౌర్జన్యపు లోకాటవినా తన దేకాంతవాళి
గాయమైన పాదయుగళి కాయముక్షతమై వ్రాలిన
కదలిపోవు నేకాకిగ కలకాలపు కలలదారి
మరువకుడీ మహాత్ముణ్ణి నిరుపేదల మహాత్ముణ్ణి
మరువకు జనులార మన గాంధీమహాత్ముణ్ణి.

# మహాత్మ

(కేశవపంతుల నరసింహశాస్త్రి)

నీ మహాయతేజమున నిర్మలమై వెలుగొందుచున్న, యీ
భూమి తమో మహాంధమయి పోవ నొనర్చితి వేమి దేవ యో
స్వామి యికెవ్వ భరత సంతతి సంతమసంబు బాపి, ప్రే
మామృతవృష్టి దేల్చెడు మహాత్ములు? చెప్పఁగదే కృపా ధీ!
ఎంత కఠోరవార్త ఇది యెంత విఘాతము భారతావనీ
కాంతకు పుత్రశోకమును గట్టి సురాలయమేగుచుంటి, నీ
పంతము లెల్ల సోదరు లవశ్యము గుండెలు క్రుమ్మరించి, -
ర్పింతురు రము సోదరుల పీడకుమయ నమస్కరించెదన్.
ఉటికెన్ తోయధి పంచకంబు నదిగో ఉల్లోల కల్లోలమై
కబళింపన్ బరవళ్లు ద్రొక్కెడు నదే కార్చిచ్చు పెనంటలై
పబల గావ మహోగ్ర వృష్టికదె? అభ్రవాత ముంకించె మం
త్రబలోపేతము శాంతి సాయకముతో రావయ్య రక్షింపగన్.
పచ్చని భారతమ్మ విడువన్ మన సొగ్గని యాంగిలేయు
యుచ్చును వేసినన్ వెడలమాధి స్వతంత్ర సుఖామృతంబు నం
దిచ్చిన వైనతేయుని, మహీజనబాంధవు, నిన్ను నేటికిన్
మెచ్చని పాపజాతి, ఖతిమీతె, నికేగతిఁబట్టి పోవునో.
అవురా యెంత మోసగాడవు మహాత్మా! ఒక్కనాడేని, నీ
వవనిన్ తావక విష్ణుభావమును, వ్యాఖ్యానింపనే లేదు, మే
మెవరున్ నీవు పరాత్పరుండ వనుకోనేదు, దేని, నీ
యవినాభావ చిదాత్మకత్వమునకై యత్నింపమే? బాపు!

# మరలరమ్మా ఒక్కమారు

("అమరేంద్ర")

మరలరమ్ము ఒక్కమారు
కరుణజూపు బాపూ
నూరేడులు మననీ యని
క్రూరాతుల మన్నింపుము

నిన్ను రాతిబొమ చేసి
నీ బాటనె మరచినాము
నిరుపేదల నేలరాసి
నీ పేరును చెప్పువారి

నెలవైనది నీ దేశము
తోటి నరుల కడుపుకొట్టి
కోటి పడగెత్తు ఘనుల
కోటలె కులుకుచున్నవి

బరువులతో కరువులతో
బ్రతుకు పీడ కలయైనది
ఆర్తుల హృదయావేదన
అయినది అరణ్యరోదన

నీ కలలను నిజము చేయ
నీవే దిగిరావలెనిక
దీనజనుల కొసగ ప్రాపు
నీ కన్నుల జాలిచూపు
పరహిత జీవితముగ
చరియించిన కరుణాత్మా
మట్టిబొమ్మ లగు మనుజులనే
గట్టి రులుగ, మలచిన శిల్పి
వెన్నవంటి మనసుతోడ
కన్నతల్లి మమత తోడ
బోసి నవ్వు మోముతో
మోసులెత్తు ఆశలతో
మకుటము దాల్చిన చక్రవర్తిగా
సకల హృదయముల నేలు మూర్తిగా

మరలి రమ్ము
తరలి రమ్ము
ఒక్కమారు
ఒక్కమారు

నీ రాకకు నిఖిలజగము
నిర్నిమేషమై వేచెను
నీవు ని భరతావని
ని దాణముగా తోచెను
మరల రమ్ము బాపూ
మాపై కృప జూపూ!

## బాపూజీ

(ద్రామకవచం సత్యనారాయణ)

నీ వాశించిన రామరాజ్యమది రానే లేదు, ముందెన్నడో
యావిర్భావము జెందు నాసయు వృథాయయ్యెన్గదా జాతిలో
సేవాభావ మభావమైనది, నశించెన్ద్యాగ లము లో
దేవా! ధర ము నుద్ధరించుటకు జ్యోతిరూ ర్తివై రాగదే!

నీతిని పాతిబెట్టి, యవినీతికి హారతిబట్టి పాపపున్
జేతలు గజ్జె కట్టి, గుణ లము లావల నెట్టి, నెత్తినన్
జేతులు వెట్టి, దీనజన సేవకు నీ పథమొల్లనట్టి, దు
ష్కృతుల నొంపగా, నవతరింపుము జాతి తరింప, బాపు !

నిన్ను చేజేతులన్ జంపు కొన్ననాడె
చచ్చినది జాతి, జాతి యుజ్జ్వల యశము
నాశనమ య్యె, మరల ప్రాణ ప్రతిష్ఠ
సేయగల గాంధిదేవ! వి చ్చేయవయ !

## దేవు డత డు

(కిరుదురాజు రామరాజు)

హింస నంటక రణము జయించు యోద్ధ
స్త్యాగమెఱుగని సంపన్న వైశ వరుడు
మతము గల్గియు సర్వసమ త వివే
చావు చేజి క్కపోయిన దేవుడతడు.

# గాంధీ మహాత్మా

(గడియారం రామకృష్ణశర్మ)

ఘోర దురాగతంబులకు క్షోణితలంబు కలంగ, బోధనా
సారముచేత శాంతిని ప్రసారము చేసిన కర్మభూమిలో
భారతజాతి ఘాతకుడు భారత జాతిపితన్ వధింప నా
ధారుణి క్రుంగలేదు; రవితారక చంద్రులు, డుల్లరేలొకో!

అల విశ్వారాధ్యుండైన శ్రీకృష్ణుండు
వ్యాధ బాణమున నిర్యాణమందె
శాంత హింసాధర సంస్థాపకుండు బుద్ధుం
డొక క్షుద్రు కతమున నుర్వి బాసె
స్నేహధర ముపన్యసించిన సను
చ మానవులచే నిహతుడయె
దీనబాంధవుడు, గాంధీ మహాత్ముండు, మ
తాంధుని చేత గతాసుడయె

ఖ్యాత వసులైన మహాత్ములెల్ల
నీచమృతి బొందగా దైవనియతి కలదొ!
కాలగతి నడ్డువారి కేగతి కలుగునో
యేదియు గమనింప కిటులైతివే మహాత్మ!

పారావారము మేరమీరిన, జగద్వ్యాపార మే మారినన్
తారానాథ దినేంద్రులాగిన, యసత్యంబెన్నడున్ బల్కవే
నూరుం బాతిగ వత్సరాలవని నుందున్ శాంతికై యంచు, నో
రారంబల్కియు హంతచేబడి మహాత్మా ! మాకులేవైతివే!

ఆంగ్లేయ కపట తంత్రా చే రాజి మి
న్నంటిన చిచ్చు చల్లారలేదు
జిన్నా నిమిత్త విచ్ఛిన్న భారతమాతృ
బాష్పాంబు లరికట్టఁ బడగలేదు
మత పిశాచార్పిత మానవాగాధ
రక్త ప్రవాహంబులింక లేదు
మానవాకృతి ఘోర దానవా కల్పిత
హాహానినాదంబులణ లేదు

ప్రాణముల నొడ్డి కన్న స్వరాజ లక్షి
కలయరిష్టంబులైన వైదొలఁగలేదు
బాధ తలు వీడి, యాత విశ్వాస మీగి
రుకొన్నావె, వు, గాంధి మహాత్మా॥

# భువనబాంధవ

(కలవుటవు రామగోపాలరావు)

ఆకసమూడి పడి గుండె లదిమినట్టు
లుర్వి సర్వము స్తంభించె నొక్కసారి
బాపు-మనబాపు-హత్య అబ్బా! యిదేటి
ఘాతుకత్వము ఘోర జగద్విపత్తు॥

లోకములెల్ల నొక్క త్రుటిలోన ఘటిల్లిన సంజవేళకే
చీకటులయ్యె గుండియలు చిట్లిన మానవకోటి దుఃఖ మం
దేకముగాగ, నాకమటు లెల్లెడ గన్నులు చెమ్మగిల్లి యె
దాకస మేది భూమియను నంతర మింతయు గానరానిచోన్.

డింక మన బాపు, లేడు భారతభాగ్య
సంధాత, మానవ శాంతిదూత
లేడింక మనగాంధి, లేడు సత్యాహింస
సిద్ధాంత గురుడాత శక్తి పరుడు
డింక మన మహాత్ముడు, పీడిత ప్రజో
ద్ధరణైకవ్రతుడు సద్ధర రతుడు
డు వర్ధా యోగి, డు సబర
తపసి, సేవా గ్రామ విపినమౌని

యుగ యుగమ్ముల సారాంశ మొక్క బతుకు
లోన వెలిగించి, మానవ లోకమెల్ల
నొక్క దీనార్త హృదయమై యుడుక నేడు
ంరిపోయెను, మన పెద్దదిక్కు బాపు!

పావనమైన నీ చరణపంకజ సేవకు నోచుకొన్న, మి
త్రావళితో, స్వతంత్ర భరతావనితో, నిహమెల్ల నొక్కచే
కోవగ, నిన్ను మున్ను కనుగోనివి కన్నులునైత మూర్తితో
బావురు మన్నవో భువనబాంధవ యెక్కటి దివ్యబంధమో!

—)○(—

# సాయుజ్యము

(బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి)

కుంగె హిమాద్రి శృంగములు కొండలు గుండెలు కూలి
పోయె, ది
క్కుంగనలేని పక్షులుగ గొంతుక చించుక నేడ్చియేడ్చి, క
న్నుంగవలన్ సముద్రముల నోడ్చెను విశ్వజనంబు, భారత
ప్రాంగణమెల్ల - కటులు బర్వెను, రాలితివా మహోద్యుతీ!

పోయెను వేలయేండ్లకును బుట్టని పున్నెము చేయిజారియే
పోయెను లక్షలన్ గొలిచి పోసిన పొందని వెల్గు, రాలియే
పోయెను కోట్లుగుప్పినను బూడని వజ్ర మయో! దరిద్ర నా
రాయణమూర్తి! నీ వగుదువా! యిటులెంతగనెన్ని యేడ్చనన్.

రములేని దుఃఖ జలధిన్ బడె సర్వజగత్తు, యెంతకున్
దీరని చింతచే భారతదేశ కిరీటము వ్రాలె, హంతక
ప్రేరిత మృత్యు ఘోరపదవీ పరిషిక్తతనుర్విముక్తి
వారవ మెన్ని లోకముల కావల మోగెనొ శాంతి సూక్తముల్!

ఊహల కందరాని, కరుణోదధివై, పరదాస బంధన
వ్యూహము జించి, భారతి కపూర్వ విశాల యశఃపతాకికా
బాహుల నెత్తి, మాతృపద పంకజ పూజను వాలిసట్టి ౹
మోహన ధర్మమూర్తి కనబోలునె మాకు, దరిద్ర కోటి న్ ।

నూలు పోగున దేశదేశాలు కదిపి
యుపవనంబున దేవు నుత్ప్రాత లూపి
యే మహాదేశ ర్తుల నెగసినావొ
యే మహాజాతి నార్తుల నెత్తినావొ
·యి గాంధి మహాత సాయుజ్యమగుము,

# అహింసాజ్యోతి

(“కరుణశ్రీ” జంధ్యాలపాపయ్యశాస్త్రి)

ఉయ్యాలలో నూగుచున్న ముద్దుల బిడ్డ
లేచి కెవ్వున కేకవైచె నేమొ
పాకలో లేగకు పాలిచ్చు గోవు, ‘అం
బా’ యంచు, గొంతెత్తి యఱచె నేమొ
జలజల ప్రవహించు జమున నిస్తబ్ధయై
నిలిచి కన్నుల నీరు నింపెనేమి
చకచక పొలము దున్నుకొని పోయెడి
రైతు నాగలి ముందుకు సాగదేమి ?

కోటలో ఆరుగంటలు కొట్టబోవు
వాని హస్తాలు గడగడ వడకునేమి
యే మహాతుని గుండెపై నెక్కి చనెనొ
కాలపురుషుని రథరథాంగములు నేడు.

ఇదియేమీ! నిజమా! మహాతుడిక లేనే లేడు-యీ వార్త వ
ట్టిది కాదా కరుణాసముద్రుడగు తండ్రిన్ హత్య గావించిరా
యిదియేమీ యిదియేమి! యేమిటిది-స్వామీ! యీ విషంబేమి మిం
గుదుమా? మ్రింగక తప్పదా? జగము గగ్గోలెత్తి వాపోయెడిన్.

నిండు మనస్వి, విశ్రుత వినీత పునీత యశస్వి, సాత్త్వికా
ఖండ తపస్వి, సత్యసహాకారము, చిట్టచిటారు కొమ పై
పండినపండు బ్రహ్మఋషి-భారత భాగ్యవిధాత ప్రార్థనా
మండపవేదిమీద నిక, మా కనుదోయికి విందొనర్పడా?

గుండెలు జారిపోయె ప్రజకున్, కనుగోనల న శ్రు వాహినుల్
నిండె, నభమ్ము బ్రద్దలయి నెత్తిపయిన్ బడె-దద్దరిల్లి బ్ర
హ్మాండము క్రుంగిపోయినది-అంతటి తండ్రిని ధూర్తుడై న, పు
త్రుండు కిరాత హస్తములతో వధియించె నటన్న వార్తకున్,

క్రొత్తవెలుంగు బాట నెటకో గొనివచ్చి "స్వతంత్ర భారతో
దాత్త నిదర్శనం" బగు ప్రదర్శన మంచు, మహాభయంకరో
న్మత్త పిశాచి నీ వికట నాట్యము సూపితివేమి? ఈ కథా
వృత్తము చూడలేము-తెరవేయుము దీపము లార్పుమో ప్రభూ.



# అవతారమూర్తి

("మధునాపంతుల")

చిఱుతగొడ్డలి వ్రేటు-చుఱుక సోకినది
ఒక మహావిటపి, నేలకుఁగూలిపడినది
ఒక హాలాహలవాయు-వాలసి వీచినది
కైలాస శిఖరి గక్కదల చెదరినది

తులువ చిమటకు రెక్కలు వాఁడియైనవి
ఒక గుణజ్యోతి వికడిందుపడినది
ఒక అఖండి ధనుర్గుణోక్తి మ్రోగినది
ఆచారునకు ఖ్యాతికాంగ మూఁగినది

ఒక బోయగుండె, ఊరక-తాయియైనది
అవతారమూర్తి దేహము పూర్తియైనది
ఒక శక్రలక్ష్మి నిట్టూర్పు సాగక దూఁగె
శని యట్టహాస ముషఃకేళిలోఁ దోఁగె

తా నిచ్చినది భారత స్వరాజ్యము కాని
పుచ్చుకొన్నది మొక్కవోని స్వారాజ్యము
అతడు ప్రజావ తత హృదయ గంధి
మనగాంధి గుణకంధి మఱికానబడడు.

# జోహారు

("పైడిపాటి")

భారతాంబా! నీకు జోహారు

జ్ఞానదా! నీకు జోహారు

వీరమాతా! నీకు జోహారు

అమృతవల్లి! నీకు జోహారు

కన్నతల్లికి-నీకు జోహారు

వెన్నెల్ల చూపులకు జోహారు,

~~~:o:~~~
~~~

# ధ్రువతారలు

"కరుణశ్రీ" జంధ్యాలపాపయ్యశాస్త్రి

ఎవ్వారి రణగాధ లింత వర్ణింప స
త్కవుల కలాలు సార్థకత నొందు
ఎవ్వారి జయగీతు లించుక పాడ గా
యకుల కంఠములు ధన-త గ ంచు
ఎవ్వారి రూపు లొక్కింత రూపింప శి
ల్పుల కళాకృతి మహోజ్జ్వలత గాంచు
ఎవ్వారి పదధూళి రవ్వంత సోకిన
భూదేవి నిలువెల్ల పులకరించు

నభము మా రో గు, వీర దుంధుభులు వారు
తా-గ ధనులైన, సత్ప్ర వ ర్తనులు వారు
జాతిరత్నాలు వారు, శాశ్వతులు వారు
పావనులువారు, ధన్య వనులు వారు

మండెడి స్వరాజ సమరాగ్ని కుండ మందు
భస్మమైన గులాబి పుష్పములు మీరు
ఎన్ని కల్పాంతములకేని యిం పోని
భరతమాత ఆనంద బాష్పములు మీరు.

—:o:—

# బాపూజీ పుట్టిన రోజు

("బుజ్జి")

బాపూ ! మన బాపూ
పిల్లల తాత బాపూ
సతాహింసల బాపూ
సత్పురుషుడు మన బాపూ .

సత్యాగ్రహముల బాపూ
శాంతిదూత మన బాపూ
బోసినవ్వుల బాపూ
బంగరు పలుకుల బాపూ .

కొల్లాయిగట్టిన బాపూ
బానిసత్వమును నిర్మూలించి
ప్రభువులజేసిన బాపూ
స్వరాజ్యజ్యోతిని వెలిగించి
చీకటిని బాపిన బాపూ

బాపూతాతా పుట్టినరోజు
భారతావని పండుగరోజు
గాంధి తాతకు జేజేలు
బాపూ జేజేలు - (తెలుగు పత్రిక)

# గాంధీ దేవ

శ్లో॥ గాంధీదేవ నమస్తుభ్యం- ప్రసీద మమ మంగళమ్
శాంతిదూత నమస్తుభ్యం-గాంధిదేవ నమోనమః.

నమ స్తే పురుషాధ్యక్ష, నమ స్తే హైందవ ప్రియ
నమ స్తేస్తు సదానంద, గాంధిదేవ నమస్తుతే॥

స్వరాజ్య రథమారూఢం-సర్వలోక పితామహం
సర్వపాపహరం దేవమ్-తం గాంధిం ప్రణమామ్యహమ్॥

తం గాంధిం లోక కర్తారమ్-మహాతేజ ప్రదీపనమ్
దారిద్ర ధ్వంసనం దేవమ్-తం గాంధిం ప్రణమామ్యహమ్॥

---

# గాంధీ తాత

(కోట సోదర కవులు)

ప్రమన ంగళ, కస్తురి
**రామా హృదయేశ!** లోక రంజిత సుగుణా
నీ మహిమలెన్నదరమా! కామితవరదా మహాత్మగాంధీ **తాతా.**
భారత భాగ్యవిధాతా! వారిధి గం ర! రాజవై **భవ దేశో**
ద్ధారక **మా** వందనమిదె కారుణ్య సమేత నేత గాంధీ **తాతా.**
ఇలపై బుద్ధుని కంటెను తలపగ శిబికంటె ధర్మతనయునికంటెన్
వెలయు నహింసా లము కలలో నెవ డు కు, గాంధీతాతా!
ధీరోదారము జగదుపకారము నిజ కార్యదీక్ష గౌరవ మహితా
కారము, సత్యస్ఫురణయు గారుణ్యము కనగుట గాంధీతాతా.
తిట్టిన తిట్టవు, మఱి నిను గొట్టిన గొట్టంగబోవు, క్రూరులెదలలో
నెట్టులదలచిన వారల గట్టిగ మరలింతు వౌర! గాంధీతాతా!

— X —

# మంగళహారతి

(సురటరాగము-ఆదితాళము)

మాతా నీ కిదే మంగళమ్ భారత భాగ
మాతా నీ కిదె మంగళమ్
చెన్నుగా నీకృపా రసము-చిలి మము గాపాడుమీ
వన్నె కెక్కిన వసుధలో రాణి-కన్నతల్లి! కలా ణీ॥మాతా॥
గాంధిని, అరవింద సాధువి, లాలా లజపతిరాయుని
ఆ సోదర, నెహ్రూ.సీ ఆర్ దాసు-ట గూరిని
సీపాల్ వెంకటప్పయ్య-దేశభక్తులైన వారల
కేస సమాజకులను- ర్తిమించ నేలు త ॥మాతా॥

---

# మంగళ హారతి

భైరవి-ఆదితాళము

(కొండపల్లి జగన్నాథదాసు)

జయమంగళమ్ నిత -శుభమంగళమ్
మంగళము శాంతునకు-మంగళము దాంతునకు
మంగళము ప్రవిమల-స్వాంతునకును
మంగళము మనగాంధి-మోహన దాసునకు
మంగళము కస్తూరి-బాయిపతికి ॥జయమంగళమ్॥

మంగళము దేవునకు-మంగళము వేల్పునకు
మంగళము స్వరాజ -సాధకునకు
మంగళము దౌర్జన్య రహితనిరాకరణ
మంత్రసూత్రస్థాప-నాచార్యునకును ॥జయమంగళమ్॥

మంగళము హిందుజన-మానధన చరితునకు
మంగళము మన మతో-ద్ధారకునకు
మంగళము మహమ్మదీయ సోదరహిందు
మనుజ సమ్మేళనా-మహిమాఢ్యునకును ॥జయమంగళమ్॥

సాధనకు మన జగ-న్నాథ సంసేవ-నకు
సాధునుత ప్రత్యక్ష-మానవునకు
మంగళము సురవినుత-సత గుణ లునకు
మంగళము మనదేశ సంరక్షకునకూ
జయమంగళమ్ నిత శుభ మంగళమ్॥